# జాతీయ ప్రసంగసాహితి



ఆచార్య ఎస్. గంగప్ప

శశీ ప్రచురణలు
'సుధర్మ'
సి-73, శ్రీనివాసనగర్ కాలనీ
గుంటూరు

జాతీయ ప్రసంగసాహితి

[U.G.C. NATIONAL LECTURES]

రచయిత :

ఆచార్య ఎస్. గంగప్ప ఎం.ఏ., పిహెచ్.డి.,

తెలుగు ప్రాచ్యభాషా విభాగం

నాగార్జున విశ్వవిద్యాలయం

నాగార్జున నగర్-522510, గుంటూరు జిల్లా.



ప్రథమ ముద్రణ : మార్చి 1995

ప్రతులు : 1000

వెల : రూ 40/-

ప్రతులకు :

శ్రీమతి ఎస్. పార్వతమ్మ

శశీప్రచురణలు

'సుధర్మ'

సి-73, శ్రీనివాసనగర్ కాలనీ

గుంటూరు-522006

ఫోన్ నెం : 231805

ఈ గ్రంథముద్రణకు రూ. 4000/-లు ఆర్థిక సాహాయ్యమందించిన వారు

నాగార్జున విశ్వవిద్యాలయంవారు

ముద్రణ : శ్రీలక్ష్మిగణపతి ప్రింటర్స్ 5/1, బ్రాడీపేట గుంటూరు.

# విషయ సూచిక





# భూమిక

ఇది 'జాతీయ ప్రసంగ సాహితి'. ఇంతకు పూర్వమే వెలువరించిన 'కోలాచలం శ్రీనివాసరావు-నాటక సాహిత్యసమాలోచన' మనే సిద్ధాంత గ్రంథం మొదలుకొని, అనేక బహుమతులకు నోచుకొన్న నా యితర గ్రంథాలు - మౌలిక గ్రంథాలతో పాటు వ్యాస సంపుటాలు- సహృదయ పాఠకులకు, విద్యార్థులకు, పరిశోధక విద్యార్థులకు ఆదరపాత్రం కావడం ముదావహం. వివిధ సాహిత్య ప్రక్రియలపై పలు సందర్భాల్లో సాహిత్యసదస్సుల్లో, గోష్ఠుల్లో సమర్పించిన వ్యాసాల్ని, అనేక పత్రికల్లో ప్రకటించిన వ్యాసాల్ని, ఆయా సందర్భాల్లో వ్యాస సంపుటాలుగా ప్రకటిస్తూరావడం జరిగింది. అదేరీతిగా ప్రస్తుతం ఈ 'జాతీయ ప్రసంగ సాహితి' వ్యాససంపుటి.

1989-91 సం. లలో విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం (U.G.C.) నన్ను జాతీయాధ్యాపకుడు (National Lecturer)గా ఎంపిక చేసి గౌరవించింది.

దీనికితోడు 1989-90 సం.కు కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు వారు నన్ను యు.జి.సి. విజిటింగ్ ఫెలో (U.G.C. Visiting Fellow)గా ఎంపిక చేసి ఆహ్వానించారు.

తదనుగుణంగా 1989-91 సం.ల మధ్య కాలంలో నేను మద్రాసు విశ్వ విద్యాలయం తెలుగుశాఖలోను, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం తెలుగుశాఖ లోను, అలీగఢ్ముస్లిమ్ యూనివర్శిటీఆధునిక భారతీయభాషల విభాగంలోను, తెలుగు విశ్వవిద్యాలయం రాజమండ్రి ప్రాంగణం సాహిత్య పీఠంలోను-విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం జాతీయాధ్యాపకుడిగా వివిధాంశాల గూర్చి ప్రసంగించాను.

అలాగే కాకతీయవిశ్వవిద్యాలయం, తెలుగుశాఖలో విజిటింగ్ ఫెలో గా ప్రసంగించాను.

పై ప్రసంగాలే-కొన్ని ఆంగ్ల ప్రసంగాలు మినహాయించి- ఈ జాతీయప్రసంగ సాహితి.వాటికితోడు చివరి నాలుగు వ్యాసాలు పుట్టపర్తి నారాయణాచార్యుల వారి 'మేఘదూతంలో సామాన్య జనజీవనం, విశ్వనాథవారి రేడియో నాటికలు- తెలుగు సాహిత్యం: అనుశీలన, జానపదవాఙ్మయ మహత్త్వం, జానపద-మహిళ' అనేవాటిని ఇందులో చేర్చాను. ఇందులో ఎర్రన సాహిత్యంలో రసచర్చకు, పదసాహిత్యానికీ, కవిత, నాటకం మొదలైన ఆధునిక సాహిత్య ప్రక్రియలకు సంబంధించిన పదిహేను వ్యాసాలున్నాయి.

నా యీ 'జాతీయ ప్రసంగ సాహితి' విద్యార్థులకు, పరిశోధక విద్యార్థులకు ఆచూకీ గ్రంథం (Reference Book) లాగా ఉపకరిస్తూ, సహృదయపాఠకులను సైతం అలరిస్తుందని ఆశిస్తున్నాను.

ఆచార్య ఎస్. గంగప్ప.

# కృతజ్ఞతలు

1989-91 సం.లలో నన్ను జాతీయాధ్యాపకుడు (National Lecturer)గా ఎంపిక చేసి,గౌరవించిన విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం వారికి........(U.G.C.)

1989-90 సం.లో నన్ను యు.జి.సి. విజిటింగ్ ఫెలోగా ఎంపిక చేసి. నన్నాహ్వానించిన కాకతీయ విశ్వవిద్యాలయం వారికి........

జాతీయ ప్రసంగాలు చేయడానికై వెళ్ళిన సందర్భంలో అలీగడ్, బెనారస్' మద్రాస్, తెలుగు విశ్వవిద్యాలయం రాజమండ్రి ప్రాంగణం, బొమ్మూరులోను, విజిటింగ్ ఫెలోగా ప్రసంగించినప్పుడు కాకతీయ విశ్వవిద్యాలయంలోను చక్కటి ఆతిథ్యమిచ్చి, ఆదరించిన ఆయా విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులకు, ఆయా శాఖాధ్యక్షులకు, అధ్యాపక మిత్రులకు........

ఈ వ్యాసాలు కొన్నింటిని పత్రికల్లోను, మరికొన్ని కళాశాలలప్రత్యేకసంచికల్లోను ప్రచురించిన ఆయా పత్రికాధిపతులకు........

యు.జి.సి. జాతీయ ప్రసంగాలు చేయడానికి, విజిటింగ్ ఫెలోగా వెళ్లడానికి అనుమతించి తోడ్పడడమేగాక, నా ప్రసంగాలు గ్రంథరూపంలో 'జాతీయ ప్రసంగ సాహితి'గా రూపొందడానికి రూ. 4000/-లు ఆర్థిక సాహాయ్యంచేసి సహకరించినందుకు నాగార్జున విశ్వవిద్యాలయం అధిపతులకు........

మా మైత్రికి ప్రతీక నా 'జాతీయప్రసంగ సాహితి' గ్రంథాన్ని ఆనందంతో స్వీకరించిన మాన్యమిత్రులు డా॥ వి. రంగారావు గారికి........

**నా కృతజ్ఞతలు !**

ముచ్చటగా ముద్రించి ఇచ్చిన మిత్రులు, శ్రీ లక్ష్మీ గణపతి ప్రింటర్సు అధినేత శ్రీ బి.వి.ఎస్. శాస్త్రికి, వారి సిబ్బందికి నా అభినందనలు.

ఆచార్య ఎన్. గంగప్ప.

# PREFACE

The present work "JATHIYA PRASANGA SAHITHI". is the result of my continuous Academic persuits and efforts.

I was secleted as National Lecturer for the years 1989-91 by the U.G.C. and delivered Lectures on different topics in Telugu and English at Aligarh Muslim University, Banaras Hindu University, Madras University and Telugu University during 1989-91. In addition, I also delivered Lectures as Visiting Fellow in the Department of Telugu, Kakatiya University in 1989-90.

I have brought out my National Lectures and other Lectures delivered at Various Universities as mentioned above, in addition to the recent articles as "JATHIYA PRASANGA SAHITHI".This work of mine, I hope, will serve as a Reference Book not only to the students but also to the researehers as well.

My thanks are due to the authorities of Nagarjuna University who permitted me to deliver Lectures as U.G.C National Lecturer and Visiting Fellow at Various Univarsities and helping me financially by gronting Rs 4000/- as Publication grant to bring out this work in this form.

I must also thank the U.G.C. for selecting me as U.G.C. National Lecturer and Kakatiya University for selecting as Visiting Fellow and all the authorities of all those Universities who have shown fine hospitality at the time of my visit to deliver lectures and at the last, if not the least, to all those who helped me to carry on this task successfully.

I must also express my gratitude and sincere thanks to Dr. V. Ranga Rao, M.S., who readily accepted my work to be dedicated as a symbol of our fond friend ship since my coming over to Guntur.

Prof. S. GANGAPPA

# అంకితం

శస్త్రచాలనా నైపుణ్యం
సరసహృదయ సత్కారుణ్యం

మనిషిని మనిషిగాచూసే మీవ్యక్తిత్వం
మనసునిస్తే ఆకట్టుకొనే మీతత్వం

సరస సాహిత్యమయినా
చక్కటి లలితకళలయినా

ఉపకరించే వైద్యమైనా మీవృత్తి
పీటి కేమీ అడ్డుకాదు మీ ప్రవృత్తి

పేషంటుగా మిమ్ము దర్శించినా
సాహితీకళల గూర్చి చర్చించినా
ఇట్టేకలుగుతుంది మీసాంగత్యం
మెల్లన బలపడుతుంది సాన్నిహిత్యం

మీమైత్రి మధురం మందార మరందం లా
మీమైత్రి సుందరం నిండుపున్నమి జాబిల్లి లా
మీమైత్రి పరిమళం తెలతెల్లనీ మల్లెలులా
మీమైత్రి నినాదం చిరుమువ్వల సవ్వడిలా

ఇదిగో మన ఇద్దరి మైత్రికి ప్రతీక ।
నా 'జాతీయ ప్రసంగసాహితి' కానుక !

అందుకోండి డా॥ వి. రంగరావు మహాశయా !
మనసుపండి నెనరునిండిన సహృదయసదయా !

ఆచార్య. ఎన్. గంగప్ప

# పద సాహిత్యానికి జానపద సాహిత్యానికి గల సంబంధం

పద సాహిత్యానికి జానపద సాహిత్యానికి గల సంబంధాన్ని ఆ పద బంధాలలోని 'పద' శబ్దమే నిరూపిస్తుంది. ఇందులోని పదాలు రెండూ ఆడి పాడుకోడానికి ఉపకరించేవే. 'జానపదం' అనాది నుంచి ఉన్నా అద్యతన కాలంలోనే గుర్తించబడి పండిత పరిశోధకుల మన్ననలకు పాత్రమైంది. 'పదం' మధ్యకాలంలో పండిత కవులచే కూర్చబడి, అభినయించబడింది. జానపదం కేవలం శిష్టేతరులైన జన పదాలలో నివసించే జానపదులకే పరిమితం. పదం శిష్టులు, భక్తులు, తాత్వికులైన వారి మూలంగా ప్రచారంలోకి వచ్చింది. పైపెచ్చు ఈ రెండింట పరస్పరం ఆదాన ప్రదానాలు ఉండటం మూలాన పదసాహిత్యానికీ, జానపద సాహిత్యానికీ గల నికట సంబంధం మరింతగా నిరూపిత మవుతుంది.

ప్రపంచంలోని సర్వసాహిత్యాలలోనూ జానపద సాహిత్యంఅనాది మాత్రమే కాదు, అది అన్నింటికి పునాది. ఆ తరువాతనే పదసాహిత్యంగానీ, పద్యసాహిత్యం గానీ వెలసిందన్న అంశం సర్వ పండిత లోకానికి సువిదితమే !

అజ్ఞాత కవుల రచన జానపద సాహిత్యం.జ్ఞాత కవుల రచన పదసాహిత్యం. జానపద కళారూపాలైన- పాడుతుంటే విని సంతోషించదగిన వీరగాథాగేయాలూ, ఆడిపాడుతుంటే చూసి ఆనందించదగిన యక్షగానాలూ మొదలైన వాటికిమాత్రమే తత్కర్తల గూర్చి మనకు తెలుస్తుంది. పదసాహిత్యకారులు అంటే పదకర్తలు లేక వాగ్గేయ కారుల పేర్లు సుస్పష్టమే. పేరు తెలియకపోతే అవి జానపద సాహిత్యంలోనే చేరిపోతాయి. జానపద సాహిత్యం మౌఖికం (Oral). ఇది ఎక్కడా ప్రాచీన కాలంలో లిఖితం కాలేదు; అంటే గ్రంథస్థం కాలేదు. కారణం అది పల్లెటూళ్ళలోని పామరులకు మాత్రమే పరిమితమై ఉండడమే పండిత ప్రమోదానికి నోచుకోకపోవడమే కాదు. పండితుల ఈసడింపుకు గురికావడమే అని ప్రత్యేకంగా పేర్కొననక్కరలేదు పదసాహిత్యం పద్యసాహిత్యంలాగా ఆరంభంలో రాజుల మెప్పులను పొందకపోయినా క్రమంగా రాజుల చేత గౌరవింపబడి, పండిత ప్రశంసలు సైతం పొందగలిగింది.

జానపదసాహిత్యం మౌఖికం (Oral) మాత్రమే కావడం మూలాన 'ముఖేముఖే సరస్వతీ' అన్నట్లు ఒకన్నోటి నుండీ మరోనోటికీ, మరోనోటి నుండి ఇంకో చెవికీ, ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికీ, కించిత్తు భేదాలతో అంటే సందర్భోచితంగా చిరు మార్పులు, చేర్పులు, చేర్పులకు గురి అవుతూ గాలిలా స్వచ్ఛంగా వ్యాపించింది. పద సాహిత్యం లిఖితం కావడం వల్ల దీనికి మొదటి నుంచి ఒక ప్రత్యేకత ఉంది. ఒక క్రమ పద్ధతి ఉంది.

జానపద సాహిత్య రచయితలు ఎందరో కనుక అందులో ప్రజల కష్ట సుఖాలు, సంతోష సౌమనస్యాలు, శృంగార హాసిత్యాలు, సరదాలు, నీత్యుపదేశాలు, భక్తి వేదాంత పారమార్థికాది సమస్తవిషయాలు అద్దం పట్టేలా చక్కగా వ్యక్తమవుతాయి. పదసాహిత్యం చాలా వరకు భక్తి, శృంగార, మధురభక్తి, వేదాంత వైరాగ్యనీతి బోధకమై ఉంటుంది. ఇందులోని శృంగార మధుర భక్తులలో సంయోగ వియోగాలూ, సరసాలూ, విరసాలూ సైతం వ్యక్తంకాకుండా పోవు.

సాహిత్యం మార్గ దేశి అని రెండు విధాలు.ఆయాప్రాంతాలలో ఆయాపామర ప్రజలచేత వాడబడి, పాడబడుతూ పరివ్యాప్తమైంది దేశి. లక్షణ బద్ధమై పండిత పరిమితమైంది మార్గ.

ఈ మార్గదేశి విభాగం మొదట సంగీత పరంగానూ ఆ వెనుక నృత్య పరంగానూ, ఆ తరువాత సాహిత్య పరంగానూ నిరూపించబడింది.

తెలుగు సాహిత్యాన్ని పండిత సాహిత్యమూ, పామర సాహిత్యమూ అని స్థూలంగా రెండు విధాలుగా విభజించవచ్చు. ఇంతకంటే శిష్ట సాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూ అనడం సమంజసం. ఈ శిష్ట సాహిత్యం కంటే శిష్టేతరసాహిత్యమే ఆదిలో ఆవిర్భవించి వికాసం పొందింది. ఆతరువాతనే సంస్కరించబడి శిష్ట సాహిత్యం ప్రామాణికమైంది; ప్రాచుర్యం పొందింది. పామరసాహిత్యం ఓవక్కా, పండిత సాహిత్యం మరోవక్కా పేటికనే కొనసాగుతూ వచ్చాయి. కానీ రాజాదరణ లభించిన పండిత సాహిత్యం లిఖితమైంది. చాలావరకు నిలిచింది.ప్రజలలోమాత్రమే ఆదరణ ఉన్న పామరసాహిత్యం కేవలం మౌఖికం కావడం వల్ల కాలగర్భంలో ఎంతోకలిసి పోయింది.

తెలుగు సాహిత్యపు మాగాణంలో శిష్టేతర కవితాప్రవాహం మూడు పాయలుగా ప్రవహిస్తూ వచ్చింది. మొదటిది కేవలం జానపద కవిత; దానిపుట్టుక అనాది; లిఖితం కాలేదు. కేవలం మౌఖికం మాత్రమే.

రెండోది నన్నయకు పూర్వమే శాసనాల్లో అక్కడక్కడా చోటుచేసుకొన్న పాల్కురి సోమనాథునితో ప్రారంభమైనది ద్విపద కవిత. దీనికి మళ్ళీ జానపదులలో వ్యాప్తిలోనున్న ఏలలు, రోలలు మొదలైన పదరూపాలే ఆధారం. ద్విపదని గ్రహించడమే కాదు, పాల్కురికి దీనికి కావ్యభాషా ప్రతిపత్తిని కల్పించాడు; అంటే పండితులు సైతం గౌరవించేట్టు పాటు పడ్డాడు.

ఇక మూడోది తాళ్ళపాక అన్నమాచార్యుని (1408-1503) తో ఆరంభమైన సంకీర్తన కవిత. ఇదీ తెలుగులోని పద కవిత. ఈ పద కవితకు పూర్వం కృష్ణమాచార్యుడు (1268-1323) సింహగిరి వచనాలు రచించి తరించాడు. అనాది నుంచి పామర ప్రజలను అలరిస్తూ వచ్చిన జానపద గేయ రీతుల్ని గ్రహించి అనేక పదకవితల్ని శిష్టకవితల్లో ఒకభాగంగా మెలయించి పండిత ప్రశంసలకు పాత్రమైన పద్యకవిత పీఠం పక్కనే పదకవితకు సైతం సరిపీఠం వేసిన ఘనత అన్నమాచార్యునికే దక్కింది. పద పద్యాలలో పదమే ముందు ఆవిర్భవించిందని సర్వ పండితాంగీకృత విషయం.[1] అదే రీతిని తెలుగు సాహిత్యంలోనూ పదమే ప్రథమంగాపుట్టింది. నన్నయ కంటే ముందే ఎంతో దేశి అయిన జానపద సాహిత్యం ఉండే ఉంటుంది. అది లిఖితం కాకపోవడం తెలుగుజాతి దురదృష్టం. తమిళంలో ప్రాచీన సాహిత్యమంతేలిఖితమైన ఈజానపదసాహిత్యమే.కన్నడవచనాలుపేరుకు వచనాలేగాని పాడుకోడానికి ఉపకరించేవే. కన్నడదాససాహిత్యానికి ఎంతో ప్రసిద్ధి ఉన్న సంగతి స్పష్టమే. తెలుగులో సైతం నన్నయ్యకు పూర్వం తరువోజలు, మధ్యాక్కరలు, రగడలు కవులు రచిస్తూ ఉండేవారు. తెలుగు దేశీయతను సమాదరించిన పాల్కురికి సోమనాథుడు తనకాలంలోని అనేక పదాలను పేర్కొన్నాడు.[2] తాళ్ళపాక అన్నమాచార్యుడు, అతని పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు, క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి, త్యాగరాజు మొదలైన వాగ్గేయకారులేగాక ఇంకా ఎందరో మహానుభావులీ పద సాహిత్యానికి పట్టంగట్టి పరిపోషించారు, ఈనాటి వరకూ కొన సాగుతూనే ఉంది.

జానపద సాహిత్యం అనాది అయినా ఆదిలో అనాదృతమైంది. ఈనాడు జానపద సాహిత్యానికి మంచిరోజులు వచ్చాయి. జానపద సాహిత్య సేకరణ, పరిశోధనలు జరుగుతున్నాయి. జానపద బాణీలో రచనలు సమకాలికంగా కొన సాగుతున్నాయి. ప్రజల మన్ననలకు, పండితుల ఆదరానికి నోచుకొంటున్నాయి.

పదాల్లోను, జానపదగేయాల్లోను పల్లవి ఉంటుంది. అయితే పదాల్లో: పల్లవితోపాటు అనుపల్లవి కూడా ఉంటుంది. జానపద గేయాల్లో ఇలాంటిదే కాకపోయినా ఏదో ఒక పద్ధతిలో మొదట ఒకటిగానీ లేక కొన్ని పదాలుగానీ పల్లవిగానూ, ఆ వెనుక మళ్ళీ ఒకటిగానీ మరికొన్ని పదాలుగాని పునరుక్తి అవుతూ ఉంటాయి. పదాల్లో పల్లవి, అనుపల్లవుల తరువాత మూడు చరణాలుంటాయి. కొన్నింట రెండు చరణాలూ ఉంటాయి. ఈ పద్ధతి జానపద గేయాల్లో కనిపించదు. జానపద గేయాల నిడివి ఎంతైనా ఉండవచ్చు.

పదాల్లో జానపదగేయ రీతులుండడం ఎంతైనా సహజ విషయం. ఈ జాన పద గేయ బాణీలనుంచే నమూనాలు గ్రహించి పదరచన చేసినట్లు స్పష్టమవుతుంది. అందరు పదకర్తల్లోని పదాల్లోను వ్యావహారిక భాష వ్యక్తమవుతూంది: కాగా జాన పదబాణీలు అన్నమాచార్యుని సంకీర్తనల్లో - తక్కిన వాగ్గేయకారులకంటే - అత్యధికంగా మనకు కనిపిస్తాయి. నా అధ్యయనంలో అన్నమాచార్యుని సంకీర్త నల్లో వెల్లడైన జానపద గేయరీతులు కొన్ని; గొబ్బిళ్ళు (12.98) అల్లోనేరేళ్ళు (12-179), జాజర (12-274, 332 , సువ్వి (12-361) ఛాంగుభళా (12-107) తందనాన (7-151), కూగూగు (4-56), జోల (అ.చ. పీఠిక. పుట 6), శోభనం (12-18), దోబూచి (12-227) ఉయ్యాల (12-246, 343) మేలుకొలుపు (12-352) చందమామ (42-35), ఎచ్చరిక (అ.చ. పీఠిక పు. 67) మంగళం (3-227) మొదలైనవి మనకు విదితమవుతాయి. ఇంకా ఏల, లాలిపాటలే గాక మరెన్నో జానపద గేయ బాణీలకు ఈ పదాల బాణీలను చూడవచ్చు.

కాగా పదసాహిత్యానికీ జానపదసాహిత్యానికీ గల సంబంధం కొన్ని పదా లకు జానపద గేయాలే ఆధారమై ఉండవచ్చుననడానికి అవకాశముంది. అలాంటి కొన్ని ఉదాహరణల్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. అందుకు నేను సేకరించిన 'జానపదగేయాలు' పుస్తకంలోని జానపదగేయాల్నే ఇక్కడ ఉదాహ రిస్తాను. గొబ్బిళ్ళు : కలుపుతీతల సమయంలోను, నాట్లువేసేప్పుడు పాడేపాట,

"చందమామ చందమామ నెల చందమామా ॥గొబ్బిళ్ళో॥
చందమామ కూతురుబు నీలార కన్నెలు ॥గొబ్బిళ్ళో॥
నీలార కన్నెలకు ఒకచేదబాయో ,,
ఒకచేదబాయికీ ఒక చేదబిళ్ళో ,,
(జానపదగేయాలు పు 28-32)

ఇలానడుస్తుందీ పాట, ఇక్కడ గొబ్బిచ్ఛ 'గబ్బిళ్ళో' అయింది. అన్నమాచార్యుని పదం :

"కొలను దోపరికి గొబ్బిళ్ళో యదు
కులస్వామినికిని గొబ్బిళ్ళో ॥పల్లవి॥
కొండ గొడుగుగా గోవుల గాచిన
కొండొక శిశువుకు గొబ్బిళ్ళో

దుండగం పు దైత్యుల కెల్లను తల
గుండుగండనికి గొబ్బిళ్ళో ॥కొలను॥ (12-98)

అల్లోనేరేళ్ళు :

"అల్లో నేరిడల్లా అల్లో నేరిడి కింద చల్లని చెలిమి ॥అల్లోనేరిడల్లా॥
చల్లని చెలిమి తావసెద్ది తినగా మరిది । ,, ,,
(జానపద గేయాలు. పు. 139)

"నెయ్యము లల్లో నేరేళ్ళో
వొయ్యన పూరెడి వువ్విళ్ళో ॥ పల్లవి ॥
పలచని చెమటల బాహు మూలముల
చెలమలతోనే జెలువముతే
ధళ ధళ మను ముత్యపు జెలుగు సురటి
ధులి పేటి, పీళ్ళ తుంపిళ్లో ॥నెయ్యము॥
(12-179)

సువ్వి పాట :

"సువ్వి కస్తూరి రంగ సువ్వి
రామాభిరామ సువ్విలాలీ ॥" (జానపదగేయాలు పు. 25)

"సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెద రోలీల" ॥పల్లవి॥

"వనితల మనసులు కుందెన చేసిటు
వలపులు తగినించోలాల
కనుసన్నలనెదురోకండ్లను
కన్నెలు దల చెదరోలాల ॥సువ్వి॥ (12-353)

జోల పాట :

"జో అచ్యుతానందా జోజో ముకుందా
లాలి పరమా నంద రామ గోవిందా లాలీ ।
తొలుత బ్రహ్మాండంబు తొట్టి గావించీ
నాలుగూ వేదములు గొలుసులమరించీ ॥జో॥

(జానపద గేయాలు పు. 129, 130)

"జోవచ్యు తానంద జో జో ము కుంద
రాపె పరమా నంద రామ గోవింద ॥పల్లవి॥

అంగజాగన్న మా యన్న యిటు రారా
బంగరు గిన్నెలో పాలు పోసేరా
దొంగని నీవని సతులు పొంగుచున్నారా
ముంగిట నాడరా మోహనాకారా ॥జోవచ్యుతా॥

ఉయ్యాల పాట :

"అలాక మంచము మాల్లానరము అమరతిప్పారే
ధాములకి అమర తిప్పారే ॥అలాక॥

తనక్క మానే పూల వస్త్రము పైనా కప్పారే
రామలకి పైనా కప్పారే ॥అలాక॥
(జానపద గేయాలు-పు. 140)

"ఉయ్యాలా బాలు నూ చెదరు కదు
నొయ్య నొయ్య నొయ్యనుచు ॥పల్లవి॥

బాల యవ్వనులు పసిడి వుయ్యాల
బాలుని వద్ద బాడేరు
లాలి లాలి లాలి లాలెమ్మ యెల్ల
లాలి లాలి లాలి లాలనుచు ॥ఉయ్యాలా॥ (12-246)

మేలుకొలుపు :

"గోవింద అని నిన్ను గోపికలందరూ
గొల్ల వారందరూ కొలుసుకున్నారు ॥మేలుకో కృష్ణా మేలుకో॥
నారాయణా యని నిన్ను నమ్మి నీ భక్తులు
మోదము చెందుతున్నారు ॥మేలుకో॥

(జానపద గేయాలు- పు 128)

"విన్నపాలు వినవలె వింత వింతలు ॥పల్లవి॥
పన్నగపు దోమ తెరపైకెత్తవేలయ్య ॥అ.ప.॥

తెల్లవారె జామెక్క దేవతలు మునులు
అల్లనల్లనంత నింత నదిగో వారే
చల్లని తమ్మి రేకుల సారసపు గన్నులు

మెల్ల మెల్లనె విచ్చి మేలుకొన నేలయ్యా ॥విన్నపాలు॥ (4-25)

ఇవి కొన్ని నా సేకరణలోని జానపద గేయాల నుంచి ఉదాహరణలు వాటికి అన్నమాచార్యుని సమానమైన పదాలు.

మరికొన్ని ఇతర జానపద గేయ రీతుల్ని చూడవచ్చు.

జాజర :

"వీణాగానము పెన్నెల సేట
రాణమీరగా రమణుల పాట
ప్రాణమైన పిన బ్రాహ్మణు వీట
జాణలు మెత్తురు జాజర పాట"

(నాచన సోమనాథుని వసంతవిలాసం)

"చాలు నీ జాజర నన్ను
జాలి బరచె నీ జాజర ॥పల్లవి॥
వలపు వేదనల వాడెను యీ
తలనొప్పు లవే దలకేసు
పులకల మేనితో గొరలేసు కడు
జాలిగొని చల్లకు జాజర॥ ॥చాలు చాలు॥ (12-332)

ఏల పాట :

"సూర్య చంద్ర వహ్నినదుమా
శౌర్యమానే చిలుక గంటీ
సూర్య దీప్తి గాయు పెంశగా—యేగంటి లింగా
చూడ చూడాశ్చర్య మాయే"[3]
"మేడలెక్కి విస్సు జూచి
కూడేవనే యీ శ తోడ
వాడువేరి వుప్పురం దురా - వేంకటేశ
యాడ సుంటి విందాతానునా॥"[4]

ఇవికొన్ని మాత్రమే. ఇంకా ఇలాగే మంగళహారతులు, హెచ్చరికలు తత్త్వాలు, వాకోవాక్యాలు మొదలైన రీతులు ఎన్నో ఉన్నాయి. వాటికన్నిటికీ ఉదాహరణలు జానపద సాహిత్యంలోనూ, పదసాహిత్యంలోనూ సమంగా గుర్తించగలం.

ఇలాగే తెలుగు జానపద గేయాలకు కన్నడ పదాలకు సంబంధ మున్నట్లు తెలుస్తుంది.

వాగూ వంకా లేని కోటా కట్టిరి మూడు చెరువులు
రెండు నిండనే లేదు ఒకటి ఎండే పోయే ॥— అనే ఈ తెలుగు జానపద గేయం లాంటిదే కన్నడంలో పురందరదాసు కృతమైన పదం ఉంది—
ముళ్ళుకొనిమెయేమేలె మూడుకెరెయ కట్టి
ఎరడు బరిదు ఒందు తుంబలిల్ల "[5]—ఇవి సమానంగా ఉండడంలో విశేషముంది.

ఇలాగా సోదాహరణంగా నిరూపించినట్లు జానపద సాహిత్యానికీ, పద సాహిత్యానికీ దగ్గర సంబంధమున్న విషయం స్పష్టమవుతూంది. పైపెచ్చు జానపదంలోనుంచే గ్రహించబడి నిబద్ధత చేయబడి అంటే లక్షణ బద్ధం చేయబడిన పద సాహిత్యం ప్రత్యేక ప్రామాణికతను సంతరించుకొంది. అయినా ఈ రెండింటి సంబంధమూ సుస్పష్టమవుతూందన్నది సిద్ధాంతం !

1 1) R.G. Moulton : Methods and Materials of literary Criticism. P, 13, 14.
ii) „ : The Modern Study of Literature : An Introduction to Literary Theory and Intrepretation. P. 605
iii) పింగళి లక్ష్మీకాంతం : పీఠిక-పల్నాటివీర చరిత్ర - పు 20-25
iv) రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ : సాహిత్యోపన్యాసములు-3 క్షేత్రయ్య పదసాహిత్యము. పు. 12, 13.
2. పాల్కురికి సోమనాథుడు : పండితారాధ్య చరిత్ర. పు. 513
3. కోరాడ రామకృష్ణయ్య. దక్షిణ భాషాసారస్వతములు : దేశి.పు. 239
4. తాళ్ళపాక కవుల పదకవితలు—భాషా ప్రయోగ విశేషాలు(ద్వితీయభాగము) పు. 369—365
5. వివరాలకునా "జాతికి ప్రతిబింబం - జానపదసాహిత్యం—తెలుగు కన్నడ జానపదగేయాలు - తులనాత్మక అధ్యయనం పు. 117-126

# ఎఱ్ఱన-వీర రసపోషణ

ఎఱ్ఱన తెలుగు సాహిత్యంలో ప్రముఖ కవి. ఆర్ష సాహిత్యాన్ని తెలుగు వారికందించిన కవిత్రయంలో మూడవవాడు. నన్నయ తిక్కనలు భారతానువాద విధానంలో చక్కగ బాటలువేసి తీర్చిదిద్దగా ఆ మార్గాలను అనుసరించి, వారితో సమాన ప్రతిపత్తితో కృతుల రచించిన ఎఱ్ఱన తన ప్రత్యేకతను నిలబెట్టుకొన్న మహాకవి. నన్నయ తెలుగున పద్య విద్యకు ఆద్యుడుకాగా, తిక్కన తెలుగు పలుకుబడి, నుడికారాలను, దేశీయతను పరిరక్షించి, రసాభ్యుచితబంధంతో ఔచిత్యాన్ని ప్రసాదించిన తెలుగు సాహిత్య స్రష్టగా సర్వపండిత లోకానికీ సువిదితుడే. ఆ ఇద్దరి మహనీయుల రెండు తీరులను సమ్మిళితంచేసి తనదైన రీతిలో తెలుగు కవిత్వ పటుత్వ రచనా ధురంధరుడైన ప్రబంధ పరమేశ్వరుడు ఎఱ్ఱన. నరస సాహిత్య నిర్మాత అయి తెలుగు వాఙ్మయ చరిత్రలో ఎఱ్ఱన యుగకర్తగా ప్రసిద్ధుడయ్యాడు.

అలాంటి ఎఱ్ఱన తన కృతులైన హరివంశం, నృసింహ పురాణం, అరణ్య పర్వశేషం అనే వాటిలో వీరరసపోషణ ఎలా నిర్వహించాడో పరిశీలించడమే ప్రస్తుత ప్రయత్నం.

కావ్య పఠనంవల్ల గాని, కావ్యశ్రవణంవల్ల గాని సహృదయ హృదయంలో కలిగే ఆనందమే రసానందం. అందుకే 'రస్యతే ఇతిరసః' అని చెప్పబడింది. 'రసోవైసః' 'రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి' (తైత్తరీ యోపనిషత్తు-2-7-) అంటే పరమాత్మయే రసమని అర్థం. అందుకే లాక్షణికులు కావ్యానందాన్ని బ్రహ్మానంద సహోదరంగా పేర్కొన్నారు. ఈ విషయాన్నే భరతమహర్షి కావ్యపరంగా 'నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే' - (నాట్య శాస్త్రము-పు-92) రసం లేకుంటా కావ్యార్థమే లేదని తెలుపడం జరిగింది. 'వాక్యం రసాత్మకం కావ్య' మ్మన్న విశ్వనాథుని నిర్వచనం సర్వపండిత సమాదరణీయం. జగన్నాథ పండితరాయలు 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య'మ్మన్నది కావ్య రస

పై శిష్ట్యాన్ని నిరూపిస్తుంది. కనుకనే రసపరిపోషితకృతి సత్కృతి అవి స్పష్ట మవుతుంది.

భరతమహర్షి చెప్పిన ప్రకారం పాఠాంతరాలవల్ల ఎనిమిదనీ, తొమ్మి దనీ రససంఖ్యను గూర్చిన చర్చ ఉన్నది. కానీ శాంతం రసమనే నిర్ణయానికి వచ్చిన ఆలంకారికులు తొమ్మిదనే అంశాన్ని అంగీకరించారు.

'శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ నవనాట్యే రసాః స్మృతాః"
(నాట్యశాస్త్రము-7)

ఈ నవరసాలకు వరుసగా స్థాయిభావాల్ని పేర్కొన్నాడు మహర్షి.

'రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయ శమాః స్థాయి భావా నవక్రమాత్ (పైదే.)

ఈ రస సంఖ్యను గూర్చిన చర్చ మరింతగా సాగింది. అది ప్రకరణాంతరం.

విభావానుభావ వ్యభిచారీ భావాల సంయోగం వల్ల రస నిష్పత్తి అవుతుందనీ 'విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః' - (పై దే.పు. 93) భరతుని రస నిష్పత్తి సూత్రం. ఇట్లే విభావానుభావ సాత్త్విక వ్యభిచారీ భావాలచేత అస్వాద్యమానమైన స్థాయి భావమే రసమనీ ధనంజయుని నిర్వచనం.

'విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభి చారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయిభావో రసస్మృతః (దశరూపకం-41)

స్థాయి అంటే స్థిరంగా ఉండేది. స్థాయి భావమంటే రసస్ఫూర్తి వరకు సహృదయ హృదయాల్లో నిలిచి ఉండేది. ఇది నవరసాలకు వర్తిస్తుంది.

ప్రస్తుతాంశం వీరరసపోషణ సమీక్ష. ఎఱ్ఱన తన కృతులలో వీరరసాన్ని పోషించిన తీరుతెన్నులను పరిశీలిద్దాము.

ఉత్తమ నాయకాశ్రయమైంది వీరరసం. జయించదగ్గవారు (జేత వ్యులు) ఆలంబన విభావం. వారి చేష్టలు, భేరీపటహాదిధ్వనులుద్దీపన విభావములు. ధీరత్వ స్థిరత్వశౌర్యౌదార్యత్యాగ వైశారద్యాదులు అనుభావాలు. రోమాంచం

వేపథువు మొదలైనవి సాత్త్విక భావాలు. ధృతి, మతి, గర్వం, ఆవేశం మొదలైనవి వ్యభిచారిభావాలు.

'ఉత్తమ ప్రకృతి ర్వీర ఉత్సాహస్థాయి భావకః'
వీరరసం ఉత్తమ నాయకాశ్రయం. దీనికి స్థాయి భావం ఉత్సాహం.
'లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్స్ యత్న ఉత్సాహః'
(ప్రతాపరుద్ర యశోభూషణం - పు. 195).
లోకోత్తర కార్య నిర్వహణంలోని దృఢదీక్షయే ఉత్సాహం.

ఈ వీరం రసగంగాధరంలో ఎనిమిది విధాలని పేర్కొనబడింది. కానీ అందులో సత్య, పాండిత్య, క్షమా, బలప్రాలు గాక యుద్ధవీర, దానవీర, దయా వీర, ధర్మ వీరాలు అతి ముఖ్యమైనవిగా ప్రసిద్ధం.

వీరరసపోషణం ఎర్రన కృతులన్నిటా సమర్థంగా జరిగింది. అందులోను హరివంశంలో శ్రీకృష్ణుని శత్రుసంహార సమయమందంతటా శ్రీకృష్ణుని వీరం అత్యున్నతంగా జరిగింది.

**యుద్ధవీరం :**

శ్రీకృష్ణుడు చాణూరునితో మల్ల యుద్ధసమయంలో యుద్ధవీర రసోచితంగా పల్కిన పల్కులు :

"విను నిఖిలార్థ కారియుగ నెమ్మది నమ్మిన వాఁడు కంసుఁడె
య్యె మనుప్రగుప్తి పోక బలమంతయుజూపుదుగాక చిత్తర
జ్ఞనఁ బనిదీఱునే వెరగ బండితనంబున నీవు గన్న యీ
యనుపమకీర్తి కింతటి సహాప్తిమొనర్పఁగఁ జూప వచ్చితిన్ (హరివంశం
పూ.భా. 9-115)

"కఱఁబెద్దక్రొవ్విన కాళియుతలలెల్లఁ జిదియంగఁ ద్రొక్కిన పదతలములు
దుష్టాత్ముఁడైన యరిష్టుని మెడవట్టి పొరినొవ విఱిచిన భుజయుగంబుఁ
బిసితాశియగు కేశిఁ బ్రేవులు వెడలంగఁగడిమిమై దిగిచినఖరనఖరము
ల వినీతిఁ బెనకిన కువలయాపీడంబు మోరఁ బగిల్చిన ముష్టి బలుపు,

నెఱుగ వ్రేఁగిన నిటులేల యేపు మిగిలి
యెదురు నడతెంతువే నీవు వీక్షణంబ
విఱిచి ప్రోవు పెట్టెదఁ జూచి మెఱయు పెఱఁగు
పాటు గదిరి నీయేలిక ప్రమసి పడఁగ"

"పగయ పాటించి వీని జంపగఁ దలచి
యేను గదసితి మెచ్చింతు నిట్టులున్న
యిందులును జూడుఁ దూరక యిట్టు నట్టు
ననక లావును విక్రమ వ్యాప్తి పెరవు"

"కరూశ దేశంబునం బ్రభవించి చాణూరుండనఁ బ్రసిద్ధుడైన వీనిచేత పెక్కండ్రు మల్లులు నిక్కిరిః వీనిం బడవైచియసాధారణంబగు యశంబుఁ బొందెదననియె"(హరి వంశం. పూ.భా.9-116,123,124)అనితన|ఉత్సాహ శక్తి నిపరాక్రమాన్ని శౌర్యాన్ని ప్రకటించి చాణూరునియుద్ధంలో సంహరించడంలో వీర రస ముప్పతిల్లి సహృదయా వర్జక మవుతుంది.కృష్ణుడు కంసుని వధించిన తీరుమరింత మనోహరంగావర్ణితం.

"కరి పతియున్న శైలకటకంబునకుం బటు వేగ చండమై
హరిపతి దాటునట్లు హరి యారిపుడున్న యుదగ్ర సౌధమం
దీర వలభీతటంబునకుఁ దీవ్రతసుప్పరవీధి దాటి ని
ర్భర పవన ప్రకంప విచరన్నవనీలవలాహకాకృతిన్"

"రంగ మధ్యంబు నందుండి రాజుదెసకు
నులుకు కృష్ణు వేగ స్ఫూర్తి యొక్కరుండు
గానలేకున్కిఁ గనుమాయ కరణియయ్యెః
గంసు ముందర నిలుచుండ గనిరి మరల"(హరివంశం.పూ.భా.9-141,142)

'మణులు రాలగఁ జారు మకుటంబు బడదన్నివడి పెంద్రుకలువట్టి వ్రాలఁదిగిచి నడుతలయందంద పిడికిట మెదడును గలగంగ బొడిచి ప్రోకాల నురము దాకింప నొక్కచేతయుఁ జేయలేక నిశ్చేష్టుఁడై రోజా విర్జీవుఁ బెలుచ హారముల్ ద్రెవ్వఁగన్నావతంసము లూడ వత్తరి నుత్తరీయంబు వీడ

నోరముక్కున జెవులను ఘోర రుధిర
మొలుక గ్రుడ్డులు వెలుపలి కులుక మేద
డిగ్గఁ ద్రోచి తోడన డిగ్గి ప్రగ్గఁగేల
గ్రుమ్మె నసురు పోవంగ నక్రోశలీల"

"గొదగొని పారంగంబుం
బొదవిన సింగంబు పగిది భూరి బలము పెం
పొదవంగఁ జేరి చెండా
డి దురాలోక క్రియా పటిష్ఠత మెఱసెన్" (హ. వ. పూ.భా. 9-145,147)

ఈ విధంగా కృష్ణుడు కంసుని సంహరించడంలో శ్రీకృష్ణునివీరంప్రస్ఫుటమై సర్వలోక దర్శనీయమై మార్గ దర్శకమై దుష్టశిక్షణ జరిగి తన్మూలంగాఎర్రనవీరరస పోషణం సుస్పష్టమవుతుంది. ఇలాగా ఇంకా ఎన్నెన్నో హరివంశంనుంచిఉదాహరణలివ్వవచ్చు.

**దాన వీరం :**

కంస మరణానంతరం, కంసుని తండ్రి ఉగ్రసేనుడు కంసుని ఉత్తరక్రియలకై అనుమతినిమ్మని కృష్ణుని వేడుకొంటాడు.ఆసందర్భంలో కృష్ణుడు కంసరాజ్యాన్ని-కాదు-కంసునాక్రమించిన ఉగ్రసేనుని రాజ్యాన్ని, కంసుని సంహరించికృష్ణుడే అధిపతి అయి ఉగ్రసేనునకు దానంచేస్తాడు. ఇందులో దానవీరం అత్యంతమనోజ్ఞమై ఒప్పుతుంది. రాజ్యం వీర భోజ్యమే అయినా ఉగ్రసేనునకు దానమివ్వడంలో ఈ దాన వీరం స్పష్టం. పైగా తన కర్తవ్యం రాజ్యాక్రమణం కాదు. ఆధిపత్యం అంత కంటేకాదు. దుష్ట శిక్షణ ; శిష్టరక్షణ ; అందుకే రాజ్యదానం; దానవీరం.

"రాజ్యంబు పనిలేదు రాజధనంబుపై నానయుఁజొరదు నాయాత్మ, గంసుఁ
దునుముటయును నర్థ దోహలంబునగాదు, వంశ పాంసనుడును వసుధ కెల్ల
గంటకుండును గాన గ్రక్కున నాతని నిట్లు సేసితి లోకహితము గోరి,
యెవ్వారలకు లేని యెసకంపుఁగీర్తి శాశ్వతమయ్యె నింతయు చాలు నాకు

నింక నెప్పటి యట్టుల యేనుబోయి
యాల కదుపులలోన గోపాల కోటి
గూడి యాడుచు వట వన్యకుంజరంబు
రీతిఁ గోరినట్టుల విహరించు వాడ" (పూ.భా. 9-183)

"నీసామ్రాజ్యము పెంపొందు రాజ్యము దగన్నీకీక నీచాత్ముడై
నీ సూనుండెడ నాక్రమించి కొనియెన్నిర్వ్యాజ ఖంగిం దుదిన్
దోసంబేమియు లేక యంతయును నిన్నుం జేరం గైకొమ్మనా
యాన ప్రక్రియ నిప్డు పొందు మభిషేకానంద కల్యాణమున్"

"ఏను గెలిచిన సిరి నీకు నిచ్చుచున్న
వాడ నామీద బ్రియమును వత్సలతయుం
గలిగెనేని ద్రోవక చేయవలయునాదు
ప్రార్థనంబు సర్వాన్వయ ప్రభుడవీవు"

"....అతని ననఘుంరాక్షణమ సర్వయదు మధ్యమునన్
భద్రాసనంబున నునిచి సముచితంబుగ నభిషేకించె"

(హ. వం. పూ.భా. 9-185,186,187,188)

ఇందు దానవీరం సర్వలక్షణోపేతమై ఒప్పుతుంది.

## దయా వీర. :

పాండవులు అరణ్యవాస క్లేశ భారమగ్నులై జీవిస్తూ ఉండగా ఘోషయాత్ర పేరు చెప్పి, పాండవుల నవమానించబోయి తానే గంధర్వులచే నవమానితు డవుతాడు దుర్యోధనుడు. ఆ సమయంలో ధర్మజునాజ్ఞతో తమ్ములు విడిపించి రక్షిస్తారు. ధర్మరాజు వద్దకు కొనిరాగా అతనిని వదలిపెట్టి పొమ్మంటాడు ధర్మరాజు—

"ఎన్నడునిట్టి సాహసములింక నొనర్పకుమయ్య: దుర్జనుం
డన్నను సాహస క్రియలందుం గడంగి నశించు గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలం గైకొని యిమ్ముల బొమ్ము వీటికిన్
సన్నుత దీని కొందొక విషాదముంబొందకుమీ మనంబునన్"
"అని బుద్ధి సెప్పి వీడ్కొ-లుప నతండును దీనాననుండగుచుం జనియె"

(శ్రీమదాంధ్రి మహాభారతము, అ.ప.శే 6. 145, 146, 148)

ఇలాగే ద్రౌపది అరణ్యంలో ఏకాంతంగా ఉండగా సైంధవుడు అపహరించు కొనిపోగా భీమార్జున నకుల సహదేవులు పట్టి అవమానించిబంధించిద్రౌపదీ ధర్మజుల ముందు సైంధవునుంచగా అవమానిత అయిన ద్రౌపది సహితం క్షమాగుణంతో

"పాంచాలియు జయద్రథుంజూచినవ్వుచు నిష్పాపాత్ముండుభవదీయదాసుండయ్యెంగా వున నీనిం బో విడువుడని విడిపించె" అప్లే ధర్మరాజు దయాగుణసముపేతుడై ....

'ఎట్టి కష్టుఁడైన నిట్టి పాపము సేయ
నెత్తికొనునె యోరి నీవుదక్క ?
నరుగు మింకనేమి సెందుము నిన్ను నిం
ద్రియ వికారుల నల్ప ధృతివిహీను' (వై. దే)

'ఇంకనెవ్వారికి నిట్టికొఱగాములు సేయక
బుద్ధిమంతుండవై యుండుమనిన నతండు
లజ్జావనత వదనుండగుచు నల్లోటువాసె (వై. దే. 6-253) సైంధవుడు
వెళ్ళిపోయాడు.

ఇది దయావీరం. ఇంతేగాదు క్షమావీరం అన్నా తప్పులేదు. ధర్మరాజు క్షమించి వదలి పెట్టడంలో ఆశ్చర్యం లేదు అవమానిత అయిన ద్రౌపది సహితం దయా, క్షమాగుణాలతో సమ్మిశ్రమైన ఉన్నతోన్నత సద్గుణోపేతఅయి వదలి పెట్టుమనడం విశేషం. ఆ పాత్ర ఉత్తమ శీలానికి నికషోపలం.

ధర్మవీరం :

ధర్మవీరం ఆరణ్య పర్వ శేషంలోని సావిత్ర్యుపాఖ్యానంలో నిర్వహించ బడింది. దీనిని సమగ్రంగా పరిశీలించిన శ్రీ దేవరకొండ ఏరయ్యగారి వాక్యాలనే యథాతథంగా గ్రహించడం సముచితమని భావిస్తున్నాను.

"సావిత్ర్యు పాఖ్యానము ధర్మ వీర రస ప్రధానము. సావిత్రి నిష్ఠము. ధర్మ విషయకము. ఉత్సాహము స్థాయి భావము. ధర్మ విషయ కోత్సాహమునకు ఆలం బనము సత్యవంతాది గురుజనులు. యముడు ప్రత్యక్షమగుట ఉద్దీపనము. సంభ్ర మము, అంజలి మొనర్చుట, ప్రౌఢ మధుర సల్లాపము మొదలైనవి అను భావ ములు.

'పతులెందు జనిన సతులకుఁ
జనవలదె? నీ ప్రసాదమునను మ
త్పతి భక్తి కతమునను పం
స్తుతగుణ నాకరుగరాని చోటులు గలవే' (7-222)

'సకల మార్గంబులందును ధర్మమార్గంబు ప్రధానంబు. అట్టి ధర్మమునకు ఆధారంబు సజ్జనులు.....అట్టి సజ్జన దర్శనంబునం బరమశుభంబెప్పుడు వృథ కాదు :- కావున సజ్జనశేఖరుండ వనంజను నీదైన సందర్శనంబునం బొందక యేనుత్తజనంబుల తెఱంగున నూఱక యెట్లు మగుడుదు?....' (7–223)

'ఎడపక వాఙ్మనఃక్రియల నేనికి నెగ్గొనరింపఁబూన రె
వ్వెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవనఁ జూతు రిచ్చఁబో
కడమ పడంగ నీకెదిరి కాంక్షితము ల్దమేముట్ట దీర్తు రె
క్కుడు మది గూర్తు రాశ్రితులకున్ వినుమిన్నియునార్యధర్మముల్'(7-228)

"వానియందు సావిత్రి పత్యనుగమన విధిని, సజ్జనుల ధర్మరక్షణ రీతిని అప్రస్తుత ప్రశంసా వచనములచే నిరూపించినది.

"పిమ్మట ధర్మదేవత, యమ, శమన శబ్దములకు నిరుక్తుల ప్రవచించినది.

'.......................................

దేవోత్తమ ధర్మ గతుల తెఱఁగెల్ల భవ
ద్భావాధీన మగుటనా
దే వెలసితి నీవు ధర్మదేవత యనఁగాన్' (7-229)

'సమబుద్ధితోడఁ దత్త
త్సముచిత కర్మఫల మఖిల జంతుతతులకున్
సమకూర్చుట నీకయ్యెను
సమ వర్తియనంగఁ బేరు జగదభినుతమై' (7-230)

'యముడండ్రు నిన్ను నార్యులు
యమింతు భూతములనెల్ల నట్లగుట దగున్
శమనుండవైతి కల్మష
శమనంబునఁజేసి నీవు జలజాప్తసుతా' (7-331)

'పిమ్మట సావిత్రి ధర్మాచరణ రీతిని, స్వీయ ధర్మమును, ధార్మికులమాహాత్మ్యమును, మిత్రధర్మమును, పరమనోరథపూరణమును గూర్చి యుపన్యసించెను.

"ధర్మాత్ములు దమ నలిపెడు
ధర్మక్రియ దప్పరెట్టి దశలందును. మో
హార్మియుఁ దాపముఁబుట్టవు,
ధార్మిక హృదయముల ప్రథమ ధర్మాధ్యక్షా ?"
'కావున పతి యనుగమనం
బే విధమున విడువదగునె యెట్లయినను
మోహావేశముఁబొందక ధ
ర్మావ స్థితి నలుప వలదె యవహిత బుద్ధిన్' (7-237, 238)

"నాకు దప్పి యెక్కడిది మనంబు భర్తృ
చరణ పంకజాసక్తమై కరము భక్తి
నలరుచున్నది సతులకు నన్యమెట్టి
దియును ధర్మమె భర్తృ సంశ్రయము కాక"

"ఆత్మ ధర్మ నిరతులైన పుణ్యాత్ములు
దుర్లభులు సమస్త దురితములును
శాంతి బొందువారి సంసర్గమున దీర్ఘ
హూత మతులు వారు భూతలమున"
వారల పేర్మిగాదె....భూతధాత్రి నిఖలైక ధురీణతఁ బేర్మి బొందెడున్'
(7-241, 243, 244)

'ఏడు మాటలాడిన యంతనెట్టివారు
ఆర్యజనులకుఁ జుట్టంబు లగుదు రనిన
చిర సమాలాప సంసిద్ధిఁ జేసి నీకు
నేను జుట్టమౌదని వేఱయేల చెప్ప'
'కావున మిత్ర మనోరథం బవశ్య కర్తవ్యంబుగాఁ జిత్తగింపుము."
(7-246, 247)

"ఈ పై వాని యందు ధృతి, మతి యను సంచారి భావములు అభివ్యక్తములై ధర్మ వీరమును పోషించుచున్నవి. లోభము, శోకము, భయము మున్నగు వానిచే

జనించిన యుపప్లవము (చిత్తక్షోభము) వారింప కారణభూతమగు చిత్తవృత్తి విశేషము ధృతి. శాస్త్రాదివిచార జన్యము అర్థ నిర్ధారణ రూప చిత్తవృత్తి విశేషము మతి. అది శబ్దముచే లోక వృత్తము గ్రాహ్యము. శాస్త్రలోకవృత్తాది విచారణ విభావము. నిశ్శంక తదనుష్ఠానము. సంశయోచ్ఛేదము (శిష్యోపదేశము, భ్రూక్షేపము, ఊహాపోహాదులు) అను భావములు.

"సత్యవన్నిష్ఠము ధర్మవిషయకము ఉత్సాహము స్థాయిభావము. మాతాపితృగురు జనులు ఆలంబన విభావము.

"విను నీవు దడయుటకు మీ
జననియు జనకుండు కడు సంతాప భరం
బును బొందుదు రింతకు గ్ర
న్నన వారికి సంతసం బొనర్పగ యధిపా"
"తమమును పెల్లుగాఁబరగె దవ్వు నిజాశ్రమ భూమియున్ తను
శ్రమమును బాయదిప్డు నను చందమమైనఁ జనంగ నేల యిం
పమరగ నింత ప్రొద్దు సుగుణాకర! యిచ్చట నిల్చి రేపు పోదమే...."
(7-256, 258)

అను వాక్యములుద్దీపనములు.

"మానె శిరోవేదన దా
మేనికిఁ దగులాపు వచ్చె మెల్లన యరుగం
గానోర్తుఁ దల్లిదండ్రులఁ
గానక యేనెట్లు నిలుతు కానన భూమిన్?" (7-259)
"అను దానియందు వీరరసమునకు సంచారి భావము ఔత్సుక్యముపోషితము.

"ఇప్పుడే తల్లాభము నాకుఁ గల్గుఁగాక" అను నుత్కంఠేచ్ఛ ఔత్సుక్యము. ఇట ఇష్టవిరహమున తత్సంస్మృతి విభావము. త్వరచింత (చిత్తతాపము), స్వేదము, దీర్ఘ నిశ్వాసము మున్నగునవి అనుభావములు.

"పిమ్మట గల ఆరు పద్యములందు పోషింపబడిన చింత, స్మృతి, విషాదము ఔత్సుక్యమున కను భావములు.

"ఇట్లు సావిత్రీసత్యవంతులయందలి ధర్మ విషయ కోత్సాహమును ఉపాఖ్యానితముగా పోషించెను.

"ధర్మ వీరమునకు పర్యంతావస్థ అద్భుతము. అలౌకిక వస్తు దర్శనాది జన్యము వికాసాఖ్య చిత్తవృత్తి విశేషము విస్మయము. అద్భుత రస స్థాయి భావము. సావిత్రి ధర్మప్పరమునకు అవ్యవహిత ఫలము సత్యవంతునకు జీవిత ప్రాప్తి, విగత చక్షుడగు ద్యుమత్సేనునకు నేత్రదృష్టి ప్రాప్తి, ద్యుమత్సేనునకు రాజ్యప్రాప్తి, అశ్వపతికి పుత్రశత ప్రాప్తి విలంబిత ఫలములు. పుత్రునన్వేషించుటకు ద్యుమత్సేనుడు అరణ్యాశ్రమముల విలపించుచు బోయి వెదకెను. "తదాశ్రమ వాసులైన మునులందరు నతనిం బొదివికొని తదీయ నయన లాభంబునకు విస్మయంబందుచు" (7-271) అని కవియే సూచించెను.

"సావిత్రీ సత్యవంతులు జరిగిన దానిని వర్ణింపగా, ఆ వృద్ధ దంపతులు సావిత్రిని —

"ఆపత్సముద్రమగ్నం<br>
బై పోయెడు నస్మదన్వయము పెంపెసగం<br>
దేవయయి కడవం బెట్టిన<br>
నీ పుణ్య చరిత్ర కీర్తనీయము తల్లీ" (7-274)

అని ప్రశంసించిరి. ఇందు హర్ష మనుభావము వ్యంగ్యము.

"ఇది లోకోత్తర ధర్మ నిర్వర్తితము కావున విస్మయ పూర్వకము. విస్మయ పూర్వక హర్షము కించిదుద్ధతము కావుననే కించి దుద్ధత ప్రసాద మిశ్రితముగా పద్య రచన మొనర్చెను." (ఎఱ్ఱాప్రెగ్గడ అనువాద పద్ధతి- శ్రీ గోవిందరాజస్వామి కళాశాల పత్రిక- 1974-75 పు. 25-78)

**తపోవీరం :**

హిరణ్య కశిపుని ఘోరతపస్సులో తపోవీరముంది. ఇంద్ర ప్రేరితలై అతనిని తపస్సునుంచి మరలింప యత్నించి అప్సరసలు విఫలులవుతారు. ఘోర తపస్సు నిష్ఠ తప్పకచేసి బ్రహ్మవలన వరాలు పొంది గర్వితుడవుతాడు. అయినా

ఎన్ని విఘ్నాలు వాటిల్లినా లెక్కచేయక ఘోర వీర తపమాచరించి బ్రహ్మవరాలకు పాత్రుడు కావడంలో తపో వీరం వ్యక్తం. (నృసింహ పురాణం-2-100)

**వీరాభాసం :**

హాస్యరసానికి ఉదాహృతమైన శిశుపాలుని స్థితి హాస్యోత్పాదక మనడం కంటే వీరాభాసమనడమే సముచితం.

"అనునెడ శిశుపాలుండొక
ఘన పరిఘము కేలదాల్చి గ్రక్కున జన నా
థుని యెదురనిల్చి"
"పెండ్లియాడుదునని కడుఁ బెగ్మితోడ
నిట్లుగై సేసి తుదినింత యొడలు గొంది
యున్న నాక కాకీ మెచ్చ మొఱల కేము
గారణము నిల్వఁ డెవ్వారుఁ గదల వలదు"

(హరివంశం-ఉ.భా. 3-99, 100)

అని బీరములు పలికినా, శ్రీకృష్ణుడు బలోద్ధతుడై రుక్మిణిని రథంపై నెక్కించుకొని, ఎదిరించిన సర్వరాజన్యుల్ని జయించితీసుకొనిపోగా శిశుపాలుని వీరం కేవలం ఆభాసపాలైంది. అందుకే డా॥ యశోదారెడ్డిగారు హాస్యానికి దీనిని ఉదాహరించినా 'చివరికి పద్యమందు వీరమాభాసమై హాస్యమే స్థిరపడినది." (తెలుగులో హరివంశములు-పు.231) అని పేర్కొన్నారు.

ఈ విధంగా ఎఱ్ఱన తన సాహిత్యంలో వీరరసాన్ని పలు విధాలుగా అలవోకగా సందర్భ శుద్ధితో ఔచితీ సహంగా నిర్వహించి తరించాడు.



# ఎర్రన - హాస్య కరుణ రసాలు

ఎర్రన కవిత్రయంలో చివరి కవి. నన్నయ తిక్కనల మార్గ మనుసరిస్తూనే తనదైన తోవను వెతుక్కొని ఉత్తమకవి వరేణ్యుడుగా నిరూపించుకొన్నవాడు; ప్రబంధ పరమేశ్వరుడు. నృసింహపురాణం, అరణ్యపర్వశేషం, హరివంశం- అనే అతని కృతులలో నవవిధ రసపోషణలో ఎర్రన ఔచితీ సహమైన రీతిని ప్రకటించిన మహాకవి. ప్రస్తుతాంశం ఎర్రన గావించిన హాస్య, కరుణ రసాల పరిపోషణ చమత్కృ పరిశీలన.

హాస్య కరుణ రసాల లక్షణాలు, వాటిస్థాయి భావాలు ఇలా చెప్పబడ్డాయి.

**హాస్యరసం :**

'వికృతాకార, వాగ్వేష, చేష్టాదేః
కుహకాద్భవేత్, హ్యాసోహాస స్థాయి భావః'—

వికృతాకారం, వాక్కు, వేషం, చేష్టలు మూలంగా వర్తకునివల్ల కలిగేది హాస్యరసం· హాస్యానికి స్థాయి భావం హాసం.

**కరుణ రసం :**

'ఇష్ట నాశా దనిష్టాచ్ఛ కరుణాఖ్యో రసో
భవేత్ శోకోఽత్ర స్థాయి భావః'—

ఇష్ట బంధువులు మొదలైనవారి నాశనంవల్లగాని, అనిష్ట ప్రాప్తివల్లగాని కరుణ రసముత్పన్నమవుతుంది. దీని స్థాయీ భావం శోకం.

కాగా ఈ రెండు రసాలను ఎర్రన తన కృతులలో పరిపోషించిన తీరు తెన్నులను పరిశీలిద్దాము.

**హాస్యం :**

వికృతాకార వాగ్వేష చేష్టల వల్ల ఉత్పన్న మయ్యేదీ, హాస స్థాయికమైనదీ హాస్యమని పూర్వోక్తం. దీనికి చక్కటి ఉదాహరణ భీముడు సైంధవుని అవమా

నించడం. అరణ్యపర్వ శేషంలో అరణ్యంలో ఏకాంతంగా ఉన్న ద్రౌపదిని కామించి సైంధవుడు కొని పోగా ధర్మజుడు తప్ప తక్కిన భీమార్జున నకుల సహదేవులు వెంబడించి అతనితో యుద్ధం చేసి పరాజితుని గావించి, పార్థిస్తుండగా భీముడు సైంధవుని పట్టుకొని అవమానిస్తాడు.

"వాడిమైన కత్తి వాతి యమ్మునఁగొని
పగతు శిరము చెక్కలెగయ గొఱిగి
నరుల కెల్లఁ జూడ నవ్వగునట్లుగాఁ
గలయ నైదు కూకటుల నొనర్చె." (శ్రీమదాంధ్ర మహాభారతం-అరణ్య
పర్వశేషం - 6-250)

—ఇందలి సైంధవుని వికృతా కారం వల్ల హాస్యరసం సముత్పన్నమై ఆనందాతిశాయి అవుతుంది.

బాలకృష్ణుని లీలా విశేషములతో ఎంతో హాస్యం హరివంశంలో మనం చూడగలం.

బలరామ కృష్ణులు మధురాపుర ప్రవేశ సమయంలో సుగంధ ద్రవ్యాదుల్ని కొనిపోతున్న కుబ్జ ఆకారం వల్ల సైతం హాస్యం ఉత్పన్నమవుతుంది.

"ఎఱ్ఱాప్రెగడ శిశుపాలుని వర్ణనా సందర్భ మందొక సున్నితమైన హాస్యమును ప్రవేశ పెట్టినాడు. రుక్మిణిని బెండ్లి యాడుమనని వివాహ మంగళోచితాలంకారములతోఁ గై సేసి శిశుపాలుఁ డుత్సాహమున నుండ రుక్మిణీహరణమైన వార్త వచ్చినది. అప్పుడు—

"అనునెడ శిశుపాలుం డొక
ఘన పరిఘము కేల దాల్చి గ్రక్కున జననాథుని యెదుర నిల్చి"
"పెండ్లి యాడుదునని కడుఁ బేర్మి తోడ
నిట్లు గై సేసి తుదినింత యెదరు నొంది
యున్న నాక కా కీ యొచ్చ మొఱుల కేమి

గారణము నిల్వఁ డెవ్వారుఁ గదలవలదు" (హరి వంశము : ఉ.భా-3.99)
అని రచించాడు.

"ఈ పద్యము నందు శిశుపాలుని శౌర్యము, అవమానమును సహింపలేని అభిమానము, ఒక విధమైన యుత్సాహము అన్నియును గలసి వీర రసాంగము లైనవి. కాని యీ వీర రస విస్ఫురణ మంతయు శిశుపాలుని చేష్టల వలనను మాటల వలనను అపనయింప బడినది. ఉపర పద్యమందు వీరమాభాసమై హాస్యమే స్థిరపడినది. పాపము శిశుపాలుడు వివాహమునకై మంగళాకారములగై సేసికొని సమవయస్కులగు రాజ కుమారులతో సరస సల్లాపములాడు చుండినవాఁడు. అట్టి సందర్భమునందు గృష్ణుఁడు రుక్మిణి నపహరించినట్లు వార్త వచ్చినది. ఆ సమయమునకుఁ దగినటులందఱు యుద్ధ సన్నద్ధులగు చుండగా పెండ్లి కుమారుఁడు పరిఘ నొక దానిని బట్టుకొని బయలు వేడుటను నదియే హాస్యమునకు తావు నిచ్చుచున్నది. అంతటితో నాఁగక శిశుపాలుఁడు ఆస స్థితిని గూర్చి తెల్లము గావించుచు "పెండ్లి యాడుదునని కడుఁ బేర్మి తోడ నిట్లు రై తీసి" అని పలికినాడు. ఇచ్చట శిశుపాలుని యాకార విశేషము మఱియు నంతకన్న సధికముగా నతని వాక్యములు హాస్యమున కంగములైనవి.

"సర్వసైన్య పరివృతుడైన శ్రీకృష్ణుఁడు కన్య నపహరించి రథము పై నిడుకొని వెడలఁగా సేనా సన్నాహము లేని పెండ్లి కుమారుకు తోటి రాజుల సాహాయ్యమును గూడ వలదని యొక్క పరిఘ మాత్రమే చేకొని వీరములు బలుకు చుండుట యెంతయో హాస్యాస్పదమై యెంతటి గంభీర స్వభావులనైన మందస్మితుల గావించుచున్నది." (డా॥ పి. యశోదారెడ్డి - తెలుగులో హరివంశములు-పు.231)

"హాస్య రస సూచకములైన వర్ణనలు పూర్వ కవులలో అరుదుగా కనిపించును. హిరణ్యకశిపుని ఉద్ధత చేష్టలను వర్ణించుచు ఎఱ్ఱన కవి హాస్య రస ప్రధానముగా లిఖించినాడు.

"తపములఁ గ్రుస్సిన తపసులఁ బట్టి తెప్పించి యచ్చరలతోఁ బెండ్లి సేయు
మోదంబుతో నశ్వముఖుల లాయంబులఁ గట్టి బొక్కనియలఁగవణ మెత్తు
భుజగేశ్వరుల శిరంబుల నున్నమణులూడ్చి కొమరార వజ్రువగుండు లెత్తుఁ

జెలఁగి గంధర్వుల చేతి వీణెలు పిశాచులకిచ్చి పాడించి చూచి నవ్వు"
(నృ.పు-2-127) ఆచార్యఖండవల్లి లక్ష్మీరంజనం-లక్ష్మీరంజన వ్యాసావళి-పు.54)

ఇలాగా ఎర్రన తన కవితలో హాస్య రస పోషణ గావించి తన హాస్య స్ఫూర్తి మూర్తిని మనముందు ప్రత్యక్షీకరించి ఆనంతానందానికి ఆస్పదమైన తీరును విస్పష్టం చేశాడు.

**కరుణం :**

'ఏకో రసః కరుణ ఏవ' అని భవభూతిచే ప్రస్తుతింపబడి ప్రతిపాదించబడిన కరుణ రసం సర్వ సహృదయ హృదయాలకు సమాదరణీయమైన రసం. దీనికి స్థాయి శోకం.

రజి చేత పరాజితుడైన ఇంద్రుని దుస్థితి కరుణ రస నిర్భరంగా వర్ణించాడు ఎర్రన.

"సిరి బాసి వాసవుఁడు దన
గురు గానఁగ నరిగి యతని గురుతర చరణాం
బురుహముల కెరగి యపరి
స్ఫురితములగు గద్గదోక్తముల నిట్లనియెన్"
"రజిచే గద్దియ గోలు పోయి విభుతా భ్రష్టుండనై క్రమ్మఱన్
రజి పుత్రావళి యాక్రమంబున ననర్థంబుల్ పొరిం బై కొనన్
నిజమై యెందును నిల్వ నేరక విపన్నిర్మాథితం దూలెదన్
సుజన శ్రేష్ఠ యొకింత నాదెస కృపం జూడం దగున్ జూడవే"
(హ.వం.పూ.భా. 3-43, 44)

ఇందులో పద భ్రష్టుడై దుఃఖితుడైన ఇంద్రుని శోకం స్థాయి. తన్మూలంగా కరుణ రసముత్పన్నమై అంతటి వాడు ఇంతయ్యేనా అని జాలి కలుగుతుంది.

ఇలాగే హిరణ్యకశిపుడు ఘోర తపమాచరించి వరాలు పొంది ఇంద్ర లోకం కైవసం చేసుకొన్నప్పుడు దేవతలు దైన్యంతో విష్ణువును మొర బెట్టుకొనడంలో కరుణ రసం చిప్పిలుతూంది.

"భ్రష్టత నొంది దేవతలు బామరి దుగ్ధ పయోధి మధ్యవి
స్పష్ట భుజంగశయ్య న్వనుభావ సమాహిత సుప్తి నొప్పుశి
ష్టేష్ట విధాయి విష్ణు జగదీశ్వరు నార్త శరణ్యు సత్కృపా
దృష్టి సమగ్రుఁ జేరిరి ప్రదీప్త పరాక్రమ చక్ర శోభితున్"
"చేరి దైన్యంబుతోఁ దమ చెడ్డ చేటు
లన్నియును విన్నవించి లోకాధినాథ
యజుఁడు మొదలగు సర్వ భూతావళికిని
నిక్క మెవ్వరు శరణంబు నీవు దక్క"
"దితి సూనుఁదునిమి మఱియును
దితిజ కులము పీఁచ మడఁచుతేకువ మదిఁబూ
నితి వేని మమ్ము నేలుట
సతతమగు నమ్మెయికిఁ గరుణ సమ కొలుపఁగదే"
(హ. వం. పూ. భా. 4-27, 28, 30.)

## భూదేవి శోకంలో కరుణరసం :

"ఆ యెడను భూమి దేవి యాత్మీయమైన
మూర్తి ధరియించి యెంతయు నార్తి దోప
నచటికేతెంచె నిఖిల సురాళి చూడ్కి
గములు నంతంతఁదన మీఁదఁ గడలు కొనఁగ"
"అక్కాంత దప్పిగని కడు
వెక్కసపడి పలుకు సభ్యవితతుల పలుకుల్
దిక్కు లంకష నినదరి
బక్కజమై యెసగె వెన్నుఁడా కర్ణింపన్" (హ.వం. పూ.భా. 5-13, 14)

దీనికంటె అక్క అయిన దేవకీదేవి సుతులను సంహరించి కంసుడు శోకించడంలోను కరుణ రసముంది.

"ఇక్కడఁ గంసుండును దేవకీదేవికిం గృతాంజలియై యిట్లనియె"

"ఏనిటు ప్రాణ రక్షకయి యెంతయుఁ బాపము సేసి గర్భసం
తాన వినూతి నై నిను నుదంచిత శోక పయోధి ముంచితిం
బూనిన మత్కృతంబఖిలమున్ వృథయయ్యె విధాత చెయ్యులె
వ్వానికి మాన్పఁగా నకట వచ్చునె మానుష తుచ్ఛ యత్నతన్"

"కాన నింతయుఁదలపోసి మానుమింక
నఖిల దుఃఖ చింతామయంబైన కలఁక
యేను గాలు గేలును బట్టి యిదె వినీతి
వేడికొనియెదఁ బరమ పవిత్ర చరిత"

"అనిన నద్దేవి యశ్రు పూర్ణ నయనమై తండ్రి! యిట్టి
శోకంబు నాకనుభవింపను మద్గర్భంబులకు
నిట్టి పోకలంబోవను మున్న కడకట్టిన తెఱంగు
నీవేమి సేయుదని యుచితంబు గాఁబలికె"(పై దే.5-132, 133, 135, 136)

ఇంతేగాక కృష్ణునితో అక్రూరుడు దేవకీదేవి కరుణ రస పూరిత స్థితిని దెల్పడం గమనించ దగ్గది.

"ఉడుగక కన్ను నీరఁగడు నొప్పటి చాయలు చెడ్డ కన్నులున్
పెడఁ గఱవడ్డ మోము బటువేదనఁ గందిన యంతరంగమున్
బడుగయి యున్న మేనునయి భామిని వత్స విహీన ధేనువుం
దడపఋపంగవచ్చుఁ దనదైన్యము శూన్యతయున్ గనుంగొనన్"
(పై దే. 8-156)

ఇంతైనా వ్రేపల్లెలో దినదిన ప్రవర్ధమానుడవుతున్న శ్రీకృష్ణుని పలువిధాలుగా హింసించి వధించ యత్నించి చివరకు కంసుడు శ్రీకృష్ణునిచేత సంహరించబడినప్పుడతని సతులు శోకాబ్ధిలో మునిగిన తీరును కరుణరస భరితంగా హృదయవిదారకంగా ఎఱ్ఱన అభివర్ణించడం అత్యంత ప్రశంసనీయమైన అంశం.

'దితిసుతాంతకు చేఁజిక్కి దిక్కులేని
పీనుగై రంగ వాటంబు పెద్ద బయలఁ
బడిన యక్షౌంసు కడకుఁదద్భార్యలెల్ల
నరుగుదెంచిరి పెసనంతిపురము పెడలి' (పై దే. 9-151)

"అప్పుడు —

'కరతాడనములఁ జన్గవలపైలత్తుక చట్టలు చలిచిన వాద్పుదోఁపఁ
దెగిరాలు హారమౌక్తికములు నక్ష బింమవు లేర్పరువరాకఁ దొందడింప
నెందెడు వాతెఱనెసఁగు తాంబూలర క్తిమ శోకవహ్నిగ్రక్కెడు తెఱఁగుగఁ
దూలెడు పయ్యెద దుఃఖాంబునిధిలోని కరలు చందంబునఁగడలు కొనఁగ
వీడి పెన్నుల వ్రేలెడి పేణిలోలి
పెలసి కాలాహినిభము లై సొలపుఁజూప
దొదువు మూర్చల డెందంబు దిగులు కొలుప
నలత కొలదికి మిగిలె నయ్యంగనలకు"
'అందరు పతి పై బడి కడు
గ్రందుగ నఖిలాంగ కములు గనుఁ గొని గౌగి
ళ్ళం దొదరగ నిట్లని యా
క్రందన మొనరించి రధిక కరుణధ్వసులన్' (పైదే. 9-152-154)

ఇది భారతం స్త్రీపర్వంలో అసూర్యంపశ్యలైన కౌరవ స్త్రీలు అంతఃపురం వెడలి పౌలికలనిలో పీనుగు పెంటలై పడిఉన్న తమ తమ భర్తల, తండ్రుల, పుత్రుల, బాంధవుల గూర్చి విలపించిన తీరును గుర్తుకు తెచ్చి ఆశోకం వలన అత్యంత కరుణ రసోత్పత్తిని చేయగలిగింది. ఎంత దుర్మార్గుడైనా తమకు పతి దేవుడు. అలాంటి పైధవ్యం మహా దారుణమని స్పష్టమవుతుంది కంసుడు అంత దుష్టుడైనా తల్లి సైతం ఆతని మరణానికి విలపిస్తుంది. అది మాతృ హృదయం! తల్లి కడుపుకోతను గూర్చి ఎవరు చెప్పగలరు ? ఆ తల్లి —

'కని పైబడి కోడంద్రురు
ధన చుట్టును బొదివి యేడ్వ దద్దయు శోకం

బున నంకతలంబునఁబు
త్రుని తలఁ గదియించి యెలుగు దోఁటువడంగన్' (పై దే. 9-168)

విలపించి పుత్రుని మరణాన్ని గూర్చి భర్త ఉగ్రసేనునితో—

"నీ పుత్రుని జూచితే ధర
ణీ పాలక! వజ్ర పాతనిహతాద్రి క్రియన్
రూపఱి వీర శయన సం
ప్రాపితుఁడై నాఁడు కృష్ణ బాహుస్ఫూర్తిన్" (పై దే. 9-173)

అని చెప్పి శోకిస్తుంది. ఇందులో చక్కగా కరుణరసం పరిపోషింప బడింది. రసపోషణ ఇంత మనోహరంగా చేయగల స్రష్ట ఎఱ్ఱన. అతడు స్రష్టకనుకనే ఇంత మనోహరంగా కరుణ రసాన్ని ఔచిత్యంతో పోషించాడు.

దేవసేనను కేశియను దానవుడు అపహరించుకొని గగన మార్గాన వెళ్ళు తుండగా దేవసేన కరుణ రస భరితంగా శోకిస్తుంది.

'ఒక్క దనుజాధముండు మొత్తోయనంగ
నన్నుఁ జెఱగొని పోయెడు నన్నలార
యెవ్వరిట విడిపింపరే యింత వట్టు
పుణ్యమునఁ బోవరయ్య కారుణ్యబుద్ధి' (శ్రీమదాంధ్ర మహాభారతం అరణ్య పర్వశేషం. 5-177)

పాండవులరణ్యవాసంలో పడ్డ ఇడుమలకు తానేకారణమని ధృతరాష్ట్రిడు దుఃఖించడంలో కరుణ రస ముత్పన్న మవుతుంది—

నా చేసిన కీడునఁగడు
నీచుండగు నా తనూజు నేరమి నిమ్మై
నో చెల్ల పార్థులకుఁబు
ణ్యాచారుల కెందులేని యాపద వచ్చెన్' (పై దే. 537)

కరుణ రస పరి పోషణకు, తద్వారా ఎఱ్ఱన ఔచితీ నిర్భరమైన రచనా రీతికి ఎన్నోని ఉదాహరణలు ఇవ్వవచ్చును. ఇవి కేవలం కొన్ని మచ్చుతునకలు

మాత్రమే. ఇలాగే ఎఱ్ఱన కృతులలో కరుణ రస భరితమైన రచన, కరుణ రస సృష్టి కనిపిస్తూనే ఉంటుంది.

కరుణ రసముప్పతిల్లే మరో చక్కటి సన్నివేశం స్మరించక తప్పదు. కాళీయునిచేత చుట్టబడిన బాలకృష్ణుని గూర్చి తల్లి యశోద శోకం తల్లులహృదయాలనే గాదు, అందరూ తల్లులై తల్లడిల్లునట్లు చేయగలదు.

'నా మీదం గృపఁజెప్పఁ జాలఁగలెవన్నా యేను శోకాగ్నియం
దీ మాడ్కిం బడగా నుపేక్ష దగునే యీదిక్కు చిర్నవ్వుతో
నీ మోమింపుగఁ జూపవే తెఱవవే నేత్రాబ్జముల్వల్కవే
యామోదంబుగఁ బుత్ర తల్లులకు నిట్లత్యార్తి గావింతురే'

'కడిఁది విషకంట కాటవిఁ
గడికండలు చేసి నీరు గావించితి నీ
బొడపాము నీకు నేటిది,
కొడుకా నీ కులము వంతగూరు టుడుపవే' (హ. వం. పూ.భా. 7-38,40)

ఒక్కగానొక్క కుమారుడు; వాడు మహామహిమాన్వితుడు. అయినా తల్లి హృదయం ఎలా తపిస్తుందో! ఎఱ్ఱన కరుణ రస పరిపోషణకు పై ఉదాహరణలన్నీ ఉపకరిస్తాయి. శృంగార వీర శాంతాది రసాలనేకాక హాస్యకరుణ రసపరిపోషణ సముచిత రీతిని గావించి, ఎఱ్ఱన అత్యుత్తమ కవిగా నిరూపించుకొన్నాడు.



# ఎఱ్ఱన కృతులు-అంగిరసం

నవవిధరసాలు, భక్తిరసం, మధురభక్తి ఎఱ్ఱన తన కృతులలో పరిపోషిం చిన తీరు అనన్య సామాన్యం. కాగా ఆయాకృతులలో ప్రధాన రసాలు అంటే అంగిరసాలు ఏవి ? అనే అంశాన్ని సైతం మనం సమీక్షిస్తే ఎఱ్ఱన కృతులలోని రసప్రస్థాన విధానం విదితమవుతుంది.

## నృసింహ పురాణము :

అన్ని రసాల్ని ఎఱ్ఱన ఎంతో సామర్థ్యంతో పరిపోషించాడు. అవన్నీ అంగరసాలుగానే భాసిస్తూ ఉంటాయి. పోతే ఆయా కృతులలో అంగిరసాలు ఎలా వర్ణితమో పరిశీలిద్దాము. ఎఱ్ఱన నృసింహపురాణములోని కథ అందరికీ తెలిసిందే. అది ప్రసిద్ధ భక్తుడు ప్రహ్లాదుని చరిత్ర. హిరణ్యకశిపుడు వరగర్వితుడై ఇంద్రాదులను జయించి దేవతలను బాధించగావారు విష్ణువును వేడుకొంటారు. విష్ణువు నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని తన భక్తులలో శ్రేష్ఠునిగా మన్నించి పట్టాభిషిక్తుని చేస్తాడు. ఇది ఇందలి కథ. ఇందలి ప్రధాన రసం శాంతమని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు స్థాపించారు. "ప్రహ్లాదుడు తండ్రికిని, గురువులకును, దైత్యబాలకులకును హరి మహిమానుభావములు వర్ణించుచు గావించిన యుపన్యాసములు భక్తి జ్ఞానముల కాలవాలములు. హిరణ్యకశిపు డెన్ని విధముల హింసింపఁజూచినను ప్రహ్లాదుఁడక్షతుఁడై వెలయుట కాతని భక్తి సంపదయే కారణము. అందుచే నీభాగమున నెడనెడ నితర రసముల పరిపోషణ ముకూడఁ గానవచ్చుచున్నను ప్రధానరసము శాంతమే. అహోబిలక్షేత్రమాహాత్మ్య నిరూపకమైన నరసింహుని సేవించుట వలన మోక్షము కరతలామలకమగునవి చెప్పఁబడినది. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని బాధించుటకును, హింసించుటకును గావించిన ప్రయత్నములం దొకవంక వీరరౌద్రములును వేఱొక వంక నద్భుత మును గోచరించుచున్నవి. నరసింహావిర్భావ ఘట్టము రౌద్రాద్భుతముల సమ్మేళనము. నరసింహునితోఁ బోరుటకై హిరణ్యకశిపుఁడుత్సహించు పట్టున వీరమును, నరసింహుఁడు హిరణ్యకశిపుని చీల్చి చెండాడు సందర్భమున రౌద్ర బీభత్సములును చక్కఁగాఁ బోషింపబడినవి.

"ద్వితీయాశ్వాసమున హిరణ్యకశిపుని........తపో వర్ణన సందర్భము పరస్పర విరుద్ధములైన శాంతవీరముల కాలవాలమై యొప్పారుచున్నది. అచ్చరలు హిరణ్యకశిపుని నాకర్షించుట కెన్ని విలాస విభ్రమము లాచరించినను లాభము లేక పోయెను. 'ఎలయంగ నడవిఁ గాచిన వెన్నెలలై'యవి యవిధిఁబోయెను. దీని కంతకు హిరణ్యకశిపుని తపోనైశ్చల్యమును, ధృతియుఁ గారణములు. ఇచ్చట నచ్చరల విలాస విభ్రమములు వర్ణించుపట్ల శృంగారమును, తపోవర్ణన సందర్భమున శాంతమును గానవచ్చుచున్నవి. వరలాభానంతరము హిరణ్యకశిపుడు ప్రదర్శించిన విజయోత్సాహములకు మేరలులేవు. ఈ సందర్భమున వీర రసము పరిపుష్టి నొందుచున్నది.

"హిరణ్య కశిపుడు పెట్టు బాధలు పడలేక యింద్రాది దేవతలు బృహస్పతి పురోగాములై వైకుంఠమున కేగి నారాయణుని ముందు తమ దైన్యము వెల్లడించుచు మొరపెట్టుకొనిరి. ఇచ్చట కరుణరసము గోచరించుచున్నది. తృతీయాశ్వాసము నందలి యుత్తరార్థమున హిరణ్య కశిపుని లీలా విహారము వర్ణితమైన సన్నివేశము శృంగార రసస్ఫూరితమై యున్నది. కలగాంచిన పిమ్మట హిరణ్య కశిపుని దేవేరి వ్యాకుల చిత్తయై తత్తరిల్లిన పట్టునఁ గరుణ రసచ్ఛాయలున్నవి.

"సనకసనందనాదు లాగ్రహోదగ్రులై జయవిజయులను శపించు ఘటమున రౌద్రరసమును, ఆ శాపము విని జయ విజయులు మూర్ఛమునిగిన సందర్భమునఁ గరుణ రసమును గోచరించుచున్నవి. దేవతలును, బ్రహ్మాదులును శ్రీమన్నారాయణుని స్తోత్రము చేయు సందర్భములందు శాంతరసము వెల్లివిరియుచున్నది." (నృసింహ పురాణం. పీఠిక - పు. 40, 41)

ఈ విధంగా నృసింహపురాణంలో "వీర రౌద్ర భయానక విస్మయాఖ్య రసములు" శృంగార కరుణ భక్త్యాదులతో సంకులమై అవి అంగరసాలుగా ఉండి ప్రధాన రసమైన శాంతరసపరిపోషకమై ఒప్పారుతున్నాయి. కాబట్టి ఇందలి అంగిరసం శాంతరసం.

**అరణ్య పర్వశేషము :**

మహాభారతం నవరస భరితమై ఒప్పుతూన్నప్పటికి శాంతం అంగిరసంగా సర్వపండిత లోకమూ అంగీకరించి స్థిరీకరించిన అంశం. అదే విధంగా ఎఱ్ఱన

పూర్తి చేసిన అరణ్య పర్వశేషం సైతం శాంతరస ప్రధానమే. అరణ్య పర్వం సర్వమూ పాండవుల కష్టాలకు, కడగండ్లకు నెలవు. అయినా అందులోనూ ఈ నవ రసావిష్కరణకు అవకాశం లేకుండా పోలేదు. "శారద రాత్రులుజ్జ్వలలసత్తర తారక హార పంక్తులం జారు తరంబులయ్యె ..." (అరణ్యపర్వశేషం-ప. 4-142) అన్న పద్యంతో మనోహరంగా ముగిసి పోగా, ఆ వెంటనే ఆ స్ఫూర్తి ఏ మాత్రమూ చెడకుండా ఎఱ్ఱన తన అరణ్య పర్వ శేషాన్ని ఆరంభించాడు.

"స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరి వోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల పైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరము నెలింగె వాసరముఖంబులు శారద వేళఁ జూడఁగన్"

(పై చే. 4-143)

—ఈ విధంగా ఆరంభమైన అరణ్య పర్వశేషం నవరసాలకూ ఆకరమే అయినా పర్వాంతంలో పూర్వోక్తమైనట్లు – ధర్మజుడు యక్ష ప్రశ్నలకు సముత్తరాలిచ్చి సోదరుల బ్రతికించు కోవడంతో యముడు ప్రీతుడై ధర్మజునకు ఇష్టావాప్తి కలిగించి అనుగ్రహించడంతో పూర్తి కావడం వల్ల ఇందు శాంతమే ప్రధాన రసంగా పరిగణింపబడుతుంది. మరో విశేషమూ ఉంది. శమనుడు యముడు. శాంత రసానికి స్థాయి భావం శమము. ఇక్కడ యమునితో ఈ పర్వం పరిపూర్ణం కావడం ప్రతీకాత్మకంగా శాంతరస ప్రధానమని భావించడంలో దోషంలేదు. దుర్యోధనుని ఘోషయాత్ర స్థిర భయానక రౌద్రకరుణ దయావీర రసాలకు ఆట పట్టు. సైంధవుడు ద్రౌపదిని మోహించి అపహరించడంలో వీరరౌద్ర హాస్య శృంగారాభాస దయా వీర రసాలు పరిపుష్టమయ్యాయి. శ్రీరామకథ నవరస సమ్మిళితం. . సావిత్ర్యుపాఖ్యానం – పూర్వోక్తమైనట్లు ధర్మవీర రస ప్రధానం. ధృతరాష్ట్రుడు పాండవుల అరణ్య వాసక్లేశాన్ని స్మరించి దుఃఖించడంలో కరుణరసం ఉప్పతిల్లుతూంది. ఇలాగా వీర రౌద్ర వీర భయానక కరుణ హాస్య శృంగార దయావీర దానవీర ధర్మవీరాదులైన రసాలు అంగరసాలుగా ఉండి అంగిరసమైన శాంతరసానికి పరిపోషకాలై ఒప్పుతున్నాయి. అందువలన అరణ్య పర్వశేషంలో సహితం శాంతమే అంగిరసమని తలంచడం సముచితం.

**హరివంశము :**

ఎర్రన కృతులలో హరివంశం బృహత్తర కృతి. ఇది నవరస సంకీర్ణమై శాంతం అంగిరసంగా పరిపూర్ణత పొందింది. భారతంలో అంగిరసం శాంతం. ఖిలపురాణమని ప్రసిద్ధి పొందిన హరివంశంలోనూ శాంతమే ప్రధాన రసమనడమే సముచితం. హరివంశం ఖిలపురాణమనడానికి తగిన ఉపపత్తులున్నాయి. "అధ్యాయముల తుదను పర్వముల తుదను 'ఖిలేషు' అనియుండుటఁ జేసియు, ఆదిపర్వమున హరి వంశస్తతః పర్వ పురాణం ఖిలసంజ్ఞికమ్" "భవిష్యత్ పర్వచాప్యుక్తం ఖిలేష్వే వాద్భుతం మహత్" అనియు "ఖిలేషు హరి వంశశ్చ భవిష్యచ్చ ప్రకీర్తితమ్' (2-71, 72, 257 వావిళ్ళ ప్రతి) అనియు నుండుటఁజేసి హరివంశము భారతమునకు ఖిలము. ఖిలమనగా పరిశిష్టము. ఆదిపర్వము మొదలుకొని స్వర్గారోహణ పర్వము వఱకుఁగల గ్రంథము భారతమనియు హరివంశముతోఁ గలిసిన గ్రంథమును మహాభారతమనియు నందురు. (పూర్వగ్రంథానుక్తం పరిశిష్టం వస్తు ఖిల శబ్ద వాచ్యమ్' బృహదారణ్యక - ఆనందగిరి వ్యాఖ్య 5.1) మహాన్ ప్రీహ్య పరాహ్ణ గృష్టీష్వా సజాబాల భారభారత హైలి హిల రౌరవ ప్రవృద్ధేషు, (6.2-38) అను పిట్ సూత్రమునందు మహాభారత శబ్దమును 'సుమంతు జైమిని వైశంపాయనపైల సూత్ర భాష్య భారత మహాభారత ధర్మాచార్యాస్తృప్యంతు' అను ఆశ్వలాయన గుహ్య సూత్ర వాక్యమునను భారత మహాభారతముల ప్రశంస యుండుటవలన పై సూత్రకారులకు ముందే భారతమనియు, మహా భారతమనియు విభాగము కలదని తెల్లము." (వేటూరి శివరామశాస్త్రి; ఎర్రన హరివంశం. పీఠిక-XXiii) ఇంతే గాదు ఎర్రన హరివంశంలోను ఇది ఖిలపురాణమన్న విషయం స్పష్టం చేయబడింది. హరివంశకృతిభర్త వేమభూపాలుడు—

"భారత పరాంశమని యిం
పారగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వా రమ్య కథఁ దెనుంగుగ
ధీరోత్తమ నిర్వహింపి తెలుపుము నాకున్" (హ. వం. పూ. భా. 1.40)

**హరివంశము :**

ఎఱ్ఱన కృతులలో హరివంశం బృహత్తర కృతి. ఇది నవరస సంకీర్ణమై శాంతం అంగిరసంగా పరిపూర్ణత పొందింది. భారతంలో అంగిరసం శాంతం. ఖిలపురాణమని ప్రసిద్ధి పొందిన హరివంశంలోనూ శాంతమే ప్రధాన రసమనడమే సముచితం. హరివంశం ఖిలపురాణమనడానికి తగిన ఉపపత్తులున్నాయి. "అధ్యాయముల తుదను పర్వముల తుదను 'ఖిలేషు' అనియుండుటఁ జేసియు, ఆదిపర్వమున హరి వంశస్తతః పర్వ పురాణం ఖిలసంజ్ఞికమ్" "భవిష్యత్ పర్వచాప్యుక్తం ఖిలేష్వే వాద్భుతం మహత్" అనియు "ఖిలేషు హరి వంశశ్చ భవిష్యచ్చ ప్రకీర్తితమ్' (2-71, 72, 257 వావిళ్ళప్రతి) అనియు నుండుటఁజేసి హరివంశము భారతమునకు ఖిలము. ఖిలమనగా పరిశిష్టము. ఆదిపర్వము మొదలుకొని స్వర్గారోహణ పర్వము వఱకుఁగల గ్రంథము భారతమనియు హరివంశముతోఁ గలిపిన గ్రంథము మహాభారతమనియు నందురు. (పూర్వగ్రాను క్తం పరిశిష్టం వస్తు ఖిల శబ్ది వాచ్యమ్' బృహదారణ్యక - ఆనందగిరి వ్యాఖ్య 5.1) మహాన్ గ్రీహ్య పరాహ్ణ గృష్టిష్వా సజాబాల భారభారత హైలి హిల రౌరవ ప్రవృద్దేషు, (6.2-38) అను ఫిట్ సూత్రమునందు మహాభారత శబ్దమును 'సుమంతు జైమిని వైశంపాయనపైల సూత్ర భాష్య భారత మహాభారత ధర్మాచార్యస్తృప్యంతు' అను ఆశ్వలాయన గుహ్య సూత్ర వాక్యమునను భారత మహాభారతముల ప్రశంస యుండుటవలన పై సూత్రకారులకు ముందే భారతమనియు, మహా భారతమనియు విభాగము కలదని తెల్లము." (వేటూరి శివరామశాస్త్రి; ఎఱ్ఱన హరివంశం. పీఠిక-XXiii) ఇంతేగాదు ఎఱ్ఱన హరివంశంలోను ఇది ఖిలపురాణమన్న విషయం స్పష్టం చేయబడింది. హరివంశకృతిభర్త వేమభూపాలుడు—

"భారత పరాంశమని యిం
పారగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వా రమ్య కథఁ దెనుంగుగ
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము నాకున్" (హ. వం. పూ. భా. 1.40)



అని అడిగినట్లుంది. ఇంకా చివర జనమేజయుడు వైశంపాయనుని....

"బంధు రాష్టాదశ పర్వ నిర్వహణ సం
భావితంబగు మహా భారతంబు
హరివంశ పరిపూర్ణమగునట్లుగా గ్రమ

వ్యాఖ్యాన మొనరించి తనవు నీవు" (హ.వం.ఉ.భా.10.291) అని ప్రశంసించాడు. కాబట్టి హరివంశం భారతానికి పూరక గ్రంథమని తేలింది. భారతంలో అంగిరసం శాంతం. కనుకనే ఖిలపురాణమైన హరివంశంలోనూ శాంతమే అంగిరసం. ఈ విషయం స్పృశించే ముందు మనం భారతంలో శాంతం ప్రధాన రసమని వివరించిన విశ్వనాథ సత్యనారాయణగారి వివరణ పరిశీలించడం అవసరం. "ఆలంకారికులు తొమ్మిదవ రసమును శాంతముగా స్వీకరించిరి. "నిర్వేదస్థాయి భావోస్తి శాంతోపి నవమోరసః". మహాభారతమునందు నిష్ఠే శాంతరసము నిర్ణయింపబడినది. మహాభారతము శాస్త్రచ్ఛాయ గలది. యాదవుల యొక్కయు, పాండవుల యొక్కయు అవసానముతో సమాప్తి పొందుచున్నది. అందుచేత భగవంతుడైన వ్యాసునకు ప్రధానముగా తన కావ్యము వైరాగ్యమును పుట్టించవలెనన్న తాత్పర్యము కలదిగా చేయుటయైనది. మోక్షలాక్షణికమైన పురుషార్థము శాంతరసము ముఖ్యముగా ప్రతిపాదితమౌతున్నదని సూచింపబడినది. దీనిని అనేకమంది వ్యాఖ్యాతలు వివరించినారు. ఆ వ్యాసుడు మహామోహమునందు మునిగియున్న లోకమునకు అతివిమల జ్ఞానదృష్టి కలిగించుటకే ఈ మహా కావ్యమును వ్రాసినాడు. ఇతర రసములచేత శాంతరసము ఇతర పురుషార్థములచేత నాల్గవ పురుషార్థము అనుగమింపబడుచున్నవి. శాంతరసమే అంగిగా చెప్పబడినది .. ఈ మహా కావ్యమునందు శాంతరసమే అంగి. ఇతర రసములంగములు అన్నది చక్కగా అనుసంధింపబడినది.

"సనాతనుడు భగవంతుడునైన వాసుదేవుడు ఇందు కీర్తింపబడుచున్నాడు. అన్న ఈ వాక్యమునందు ఈ యర్థము వ్యంగ్యముగా నున్నది—ఈ నిగూఢ రమణీయమైన అర్థము మహాభారతము యొక్క చివర హరివంశ వర్ణనములో మహాకావ్యమును పూర్తి చేసిన కవిబ్రహ్మయైన కృష్ణ ద్వైపాయనుని చేత స్ఫుటము

చేయబడినది. ఈ అర్థముచేత వ్యాసుడు సంసారాతీతమైన తత్త్వమునందు భక్తి యొక్క గొప్పతనమును నిరూపించుచున్నాడు. సాంసారికమైన వ్యవహారము పూర్వ పక్షము చేయబడినది. పాండవుల చరిత్రయే వైరాగ్యమును పుట్టించునదిగానై యున్నది. వైరాగ్యము మోక్ష మూలము........మహా భారతమునందు సాక్షాత్ భగవంతుడైన శ్రీకృష్ణుడే కీర్తింపబడెను. మోక్షలక్షణమైన పురుషార్థమే యుత్కృష్టమనియు తృష్ణ నశింపజేయుటయు సుఖమును పెంపొందించుటయు లక్షణముగాగల శాంత రసమే మహా భారతమునందలి అంగిరసమనియు లెస్సగా ప్రతిపాదింపబడినది.

"శాంతరసము లోకక్రియల నుండి ఉపరతి బోధించునది. యోగుల చిత్త వృత్తికి సన్నిధానమందున్నది. సర్వభావముల యొక్క ఉపశాంతి యొక్క స్వరూపమది.

"శాంతరసము క్లిష్టమైనది. అది జీవితావసానము నందు లేదా పూర్వజన్మ సంస్కార వశమున పరిణతమైన వేళయందు నిరంతర జిజ్ఞాసా శ్రద్ధా వేదాంత చర్చాలోక విషయగత వైరాగ్య పరిపాకాదుల చేత సిద్ధించునది. అచ్చటిదీ శాంత రసము. శాంతమునకే 'రసో వైసః' అని చెప్పబడును. నిర్మలినానందమునకు గుణతః మిక్కిలి దగ్గర, ప్రయత్నతః చాలదూరము. తక్కిన రసములన్నియు నీ రెంటి నడుమ ఉన్నవి.

"ఆనందవర్ధనుడు మహాభారతమును గూర్చి చెప్పుచు 'శాస్త్ర రూప కావ్య రూపాన్వయిని మహాభారతే' అన్నదిందుకనే. భగవంతుడు వ్యాసుడు తన కావ్యమునందు శాంతరసము నంగిరసముగా తీర్చిదిద్దుకొనుటకు వేదములు, నుపనిషత్తులు శాస్త్రములు, దర్శనములు, పూర్వరాజకథలు, అర్థ వాదములు, లక్షలు నిక్షేపించుకొనవలసివచ్చెను." (విశ్వనాథ సాహిత్యోపన్యాసములు - పు. 22, 26, 29, 38, 39)

పై విశ్వనాథవారి పరిశీలనలో భారతంలోని ప్రధాన రసం శాంతమనీ, దానికి స్థాయి భావం నిర్వేదమనీ స్పష్టమయింది. ఇతః పూర్వం శాంత రస నిరూపణంలో

స్థాయి శమమని మనం గుర్తించాము. కాబట్టి హరివంశంలోను శాంతమే అంగిరస మనడంలోను, దానికి శమం స్థాయి భావమనడంలోనూ ఎలాంటి విప్రతిపత్తి ఉండనవసరంలేదు. హరివంశం భారతాన్విపూరక గ్రంథం. అంటే ఖిల పురాణమన్న విషయం ఇంతకుముందే పూర్వకవి విద్వాంసులచేతా, లాక్షణికుల చేతా నిరూపింపబడిన విషయమూ మనకు తెలుసు. "సంస్కృత హరివంశమున హరివంశ పర్వము, విష్ణుపర్వము, భవిష్య పర్వమని మూడు భాగములు కలవు....

"ఎఱ్ఱాప్రెగ్గడ తన హరివంశమున ఈ విభాగములను యథాతథముగ పాటింప లేదు. అసలు ఈ మూడు పర్వముల పేర్లను ఎఱ్ఱన గైకొనలేదు. ఆయన తన గ్రంథమును పూర్వోత్తర భాగములని రెండుగ విభజించెను. అందు పూర్వభాగ మున తొమ్మిదాశ్వాసములును, ఉత్తర భాగమున పది యాశ్వాసములును గలవు. అదిగాక ఎఱ్ఱనకు లభించిన హరివంశము మూడు పర్వములు గలదిగాక పూర్వ భాగము, ఉత్తర భాగము అనెడి రెండు విభాగములు కలదియైయుండునేమోయని సందేహించుట కవకాశము కలదు.

"ఎఱ్ఱన పూర్వభాగమున నలుగాశ్వాసములలో హరివంశ సర్వకథా సందర్భ మును ముగించెను. అటనుండి ఐదవ ఆశ్వాసము మొదలు ఉత్తర భాగములోని ఎనిమిదవ ఆశ్వాసము వరకు శ్రీకృష్ణుని జీవితచరిత్రను క్రమముగా అభివర్ణించెను. అవన్నియు సంస్కృతమున విష్ణుపర్వమునందు భవిష్య పర్వమునందును గలవి. వ్యాసుడు భవిష్య పర్వమున చేర్చిన కృష్ణసంబంధి కథలను (హంస డిభకోపాఖ్యా నము తప్ప) అటనుండి తొలగించి శ్రీకృష్ణుని జీవిత చరిత్రలో వాటికి గల అర్హ స్థానమున నిల్పెను. వాటిలో హంస డిభకోపాఖ్యానము నెందులకో తడవలేదు. మరి విష్ణు పర్వములోనిదే అయిన వజ్రనాభవధ యనెడి ప్రభావతీప్రద్యుమ్నో పాఖ్యానమును కూడ ముట్టలేదు. హంసడిభకోపాఖ్యానమును విసర్జించుటకేమి కారణమో చెప్పలేము. రెండవదియైన ప్రభావతీ ప్రద్యుమ్నోపాఖ్యానము ఇంచు మించు ఉషాపరిణయ కథ వంటిదే కనుక దానిని వదలిపెట్టి యుండవచ్చును. ఇక మిగిలిన భవిష్య పర్వమును చాలా సంగ్రహించి తుది రెండాశ్వాసములలో ముగిం

చెను. ఈ హరివంశానువాదము భారతానువాదము వలెనే కథామాత్రానువాదమై స్వతంత్రముగా నడచెను. కావ్య శిల్పమున కనుకూలించెడి ఘట్టములనన్నిటిని రసభరితముల నొనర్చి మూలమునకు వన్నె పెట్టెడి రచనా నైపుణిని ప్రదర్శించెను." (పింగళి లక్ష్మీకాంతం - ఆంధ్రసాహిత్య చరిత్ర - పు. 294, 295).

ఇది ఎర్రన హరివంశములో అనుసంధించిన కథారీతి. తదితరాంశాలు ప్రసక్తాను ప్రసక్తంగా నవవిధ రసాలు, నవవిధ భక్త్యాదులు వివరించిన పట్టులలో తడవడం జరిగింది. వాటిని మళ్ళీ పునశ్చరణ చేయడం పునరుక్తి దోషమవుతుంది. పై రసాలన్నీ అంగరసాలుగా ఉండి ప్రధాన రసమైన శాంతరసానికి హరివంశంలో పరిపోషకాలుగా ఉన్నాయి.

హరివంశ పూర్వ భాగంలో నానారాజ జనన వృత్తాంతాలతో పాటు శ్రీకృష్ణ జనన, బాల్యక్రీడలు ముగ్ధమనోహరంగా అభివర్ణించి తరించాడు ఎర్రన. గో గోప, గోపీజన జీవనవర్ణనం స్వభావ సిద్ధంగా చిత్రించి నాన్యతోదర్శనీయం చేశాడు ఎర్రన. బాల్యంలోను, అతర్వాత ఉత్తర భాగంలోను దుష్ట సంహారం ప్రధాన ధ్యేయం. ఆయా వర్ణనల్లో వీరరౌద్ర భయానకాద్భుత, హాస్య శృంగార రసాలు అతి స్నిగ్ధంగా వర్ణించడం ప్రశంసనీయం. చివరికి కథ శాంతరసంతో పరిపూర్తి చెందుతుంది. శ్రీకృష్ణుడు లీలామానుష విగ్రహుడు. విష్ణువుయొక్క గొప్పదనాన్ని జనమేజయునకు వైశంపాయనుడు ఇలా వర్ణించి చెప్పాడు.

"గోప్యవేదుల కతి గోప్యుండనంగను
తత్త్వవాదుల కాది తత్త్వమనగ
నాత్మ బోధనుల కాత్మాత్మంబనంగను
వేదంబునకు నిత్య వేద్యుడనఁగ
గర్తయుఁ గరణంబుఁ గార్యంబు పురుషుండుఁ
బ్రకృతియు బుద్ధియుఁ బ్రాణచయము
గాలంబుఁగళయు వక్తయును వక్తవ్యంబు
వాక్కునుఁనను బహుత్వంబు లెల్ల

దానవ్రై నిత్యుఁడమృతుఁడద్వంద్వుఁడజరుఁ
డప్రమేయుఁ డనాద్యంతుఁడజుఁడనంగఁ
బరగు విష్ణుండు విశ్వైక భర్త నిఖిల

మునకు నొక్కండ సంహర్త పుణ్యయశుఁడు" (హ.వం.ఉ.భా. 10-100)
ఇలాగే చిత్రరేఖ ఉషతో అనిరుద్ధుని గొప్పదనాన్ని ఉగ్గడిస్తూ అతని తాతశ్రీకృష్ణుని ఔన్నత్యాన్ని ఇలా చిత్రించింది.

"త్రైలోక్యంబును నేలు దేవుఁడు ధరన్ ధర్మంబు నిల్ప న్నరుం
డై లీలన్ యదురాజ వంశమున విఖ్యాతంబుగాఁ బుట్టిగో
పాలీకేళికరుండు నాఁ బరఁగె నే భవ్యాత్ముఁ డాశౌరికిన్
బాలా మన్మఁడు వీఁడు తత్సముఁడు సౌభాగ్యానుభావంబునన్"

(పై దే 7-154)

ఇంతేగాదు శ్రీకృష్ణుడే దాను దుష్ట శిక్షణ, శిష్టరక్షణ కోసం అవతరించిన విషయం తానే స్వయంగా పేర్కొనడం గమనించదగ్గ అంశం.

"క్షత్రియుఁడనేను యదువంశ సంభవుండ
దుష్టమర్దన సుజన సంతోషణముల
యందుఁ జాలెడు వాడ........" (పై దే. 5-179)

ఇది ప్రధానాంశంగా గ్రహించి పైనిపేర్కొన్న రసాలన్నిటిని పరిగణనలోనికి తీసుకొని మనం పరిశీలించినప్పుడు ఇందలి ప్రధాన రసం శాంతమని స్పష్టమవుతుంది. ఇంకా ఇందలి నిర్వేదకారణభూతమూ శమకారణమూఅయినా తపోభక్తులను పరిశీలిస్తే దృఢపడుతుంది.

శాంతరసోపస్కారకాలైన అనేకోదాహరణలు మనం పరిశీలించాము. గోపీ కృష్ణుల, రుక్మిణీ కృష్ణుల మధురభక్తి, భక్తి ఆత్మనివేదనైక ప్రపత్తి మనం చూడగలం. ఉగ్రసేనునంతటివాడు పుత్రమరణమే అయినా అత్యంత గౌరవ ప్రపత్తితో శ్రీకృష్ణుని సంభావించడం, దేవకీ వసుదేవులు, యశోదానందులు చూపిన వాత్సల్య

భక్తి అత్యద్భుత వర్ణనా వైవిధ్య వైశిష్ట్యాలతో నాన్యతో దర్శనీయం. అక్రూరుని సఖ్యభక్తి అనితరసాధ్యమైంది.

శ్రీకృష్ణుని సంహారార్థం కంసుడు చేసిన ప్రయత్నాలలో, పూతనాదుల బాల కృష్ణుడు వధకావించడం, కాళీయుని, కేశి[illegible]సుని, కువలయాపీడుని, చాణూర ముష్టికులను, కంసుని, కాలయవనుని, నరకాసురుని, పౌండ్రక వాసుదేవుని, బాణా సురుని, బలిని సంహరించడంలో శ్రీకృష్ణుని పరాక్రమం చివరికి వారికి ఉపశాంతి లభించడం, అందునా ముఖ్యంగా బాణాసుర బలి హిరణ్యకశిపులను వధించి అనుగ్ర హించడం వీటిలో ఎంతగానో నిర్వేదం స్పష్టమైంది. చివరి దశలో ఇందులో చివరికి శాంతమే పరిపుష్టమైంది. ఆయా రాక్షసుల తపస్సు, ముచికుందుని తపస్సు, ముచికుందుని తపస్సు, చివరికి సంతానం నెపంతో శివునిగూర్చి తపస్సు చేయడానికి శ్రీకృష్ణుడే కైలాసానికి బయలుదేరడం, హరిహరాద్వైతం అభివర్ణిం చడం, ఘంటాకర్ణుని భక్తి, ఇంద్రాది దేవతలు, గరుడుడు శ్రీకృష్ణుని స్తుతించడం వీటన్నిటా శాంతమే ప్రాముఖ్యం వహిస్తుంది. కాబట్టి వివరణాత్మకంగా పూర్వో క్తమైనట్లు వీరభయానక బీభత్సరౌద్ర, హాస్య, కరుణాద్భుత భక్తి శృంగారాది అంగ రసాలతో శాంతరసం ప్రధాన రసంగా పరిపుష్టి చెందుతూంది.

కాబట్టి భారతానికి పూరక గ్రంథమైన హరివంశం భారతం లాగానే శాంతం అంగిరసంగా గలిగిన ఉత్తమ కృతి. ఎఱ్ఱన ఈ మహాకృతి రచన మూలంగానే నన్నయ తిక్కనలతో సమానస్థానమాక్రమించి పెగద్దె నెక్కినట్లు స్పష్టమవుతుంది. ఈ కవిత్రయం ఆంధ్రులందరికీ ఆరాధ్యులయ్యారు. ఎఱ్ఱన ఈ కృతిద్వారా సుకృతి అయ్యాడు. ఈ విధంగా ఎఱ్ఱన కృతులలో శాంతమే అంగిరసమై అత్యంతాదరణీయమై ఒప్పుతూంది.

చివరికి లోకకళ్యాణమే ప్రాధాన్యం వహించినట్లు స్పష్టం. శ్రీకృష్ణావ తారం దుష్టులను దునిమి శిష్టులను సంరక్షించడం ఎఱ్ఱన కృతులన్నిటా స్పష్టం. హరివంశంలో ఈ విషయం వ్యంగ్యంగా, వాచ్యంగా అభివ్యక్తీకరించబడ్డది. యాద వులు ఆ బాలగోపాలమూ శ్రీకృష్ణుని గూర్చి అభివర్ణించడంలో ఈ విషయం స్పష్టం.

"ఈ వసుమతి యంతయు నిటు
మీవలనఁ బ్రతిష్ఠవడసె మీవారగు వా
రే వారు వారు కల్యా
ణావాసుఁ బదారయగుట యరిదియె యనఘా"

"అన విని రాము డిట్లనియె నక్కట యింతననేల మీరు గా
ర్మి నెఱయఁ బెంపగా మ్రి చిరకీర్తిఁ జనించి యాగృహం
బున సరసాన్నముల్గుడిచి బుద్ధి దనర్చిన వాకునేంచు గో
ళన మనుచేమి సందియము బాంధవు లెవ్వరు మిమ్ము బోలగన్"

(పై దే. 2-81, 82)

అని స్పష్టం చేయడంతో లోకకళ్యాణార్థమే శ్రీకృష్ణుడుద్భవించినట్లు స్పష్టమవుతుంది. హరివంశం చివర భగవద్భక్తి, భారత హరివంశ పఠనం వల్ల కలిగే ఫలం వర్ణితం.

"శ్రీమహా భారతంబు హరివంశోత్తంసంబుగా నఖిలంబును యథాశ్రుతవ్యాఖ్యానంబుగాఁ జేసి మిమ్ము నారాధింపం గలిగె నే ధన్యుండనైతి" (పై దే. 10-347) నని జనమేజయుడు వైశంపాయనునితో చెప్పడమే ఇందుకు చక్కటి ఉదాహరణ.

ఇలాగా శాంతమే అంగిరసమై ఒప్పారుతుందని స్పష్టం.

ఎఱ్ఱన తన కృతులన్నిటా నవరస సంభరితంగా సహృదయ హృదయావర్జకంగా రచన చేసి శాంతం అంగిరసంగా పరిపోషించి ఉండడం వల్ల ఎఱ్ఱన రస ప్రస్థాన వైశిష్ట్యం స్పష్టం, తదనంతర కవుల కెందరికో ఎఱ్ఱన మార్గదర్శకుడయ్యాడని చెప్పడం దోషం కాదు.

# అన్నమాచార్య కవితా కామనీయకం

తాళ్లపాక అన్నమాచార్యుడు (1408-1503) పదకవితాపితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ బిరుదులచేత అలంకృతుడై ప్రసిద్ధుడైనవాడు; అతడు ఆడిపాడిన శృంగార, అధ్యాత్మ ద్వివిధ సంకీర్తనలలో ఈనాడు సుమారు 15వేల సంకీర్తనలు లభ్యమవుతున్న అంశం అందరికీ తెలిసిందే. అతడు కేవలం సంకీర్తనకారుడేగాదు; పదకవితాపితామహుడన్న ప్రఖ్యాతి గడించడం చేత అతని పదాల్లోని కవిత కమనీయమేగాదు రమణీయమని విదితమవుతుంది. ఉదాహరణలవల్ల ఈ అంశం సుస్పష్టమవుతుంది.

అన్నమాచార్యుల సంకీర్తనలు స్వయంసంపూర్ణాలు; వేటికవే కావ్యాలు - గీతికావ్యాలు. వీటికి ఏక సూత్రతలేదు. కామనీయకత, రామణీయకత, మనోరంజకత సహృదయహృదయావర్జకత, సద్యఃపరనిర్వృతి ఈ పదాల లక్షణాలు. భావుకత, చమత్కారవైభవం, శ్లేష, వ్యంగ్యవైచిత్ర్యాలు, వర్ణనావైదగ్ధ్యం, ఆలంకారిక శైలీవిన్యాసం మొదలైన లక్షణాలన్నింటినీ-ఉత్తమ కవికుండవలసినలక్షణాలన్నింటినీ-పదకవి అయిన అన్నమాచార్యులలో చూడగలము. ఇంతేగాక విశ్వనాథుని 'వాక్యం రసాత్మకం కావ్య'మ్మనే నిర్వచనానికీ, జగన్నాథ పండిత రాయల 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దఃకావ్య'మ్మనే సిద్ధాంతానికి సమంగా సరిపోయే సంకీర్తనలు అన్నమాచార్యులవి. అందుకే ఆయనకున్న పదకవితాపితామహుడన్న బిరుదు సార్థకమైంది.

భావుకత :

అన్నమాచార్యుల భావుకత, ఊహాశాలిత, తన్మూలంగా ప్రతిభ స్పష్టమవుతాయి. ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభగరీయసిగదా ! పదరచనలోని ఉచిత భాషా ప్రయోగం అన్నమాచార్యుల విశిష్టలక్షణానికి నిదర్శనం. తెలుగు పలుకుల తేటదనం, తియ్యందనం మనకు విదితమవుతాయి. కొన్ని ఉదాహరణలు :

శృంగార నాయికా చిహ్నాల గూర్చి చెలులు తమలో తాము అనుకొంటున్న మాటలు. తద్వారా అన్నమాచార్యుల భావుకత ఊహాశాలితతో కూడిన ప్రతిభా సంపద మనోరమంజులమై, రసరంజకమై ఒప్పడమీ పదంలో గమనిస్తాము.

'ఏమొకో చిగురుటధరమున నెడనెడగస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా ॥పల్లవి॥

కలికి చకోరాక్షికిఁగడకన్నులు కెంపైతోఁచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువునఁ బ్రాణేశ్వరుపై నాటిన యాకొనచూపులు
నిలువునఁ బెరుకగ నంటిన నెత్తురుగాదు గదా ॥ఏమొకో॥

పడతికి చనుగవ మెఱుగులు పైపైఁ బయ్యెద వెలుపల
కడుమించిన విధమేమో కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకలోఁ బ్రియుడొత్తిన నఖశశిరేఖలు
వెడలఁగ వేసవికాలపు వెన్నెల కాదుగదా ॥ఏమొకో॥

ముద్దియ చెక్కుల కెలకుల ముత్యపుజల్లుల చేర్పులు
నొద్దికలాగులివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దినసురతపుఁ జెమటల అందము గాదుగదా ॥ఏమొకో॥

(శృం. సం. 12-82)

ఈ పదంలోని శృంగారనాయిక అలమేలు మంగాదేవి. నాయకుడు శ్రీవేంకటేశ్వరుడు. వారి శృంగార కార్యకలాపాన్ని గూర్చి అత్యంత మనోజ్ఞంగా చెలులు ఉత్ప్రేక్షిస్తూ, ఊహిస్తూ సహృదయహృదయాలను అత్యంతమానందింపచేస్తున్నారు. ఇందులో భావుకత ననుసరించిన భావమూ, భావాన్ని అనుసరించిన భాషా ఒకటిని మించి మరొకటి పోటీపడుతున్నట్లు స్పష్టమవుతుంది. అదే అన్నమాచార్య ప్రతిభా సంపద !

మరో మంచి ఉదాహరణ : ఈ పదంలో నాయికాయౌవనం నాయకునికి పెట్టనికోట అట. అదీ 'పతిమదనసుఖరాజ్య భారంబునిలిపేదట. ఆనాయికాసౌందర్య వర్ణన అనన్య సామాన్యం; ఆస్వాదనైకవేద్యం !

"అతివజవ్వనము రాయలకు వెట్టనిఁట్టిన్నకోట
పతిమదన సుఖరాజ్య భారంబునిలుప ॥పల్లవి॥

కాంతకనుచూపు మేఘంబులోపలి మెఱుగు
కాంతుని మనంబు చీకటి వాఁపను
ఇంతిచక్కని వదనమిందు బింబము విధుని
వంత కనుదోయి కలువలఁ జొక్కఁజేయ ॥అతివ॥

అలివేణి ధమ్మిల్ల మంధకారపు భూమి
కలికి రమణునకు నేకతమొసగను
పొలతికి బాహువులు పూవుఁదీగెలకొనలు
పొలసి ప్రాణేశువలపుల లతల పెనచ ॥అతివ॥

పంకజానన రూపు బంగారులో నిగ్గు
వేంకటేశ్వరు సిరులు వెదఁజల్లగా
చింకచూపుల చెలియచేత మదనునిచేత
యింకా నతనినె మోహించఁ జేయగను ॥అతివ॥"

(శృం. సం. 12-93)

ఇందలి ఔపమ్యం అసామాన్యం; అత్యంత రసరంజకం; భావచిత్రాలు, పదచిత్రాలు సహృదయావర్జకాలు. ఇలా ఎన్నైనా ఉదాహరించవచ్చు.

చమత్కారం :

అన్నమాచార్యుల పదాల్లో చమత్కార వైభవం మనోజ్ఞమై అత్యంతానంద సంజనకంగా గోచరిస్తుంది. దీని ద్వారా అన్నమాచార్యుల కవితా కామనీయకం సువిదితమవుతుంది.

ఒకటికొకటి పరస్పర విరుద్ధాలైన ఉపమలను నాయికావయవాల పరంగా వర్ణించి, అవి నాయికలో సమకూరడంలోని విశేషవ్యక్తీకరణతో చమత్కారాన్ని ప్రకటించాడు.

"ఒకటికొకటి గూడదోయమ్మ వీయందే
సకళలమునెటువలె సంతసేసితివే ॥పల్లవి॥

తానకు, నీకుచాలు దంతికుంభాలఁబోలితే
యీనడుమ సింహమునేల పోలెనే
ఆనివట్టి నీకన్నులంబుజాలఁబోలితేను
ఆననము చందురుని నది మేల పోలెనే ||ఒకటి||

అతివ నీ చేతులు బిసాంగములఁబోలితేను
యితవై నడపు హంసనేలపోలెనే
చతురత నాసికము సంపెంగ బోలితేను
తతి నీకురులు తుమ్మెదలనేలపోలెనే ||ఒకటి||

నేవళపునీయారు నీలాహిబోలితేను
యీవల మేను మెఱుపునేల పోలెనే
శ్రీవేంకటేశుమోవి చిన్ని కెంపులంటించి
ఆవేళ దంతాలు వజ్రాలై పట్టుపోలెనే ||ఒకటి||

(శృం. సం. 30-204)

ఈ పదంలోని కవులభావుకతలోని కవిసమయాల్లోని విరుద్ధాంశాల్ని గ్రహించి నాయిక అవయవాలతో పోల్చి అన్నమాచార్యులు చమత్కరించడం గమనించి సహృదయహృదయాలు ఆనందతుందిలాలవుతాయి.

వ్యంగ్యవైభవం :

శ్లేష, చమత్కారం మొదలైన విశేషాలతోపాటు వ్యంగ్యవైభవం అన్నమాచార్యుల పదాల్లో ప్రత్యక్షమవుతుంది. ఆమహనీయుని ప్రతిభాపాండిత్యాలు తద్వారా లలితమనోజ్ఞమూ, సుందరసుకుమారమూ అయి ఆనందకంద మవుతాయి.

"ఏటికి సత్యాలు సేసేవెంధాకా నీవు
గాటముగ నింకాఁ దారుకాణించవలెనా ||పల్లవి||

చెలియిచ్చిన పువ్వుల చెండు నీచేత నున్నది
మలసి నీ చేత కదిమచ్చుముగాదా
కొలఁదిమీరఁగ తొల్లె గొల్లెతల మగఁడవు
మెలమి నీపెద్దతనాలెంచి చూపవలెనా ||ఏటి||

రమణిచేముద్దుటుంగరము నీవేల నున్నది
కొమరై నీపొందు కది గురుతుగాదా
తమితోడనీవు తొల్లి ధర్మరాజు మ్రుదివి
గములై నీ నిజాలకు కడ గురుతున్నదా ॥ఏంటి॥

అంగన కంటసరినేఁ దట్టై యెదనున్నది
సంగతిగా నీకదె లాంచనముగాదా
చెంగట నన్నేలితివి శ్రీవేంకటేశ్వర
అంగపునీరతులకు నాఁగాములున్నవా ॥ఏంటి॥

(శృం. సం. 25-15)

అనత్యాలకోరని ఈ పదంలోని శ్రీకృష్ణునిగా శ్రీవేంకటేశ్వరుని నిందించి నట్లు వ్యంగ్యస్ఫూర్తితో పదమంతా వర్ణితం. వ్యంగ్యవైభవం ఆనందతావలమై అన్నమాచార్యునొక కవీశ్వరునిగా నిరూపిస్తుంది.

అపురూపభావ ప్రయోగాలు :

అన్నమాచార్యుల పదాలలో అపురూప భావప్రయోగాలువిరివిగా కనిపిస్తాయి. అవి ఆయన ప్రతిభా పాండిత్యాలకు, భాషామర్మజ్ఞతకు, తత్ప్రయోగనైపుణ్యానికి నిదర్శనాలు. దీనివల్ల ఆతని భావనావైశిష్ట్యమూ విదితమవుతుంది.

"వలపారగించవమ్మ వనిత నీ
యలుక చిత్తమున కాకలిసేసినది ॥పల్లవి॥

అడియాసలనె పక్వమైన సోయగపు
వెడయలుకల మంచి వేఁడివేఁడి రుచులు
ఎడసేసి తాలిమి నెడయించి పైపైనె
పొడమిన తమకంపు బోనము పెట్టినది ॥వల॥

ఆమంచి మధురంపు అధరామృతముల
కే మారుఁదావులుఁజల్లువెన్నెల బయటను
కోమల పుఁదరితీపు కోరిక గుమ్మరించి
భామకు పూఁబానుపు పళ్లెము పెట్టినది ॥॥వల

కన్నులు కాంక్షలనెడి కళకళముడిరె
సన్నపునవ్వులనె చనవగ్గలించెను
అన్నవపు మరపు నీ కంతవింత కలిగెనే
ఇన్నియును దిరువేంకటేశుని మన్ననలు ॥వల॥

(శృం. సం. 12—25)

ఈ పదంలో చెలికత్తె నాయకను నాయకుడైన శ్రీవేంకటేశ్వరునితో శృంగారానుభూతిని పొందుమని ఉద్బోధిస్తుంది. ఇందులోని భావనాశక్తి (Imaginative power) అనన్య సామాన్యమేగాదు, అనుపమానం;అందుకేఅపురూపమని పేర్కొ-వడం. అభావనాపటిమకు తగినరీతిలో ప్రయోగాలు సైతం అపురూపంగా తమంతతామే వచ్చి పదంలో కుదిరిపోవడం గమనించగలము."వలపారగించవమ్మా, నీవలవు చిత్తమునకాకలి చేసినది, మంచివేడివేడి రుచులు, తమకంపు బోనము పెట్టినది, పూఁటానుపు పళ్లెము పెట్టినది." అనేవి అపురూప ప్రయోగాలు. 'వల పారగించడం, వలపు చిత్తానికి ఆకలి వేయడం, వేడివేడి రుచులు, తమకపు బోనము పెట్టడం, పూఁటానుపుపళ్లెము పెట్టడం' అనే ప్రయోగాలు అన్నమాచార్యుల భావనా వైశిష్ట్యానికి, తదుచిత ప్రయోగ నైపుణ్యానికి చక్క-టి ఉదాహరణలు. ఇలాంటి అపురూపభావాలు, ప్రయోగాలు అన్నమాచార్యుల పదసాహిత్య మంతటా గోచరిస్తాయి.

వర్ణనా వైదగ్ధ్యం :

కావ్యంలో వర్ణనలో-అందునా ప్రబంధంలో అష్టాదశ వర్ణనలుంటేనే కవి ప్రతిభకు, కావ్యత్వానికి గీటురాళ్ళు· పైగా 'వర్ణనా నిపుణఃకవిః' అన్నలాక్షణికోక్తి ఉండనేఉంది. అదేరీతిని పదకవితా పితామహుండైన అన్నమాచార్యుల పదాల్లో సైతం ఈ వర్ణనానైపుణ్య వైశిష్ట్యనిదర్శనాలుగా అనేకోదాహరణలు మనం చూప వచ్చును. అవిపలురకాలు; వివిధాంశాల వివరణాత్మకాలు; కవిప్రతిభా పాండిత్యాలకు నికషోపలాలు.

ప్రబంధనాయికా వర్ణనలో కచకుచాదులను విరివిగా వర్ణించడం పరిపాటే! కానీ అన్నమాచార్యులు అలాంటి వర్ణనలు చేసినా ఎంతోఔచితీసహంగా, సము చితంగా వర్ణించినట్లు మనకి కిందిపదంలో తెలుస్తుంది. అదే ఆయన ప్రత్యేకత.

"క్షీరాబ్ధికన్యకకు శ్రీమహాలక్ష్మికిని
నీరజాలయమునకు (యకును) నీరాజనం ॥పల్లవి॥

జలజాక్షి మోమునకు జక్కవకుచంబులకు
నెలకొన్న కప్పురపు నీరాజనం
అలివేణి తురుమునకు హస్తకమలంబులకు
నిలువుమాణిక్యముల నీరాజనం ॥క్షీరా॥

చరణ కిసలయములకు సకియరంభోరులకు
నిరతమగు ముత్తేల నీరాజనం
అరిది జఘనంబునకు వతివ నిజ(నత)నాభికిని
నిరతనా వర్ణ నీరాజనం ॥క్షీరా॥

పగటు శ్రీవేంకటేశు పట్టపురాణియై
నెగడు సతికళలకును నీరాజనం
జగతినలమేల్మంగ చక్కదనముల కెల్ల
నిగుడు నిజశోభనపు నీరాజనం ॥క్షీరా॥

(శృం. సం. 26-295)

ఇదేరీతిని కన్యావయవాలు అలంకారాలైన రీతి అన్నమాచార్యుల వర్ణనా పైదర్థ్యానికి చక్కటి నిదర్శనం.

"చింతాపరంపరలు చిత్తంబునకుఁ దొడవు
ఇంతిసౌభాగ్యంబులన్నింటికిఁ దొడవు ॥పల్లవి॥

కలికి నెమ్మోమునకుఁ గదరీపరము తొడవు
తళుకుఁజూపులు చక్కదనమునకుఁదొడవు
ఎలమి చెక్కుల మించులిరువంకలకుఁదొడవు
మొలకనగవులు సొబగు మురిపెముల తొడవు ॥చింతా॥

కరమూలరుచులు బంగారంబునకు దొడవు
గుఱిగాని కొందీగె గుబ్బలకుఁదొడవు

సిరిపొలఁకు జఘనంబు చిన్నినడపుల పొడవు
నిరతంబుఁ బాదములు నిలుపనకు (పొడవు ॥చింతా॥
శ్రీవేంకటేశు కృప చెలియకెప్పుకుఁ పొడవు
భావసంగతులకును బరవశమె తొడవు
ఈ పెలఁది నునుబలుకు అంచు విలుతుని తొడవు
లావణ్యములకు నీ లలనదాఁ పొడవు ॥చింతా॥

(శృం. సం. 12-131)

ఈ పదంలో అంత్యప్రాస 'తొడవు' తప్పనిసరిగా పాటించబడింది. మనోహరమైన భావన, భావనకు తగ్గభావం, ఆభావానికి తగ్గభాషా, తదుచితమైన ప్రతిభా సమున్మేషమైన రచనా వైదగ్ధ్యం, వర్ణనానైపుణ్యం అన్నమాచార్యులకే దక్కిన మహోఘనత.

ప్రబంధాలలో అష్టాదశవర్ణనల్లో ఋతువర్ణన ప్రాముఖ్యం వహిస్తుంది. కవివర్ణనానైపుణ్యానికి చక్కటి నిదర్శనమవుతుంది. ఆముక్తమూల్యదలోని ఋతువర్ణనలే శ్రీకృష్ణదేవరాయలను మహోత్తకు కవినిచేశాయి. కాళిదాసు ఋతుసంహారం మొదలుకొని తెలుగు ఋతువుల వరకు గల రచనలు ప్రకృతి పరిశీలనా, దక్షతకు ప్రతిభకు నిదర్శనాలు. అలాగే పదకవితాపితామహుడైన అన్నమాచార్యులు తన పదాల్లో సందర్భోచితంగా ఒకే పదంలో షడృతువర్ణనచేయడం, అదీ ఔచిత్య శోభితంగా ఉండడమూ ఆయన ప్రతిభకు, ప్రకృతి పరిశీలనావక్షతకు, మానవ మనఃప్రవృత్తి అందునా స్త్రీమనఃప్రవృత్తిని గ్రహించిన తీరునకు ఉదాహరణ మవుతుంది. ఆయన వర్ణనావైదగ్ధ్యానికి నిదర్శనమవుతుంది.

విరహ వ్యథా భరిత మనస్క అయిన నాయికాపరంగా షడృతు వర్ణన చేయడం ఆయన కవితా ప్రతిభకు పతాక.

"కాలము లారురు గలిగె నీ కునిదె
బాలకి యందే పై పై నీకు ॥కాల॥

సతి కొప్పు విరులు జల జల రాలిన
లతల వసంత కాలము నీకు
కతగా(దనమై కా(కలు చూపిన
అతి వేసవి కాలమప్పుడే నీకు ॥కాల॥

కౌ(గిట చెమటల కడు నిను దడపిన
కౌ(గల తొలుకరి కాలమది
పే(గని చూపుల వెన్నెల చల్లిన
రా(గిన మతికి శరత్కాలంబు ॥కాల॥

లంచపు( పులకల లలన నీరతుల
కంచపు హేమంత కాలమ
ెంచ(గ శ్రీ వేంకటేశ వలపు సతి
వంచ శిశిరకాల వైభవ మాయ ॥కాల॥

(శృం. సం. 26-88)

నాయిక శృంగార చేష్టలనే నాయకునకు ఆరు ఋతువులుగా వర్ణించి సహృదయ హృదయావర్జకం చేశాడు అన్నమాచార్యులు.

అలమేలు మంగాదేవి దివ్య దివ్యలాస్యాన్ని రసభావాలకు,రాగతాళాలకుతగిన రీతిలో అత్యంతమనోజ్ఞంగా అభివర్ణించి తరించాడు అన్నమాచార్యులు. శంకరాభరణం ఆది తాళంలోని ప్రసిద్ధ పదం.

"అలరులు గురియగ నాడెనదే
అలకల గులుకులనలమేల్మంగ ॥వల్లవి॥

అరవిరిసొబగుల అతివలు మెచ్చగ
అరతెర మరగున నాడెనదే
వరుసగ పూర్వ దువాళపు తిరుపుల
హరి గరగింపుచు నలమేలుమంగ ॥అలరు॥

మట్టపు మలపుల మట్టెల కెంపుల
తట్టడి నడపుల దాటెనదే
పెట్టిన వజ్రపు పెండెపు దళుకులు
అట్టిటు చిమ్ముచు నలమేలుమంగ ॥అలరు॥

చిందుల పాటల సిరిపొల యాటల
అందెల మ్రోతల నాడెనదే
కందువ తిరువేంకట పతిమెచ్చగ
అందపు తిరుపుల నలమేలుమంగ ॥అలరు॥

(శృం. సం. 12-24)

అన్నమాచార్యుదే ఇందులోని నాయిక అలమేలుమంగ. నాయిక ఆదినట్లూహిస్తూ మధురభక్తి పురస్సరంగా చేశాడీ కవి. ఎంత చక్కటి రచనా సహృదయ హృదయైక వేద్యం.

**అలంకారాలు :**

ఆలంకారిక శైలీ విన్యాసం ప్రబంధాలలో తప్పనిసరిగా ఉండవలసిన లక్షణం గదా! అన్నమాచార్యులు తన పదాల్లో శబ్దార్థాలంకారాలు అనేకం ప్రయోగించి పదకవితా కామనీయ కాన్నెంతగానో తీసుకొని వచ్చి మనోహరం చేశాడు.

ఇతః పూర్వం ఉదాహరించిన పదాల్లో ఈ లక్షణాలను చూడవచ్చు. అర్థాలంకారాలకొకటి రెండు ఉదాహరణలు :

**ఉపమ :**

"వాడే వాడే అల్లరివాడదివో
నాడు నాడు యమునా నదిలోన ॥పల్లవి॥

కాంతలు వలయపు కంకణ రవముల
నంతంత గోలాట మాడగను

చెంతల నడుమను శ్రీ రమణుండమరె
సంతతపుఁ జుక్కలలో చంద్రునివలెను ॥వాడే॥

(శృం. సం. 25-342)

రూపకం :

"నీవే యెరుగుదువు నా నెయ్యము వో రమణి
భావము లోపల నుండి భ్రమయించ నేటికి ॥పల్లవి

చూపుటమ్ము బొమ్మ వింటఁజొక్కై నిలిచెఁ గాన
చేపట్టి మర్మ వేదనఁ జేయుఁగాక
కోపుల మంచితనపుఁగుచమండలము నేఁడు
యేపునఁబ్రాణాల తోడ యేలాట మెట్లాడెనే ॥నీవే॥

తొడగి మబ్బు గవిసి దొడ్డ కుటిలపుఁగొప్పు
కడుఁగామంధకారముఁగప్పుఁ గాక
నడుమ మోముఁ జంద్రుడు నవ్వు వెన్నెలగాయుచు
చిడుముడి నా మదినిఁ జీఁకటుల సేసీనే ॥నీవే॥

(శృం. సం. 25-44)

ఉత్ప్రేక్ష :

అల్లదె జవ్వని హరియురమున నదె
మెల్లనె యిటు వుపమించరే మీరు ॥పల్లవి॥

ముత్తెపుఁ జిప్పలో ముంచిన కలువలో
వొత్తిలి కనుఁగవ లొక మాటాడరే
గుత్తపుఁ గుండలో కొండలో కుచములో
హత్తి యేర్పడగ ననరే మీరు ॥అల్లదె॥

ఇలాగే తదితరాలంకారాలకు ఉదాహరణలు అన్నమాచార్య సంకీర్తనల్లో అనేక మున్నాయి.

ఈ పరిశీలన వల్ల అన్నమాచార్యులు కేవలం వాగ్గేయకారుడై యుండీ గూడా, ఉత్తమ కవిగా-పదకవిగా ప్రసిద్ధికెక్కినట్లు మనం గమనించాము. అతని భావుకత, ఊహాశాలిత; తన్మూలాన ప్రతిభా సంపద, శ్లేష చమత్కార వ్యంగ్య వైభవాలు, వర్ణనా వైదగ్ధ్యం, ఆలంకారిక శైలీ విన్యాసము, అపురూప భావ ప్రయోగాల మూలంగా కవితా మూర్ధన్యుడైనట్లు మనం తెలుసుకొన్నాము. కనుకనే అన్నమాచార్యులకు పదకవితా పితామహుడనే బిరుదం సర్వవిధాలా సార్థకమైందనీ, అతని పదకవిత కమనీయమేగాక రమణీయమూనని విదితమైంది.

# అన్నమయ్య-క్షేత్రయ్య

అన్నమయ్య, క్షేత్రయ్య తెలుగులో ప్రముఖ వాగ్గేయకారులు. పదసాహిత్యానికి ప్రారంభకుడు అన్నమాచార్యులు. పదసాహిత్య పరిపుష్టిని సాధించినవాడు క్షేత్రయ్య. వీరిద్దరిలో పోలికలుండడం సహజమే.

అన్నమాచార్యులు కడప మండలం తాళ్ళపాకలో జన్మించినా, తిరుమలలోనే శ్రీ వేంకటేశ్వరుని సేవకై జీవితమంతా కైంకర్యం చేసిన మహావాగ్గేయకారుడు. 1408లో జన్మించి 1503లో దివ్యధామం చేరిన అన్నమాచార్యుడు 32 వేల పదాలు శ్రీ వేంకటేశ్వరునిపై రచించి ఆడిపాడిన మహనీయుడు; మహాభక్తుడు. ఇప్పటికి సుమారు 15 వేల పదాలు లభిస్తున్నాయి. ఆయనకు సంకీర్తనాచార్యుడనీ, పదకవితా పితామహుడనీ బిరుదులున్నాయి. భక్తి, మధురభక్తి సంపన్నుడీ సంకీర్తనాచార్యుడు. శృంగార, అధ్యాత్మ సంకీర్తనలనే రెండు రకాల పదాలను రచించి అలమేలుమంగా శ్రీ వేంకటేశ్వరుల అలౌకిక శృంగారాన్ని, ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రకటించిన మహాభక్తుడు. ఆనాటి సమాజంలోని అసంగతాలను, కుళ్ళును దుయ్యబట్టిన ప్రబోధకుడు. సమాజ కవి అంటే తప్పులేదు. ఇతని భార్య, పుత్ర పౌత్రులు, పదకవితలో ప్రతిభా సంపన్నులు. అన్నమాచార్యుడు పదకవితకు ఆద్యుడు.

ఇలాగే క్షేత్రయ్య అన్నమాచార్యుల తరువాత సుమారు ఒక శతాబ్ది అనంతరం ఉద్భవించిన మహా వాగ్గేయకారుడు. పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య పూర్వ

నామం వరదయ్య. ఇతడు దక్షిణదేశంలో క్షేత్రజ్ఞుడనే పేరుతోనే ప్రసిద్ధుడు. క్షేత్రయ్య నివాసం కృష్ణా జిల్లా దివిసీమలోని మొవ్వ. ఆ మొవ్వలో వెలసిన మువ్వగోపాలస్వామిపై భక్తి, మధురభక్తితో శృంగార రసభావాలతో కొన్నివేల పదాలు రచించాడు క్షేత్రయ్య. ఇప్పుడు మూడుపందల పైచిలుకు పదాలు లభ్యం. 'మువ్వగోపాల మకుటంతో రచించినవే క్షేత్రయ్య పదాలు. ఆయన జీవితకాలం 1590-1675 మధ్య అని నిర్ణయించబడింది. పదాభినయం క్షేత్రయ్య పదాలతోనే ప్రారంభమైంది. సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యమివ్వడమేగాక, పదాలకు అభినయం జోడించిన ఘనత క్షేత్రయ్యది. ఈ పద్ధతి సమకాలికుడైన సిద్ధేంద్ర యోగి కూచిపూడి నృత్యంలో పరిపుష్టి చెందింది. ఈ పదరచనతో సంగీత సాహిత్యాభినయాలకు అనన్య సామాన్యమైన సేవచేసిన ఘనుడు క్షేత్రయ్య.

ఈ మహనీయుల ఇద్దరిలోను అత్యంత నికటమూ, సన్నిహితమూ అయిన సామ్యాలు అనేకం గోచరిస్తాయి. భావంలో, భావనలో, భావవ్యక్తీకరణలో, పదరచనా శిల్పంలో, వర్ణనలో, అలంకారంలో, భక్తి, మధురభక్తి, రక్తి అనే అంశాల్లో అత్యంత సన్నిహిత సామ్యాలు మనం గుర్తించగలం.

అన్నమాచార్యులు సంకీర్తన రచనచేసి సంకీర్తనాచార్యుడనీ, పదకవితా పితామహుడనీ ప్రసిద్ధికెక్కినవాడు. క్షేత్రయ్య పదరచయిత; పదమంటే క్షేత్రయ్య పదమనీ, పదమంటే శృంగారపదమనీ పదానికి విశిష్టతను సంపాదించి పెట్టిన గౌరవం క్షేత్రయ్యది. అన్నమాచార్యుడు రాజధిక్కారం చేసిన భగవద్భక్తుడు. క్షేత్రయ్య ప్రారంభంలో రాజాశ్రయాన్ని పొందినా, సన్మానాలు అందుకొన్నా ఆ వెనుక భగవంతుణ్ణే శరణుజొచ్చి పదరచన చేసిన మధురభక్తి పరాయణుడైన వాడు. అన్నమాచార్యులు శృంగారాధ్యాత్మ సంకీర్తనలు రచించగా, క్షేత్రయ్య కేవలం శృంగార పదాలు మాత్రమే రచించినవాడు. అన్నమాచార్యులతో ప్రారంభమైన పదరచన క్షేత్రయ్యలో పరిపూర్ణత్వం పొందింది. అన్నమాచార్యుడు భక్తి పురస్సరంగా పదాలు రచించి ఆడిపాడుకొనేవాడు. క్షేత్రయ్య వీటికి అభినయం జోడించిన అభినయ శాస్త్రవేత్త. అన్నమాచార్యుల కాలం నాటికి అభినయం లేదని కాదు. కాని పదాభినయం పట్టే తీరుని, దాన్ని ప్రచారంలోకి తేవడానికి క్షేత్రయ్య

కారకుడు. పదకవితా పితామహుడు అన్నమాచార్యుడైతే పదకవితా జనకుడు క్షేత్రయ్య. అన్నమాచార్యుని ఆరాధ్యదేవుడు శ్రీ వేంకటేశ్వరుడు; క్షేత్రయ్యకు మువ్వగోపాలుడు అధిదైవతం. అన్నమాచార్యుడు పెద్ద సంసారి. సన్యాసి కాదు. మూడు తరాలుగా వారిది కవితాకుటుంబం. క్షేత్రయ్య సాంసారిక జీవితం విస్పష్ట రేఖలతో తెలియరాలేదు; మొదట కామి; ఆ వెనుక మోక్షగామి.

ఇలాంటి వాగ్గేయకారులలో నికటమైన సామ్యాలని ఉదాహరణ పూర్వకంగా పరిశీలిద్దాము.

క్షేత్రయ్య, మనోజ్ఞ పదరచనలో మహాశిల్పి; అక్షరశిల్పి. చిత్రకారుడికీ, శిల్పికి సాధ్యంకాని రీతిలో అక్షర శిల్పి అయిన క్షేత్రయ్య రచించి అమరుడయ్యాడు. నాయకుని రత్యనంతర వేషాన్ని తిలకించిన నాయిక, అయిన అన్యకాంతా సంభోగ చిహ్నాలను గాంచి తన సరసకు జేరకుమని తోసిపుచ్చుతూంది.

"చాలు చాలు ఈ చిన్నెలతో నాదు సరసకు జేరకుర ॥పల్లవి॥

చాలు ఈ చిన్నెలు సాగవు నావద్ద మువ్వగో
పాల! భామవద్దికేపోర ॥అనుపల్లవి॥

కన్నుల వీడెముతో కాటుక మోవితో
పెన్నున కీల్జడ వేటుతోను
కన్నియ సంపుల గాజుల నొక్కులతోను
వన్నెకాడ నుదుటను నున్నలత్తుకతోను ॥చాలు॥

నిద్దుర మబ్బుతోను నిండుబడలికతోను
ముద్దియ కలసిన ముదముతోను
నిద్దంపు చెక్కుల నెలవంకలతోను
వద్దు రావద్దులు వగకాడ నాతోను ॥చాలు॥

అలదాని కుచముల నలదిన జవ్వాజి
కల యురస్థలమును గంటి నన్నంట రాకు

బలిమి చేసేదేల బాలముద్దుగోపాల
అల నాడె గూడిన చెలిమి పదివేలు ॥చాలు॥

— ఈ క్షేత్రయ్య పదానికి అన్ని విధాలా మూలమేమో అనదగ్గ అన్నమాచార్యుల సంకీర్తన ఉండడం విశేషం.

"ఎవ్వరు నెరుగరంటా యేల బొంకేరు
నవ్వేరు మిము జూచి నలినాక్షులెల్లను ॥పల్లవి॥

చెలియ నుదుటిమీది చిన్నారి కస్తూరి బొట్టు
చెలువు మీరగ నీ చెక్కులనంటె
నిలువు నామము నీది నెలత నుదుట నంటె
తలకొన్న గుఱుతులు తారుమారు లాయను ॥ఎవ్వరు॥

కాంత కన్నుల బెట్టిన కాటుకెల్లా నీ మోవి
వింతబాగుపై నేడు వెలశున్నది
రంతుల నీ బాహుపురి రమణి సందిట జిక్కె
యంతలోనే మీ చేత లివ్వలవ్వలాయను ॥ఎవ్వరు

సరి నలమేల్మంగ చరణముల లత్తుక
సొరిది నీవురమున చూపట్టెను
గరిమ శ్రీ వేంకటేశ కౌస్తుభ మింతికి నొప్పె
దొరసి మీపలపులు తోడు నేడలాయను ॥ఎవ్వరు॥ (24-477)

అన్నమాచార్య పద మెదుటబెట్టుకొని క్షేత్రయ్య పదరచన చేశాడా అన్నంత సన్నిహితంగా ఉంది రచన. భావం, భావన, ప్రతిభ, ప్రయోగం అన్ని విధాలా కుదిరి సమాన స్థాయినందుకొని ఆ మహా వాగ్గేయకారుకొకదేనా అన్నట్లుండడం మనకాశ్చర్యం కలిగించే అంశం. అన్నమయ్యకంటే క్షేత్రయ్య ఒక అడుగు ముందుకు వెళ్ళాడు. కారణం అన్నమయ్యకో వాచ్యం పాలెక్కువ. క్షేత్రయ్యలో వ్యంగ్యం, ధ్వనీ ఉన్నాయి. అయితే అన్నమయ్య మూడు చరణాల్లో విషయ వివరణ చేస్తూ చెప్పే తీరులో సమత సాధించిన మహాకవి. భాషలో బరువుంది.

అన్నమయ్య పదంలో. క్షేత్రయ్యలో లాలిత్యముంది: సారళ్యముంది. అన్నమాచార్యుల పదం క్షేత్రయ్య చూసి ఉండే ఉండవచ్చు. కాని చూడకపోయినా ఇలాంటి పదరచన చేయగల సమర్థుడు క్షేత్రయ్య. అందుచే ప్రతిభా సంపన్నులైన మహాకవుల ఆలోచనల్లో సామ్యముంటుంది (Great men think alike) అనడమే సముచితమని నా భావన. పైపెచ్చు క్షేత్రయ్య పద విశిష్టత సైతం స్పష్టమే.

ఇలాంటిదే అన్నమాచార్యుల మరో పదం. పై పదంలో లాగా దీనిలో వ్యంగ్య స్ఫూర్తికంటే స్పష్టతే అధికం-

"మగరూపు నాడ రూపు మారుచుకొని రిద్దరు
సొగిసెద్దము చూపచే చూచుకొనే రిద్దరు దామే ॥పల్లవి॥

కలికి కస్తూరి బొట్టు కాంతుని నొసలనంటె
నిలువు నామము పై పై నెలత కంటె
అలివేణి కొప్పు జారి అతని కొప్పుపై వ్రాలె
అలరె నీతన్విసిక ఆతని పాపటపైని ॥మగ॥

కుంకుమ గుబ్బల పూత గురుకు విభునికంటె
అంకె బతి రొమ్ము బొచ్చు ఆకె కంటెను
కంకణాల గాజుల చేయి ఘనుని సందిట జిక్కె-
అంకపు సాముల చేయి ఆకె సందిట జిక్కెను ॥మగ॥

మట్టెల పాదములపె మగిడె నాతనిమీద
నిట్ట పెద్ద పాదాలు నిలిచె నందు
యిట్టె శ్రీ వేంకటేశు డింతి గూడి పానుపుపై
వట్ట పగలింపరిని భ్రమయించి రిదివో ॥మగ॥" (26-309)

ఇలాంటి భావాలు గల క్షేత్రయ్య అన్నమయ్యల పదాలు-

**క్షేత్రయ్య :**

"చల్ల నాయె నామనసు చల్లనాయె నా ॥పల్లవి॥
చల్ల నాయె ప్రాణేశ! స్వామి ! మువ్వగోపాలా ॥అ.ప॥

**అన్నమాచార్యులు :**

"అన పెట్టుదువు నీవప్పటి నా నోరణచి వోరి
నీ నిజానకు నాతో నేడైనా మానరా" (15-222)

కుపిత అయిన నాయిక చెలులతో నాయకుని గూర్చి చెప్పడం ఇద్దరు వాగ్గేయ కారుల్లోను గలదు.

**క్షేత్రయ్య :**

"అడుగరమ్మా! యతనిపై సూరక అలిగి నానటరే ॥ప॥
పడుచు తనము మాని మువ్వగోపాలరాయుని అనబెట్టి మీ ॥రడుగ॥

**అన్నమాచార్యులు :**

"ఏది నిజమని మీరు యెట్టు బరచేరే
ఆదినుండి యీ కవితలు అడుగరే యాతని" (26-430)

చెరగు మాసిందని సంకోచించ వద్దని క్షేత్రయ్య నాయిక నాయకుని వేడు కొంటూండగా, చెరగు మాసినదనీ, పరసాటు పనికి రావనీ నాయకుని మొరబెట్టు కొంటూంది అన్నమాచార్యుల నాయిక.

**క్షేత్రయ్య :**

"చెరగుమాసి యున్నానని యోచనసేయ వద్దురసామి ॥పల్లవి॥
వొర యీ నా మువ్వగోపాల పరసతులకు దోసమెన్నడు లేదురా
॥అ.ప॥

సరసకు రమ్మని చాలా నే వేడితే శంకపడే వేలరా
అరసికుల తప్పు శాస్త్రము నిజమనుచు నమ్మవద్దురా
దురుసుగ నే నీ వద్దికి వచ్చితే దూర మరిగే వేమిరా
వలపుమీర ఆవారనుండి నన్నంటక వకముద్దైన నియ్యరా నా సామి
॥చెరగు॥

**అన్నమాచార్యులు :**

"చేయిముట్టి సరసాలు చెల్లవు నేడు
ఆయనాయనిక నేల ఆటువంటి పనులు ॥పల్లవి॥

చేరి నన్ను నంటకురా చెరగుమాసిన దాన
ఆరపి మాట చెప్పరా అల్లంత నుండి
కోరి నీ వేమన్న మాకును నవ్వురాదురా
ఔరా నీవేమి సేయుమన్నా జేసేసు ॥చేయి॥ (26-9)

నాయకుని చక్కదనాన్ని మెచ్చుకొనే తీరులో వాగ్గేయకారులిద్దరూ మనోజ్ఞంగా వర్ణించారు :

**క్షేత్రయ్య :**

"ఎంత చక్కనివాడే నాసామి వీడెంత చక్కనివాడే॥"
"చేతికాసులేదే! కాని చే సైగలే॥"

**అన్నమాచార్యులు :**

"వలచి వచ్చితి నేను వానికిగాను" (24-14)

మార్మికత ఈ వాగ్గేయకారులిద్దరిలోను చూడగలము :

**క్షేత్రయ్య :**

"లలనామణిరో! యీ భావము దెలుపరే లలితముగా నిపుడు"

**అన్నమాచార్యులు :**

"చెప్పితే నా రచికత చెప్పకుండితే వెత" (25-421)

రత్యనంతర నాయికావర్ణన ఇద్దరు వాగ్గేయకారులు మనోహరంగా చేశారు. అయితే క్షేత్రయ్య నాయిక కేళికా మందిరం వెడలినట్లు వర్ణిస్తే, అన్నమాచార్యులు నాయిక పవళించినట్లు చిత్రించాడు. అన్నమాచార్యుల పదమే క్షేత్రయ్యకు మూలమా అన్నట్లుంది :

క్షేత్రయ్య :

"మగువ తన కేళికామందిరము వెడలెన్ ॥పల్లవి॥
వగకాడ నా కంచి వరద తెల్లవారెననుచు ॥అ.ప॥

విడజారు గొజ్జంగి విరిదండ జడతోను
కడు చిక్కువడి పెనగు కంఠ సరితోను
నిడుద కన్నుల దేరు నిదుర మబ్బుతోను
తొడరి పద యుగమున తడబడెడు నడతోను ॥మగువ॥

సొగసి సొగయని వలపు సొంపు జూపులతోను
వగవగల ఘనసార వాసనలతోను
జిగిమించు కెమ్మోవి చిగురు కెంపులతోను
సగము కుచముల విదియ చందురులతోను ॥మగువ॥

తరితీపు సేయు సమ సురత బడలికతోను
జరుత పావడ చెరగు జార్పైట తోను
ఇరుగడల క్రొందండలిచ్చు తరుణులతోడు
పరమాత్మ మువ్వగోపాల తెల్లవారెననుచు" ॥మగువ॥

అన్నమాచార్యులు :

"పలుకు దేనెల తల్లి పవళించెను
కలికి తనముల విభుని గలిసినదిగాన ॥పల్లవి॥

నిగ నిగని మోముపై నెరులు గెలకుల జెదర
పగలైన దాక జెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారిన దాక
జగదేకపతి మనసు జట్టి గొనెగాన ॥పలుకు॥

కొంగుజారిన మెరుగు గుబ్బలొలయగ దరుణి
బంగారు మేడపై బవళించెను
చెంగలువ కనుగొనల సింగారములు వొలక
అంగజ గురునితోడ నలసినది గాన ॥పలుకు॥
మురిపెంపు నటనతో ముత్యాల మలుగుపై
పరవశంబున దరుణి పవళించెను
తిరువేంకటాచలాధిపుని కౌగిట గలసి
అరవిరై నును జెమట నంటినది గాన ॥పలుకు॥ (4-74)

ఇంతకంటే క్షేత్రయ్య పదానికి చక్కటి మూలమేమో అనదగ్గ సురతానంద పరవశ అయిన నాయికా వర్ణన అన్నమాచార్యుల మరో పదంలో గమనించ గలము :

"ఎవ్వరికి గలదమ్మ యింత భాగ్యము
ఇవ్వల నీతో సరిమెంచరాదే వొరుల ॥పల్లవి॥
నీడిన తురుముతోడ విరులు పైపైరాల
వాడిన కన్నుల తోడ వచ్చేవేమే
యేడనుంటి విందాకా యెవ్వడు నిన్ను భోగించె
చేరె నీ సొబగులిదే చెప్పరాదె నేడు ॥ఎవ్వ॥ (13-42)

అరమరికలేని అత్యంతానురాగం నాయకునిపై నాయికకున్నట్లు ఇద్దరు వాగ్గేయకారులు వర్ణించారు.

**క్షేత్రయ్య :**

"ఇంత తెలిసియుండి యీ గుణమేలరా ॥పల్లవి॥
పంతమా మువ్వగోపాల నా సామి! ॥అ.ప॥

**అన్నమాచార్యులు :**

"కట కటా అయ్యోకాంతనింత యేమదురా
ఆటమటగాదు నీయానసుమ్మీ నిజమయ్యా ॥పల్లవి॥

పరిపూర్ణానందానుభూతిని పొందలేని అనురాగం పనికి రాదంటారు ఇద్దరూను ;

క్షేత్రయ్య :

"మానినిరో చేర రమ్మని పిలువని మాలిమేటి మాలిమే ॥పల్లవి॥
పూనిదాని ప్రాయ మనుభవింపగలేని
పురుషుడేటి పురుషుడే ఓ చెలియా ॥అ.ప॥

అన్నమాచార్యులు :

"ఏటి పొందు యేటి గుణము యేటి సవరందనము మనసు
నాటు కొలపంజేయలేని నటన లేటికే ॥పల్లవి॥

నాయకుడు నాయిక చిత్రాన్ని చిత్రించబోయి భ్రమతో మైమరచి పోయే మనోజ్ఞమైన నిర్మలానురాగాన్ని పదాలలో చిత్రించిన చిత్రకారు లీ వాగ్గేయకారులు :

క్షేత్రయ్య :

"ఏమి చేయుదు మోహ మెటు వలె దీరును ॥పల్లవి॥
భామినీ మణిని యెవ్వరు తోడి తెచ్చేరు ॥అ.ప॥

చెలది నీదు ముఖార విందంబు లిఖియించి
అలరు వాసనలు వ్రాయగ నేరనైతి
కళలొల్కు నీ మోవి గదసి వ్రాసితిగాని
నెలత తేనియ లుంచనేరనైతి ॥ఏమి॥

కలికి సొగసైన కనులు వ్రాసితిగాని
బెళకు చూపులు వ్రాయు విత మెరుగనైతి
గళము రేకులు తెలియగాను వ్రాసితిగాని
చెలగు కోకిల వంటి పలుకు వ్రాయగనైతి ॥ఏమి॥

అన్నమాచార్యులు :

"ఒకటి కొపటి యాసనుండ జెలి భావమిది
మొక మెదుటనె నన్ను మోవవ్రాసెనే ॥పల్లవి॥

క్షేత్రయ్య :

"మానినిరో చేర రమ్మని పిలుపని మాలిమేటి మాలిమే ॥పల్లవి॥
పూనిదాని ప్రాయ మనుభవింపగలేని
పురుషుడేటి పురుషుడే ఓ చెలియా ॥అ.ప॥

అన్నమాచార్యులు :

"ఏటి పొందు యేటి గుణము యేటి సవరందనము మనసు
నాటు కొలపంజేయలేని నటన లేటికే ॥పల్లవి॥

నాయకుడు నాయిక చిత్రాన్ని చిత్రించబోయి భ్రమతో మైమరచి పోయే మనోజ్ఞమైన నిర్మలానురాగాన్ని పదాలలో చిత్రించిన చిత్రకారు లీ వాగ్గేయకారులు :

క్షేత్రయ్య :

"ఏమి చేయుదు మోహ మెటు వలె దీరును ॥పల్లవి॥
భామినీ మణిని యెవ్వరు తోడి తెచ్చేరు ॥అ.ప॥

వెలది నీదు ముఖార విందంబు లిఖియించి
అలరు వాసనలు వ్రాయగ నేరనైతి
కళలొల్కు నీ మోవి గదసి వ్రాసితిగాని
నెలత తేనియ లుంచనేరనైతి ॥ఏమి॥

కలికి సొగసైన కనులు వ్రాసితిగాని
బెళుకు చూపులు వ్రాయు విత మెరుగనైతి
గళము రేకులు తెలియగాను వ్రాసితిగాని
చెలగు కోకిల వంటి పలుకు వ్రాయగనైతి ॥ఏమి॥

అన్నమాచార్యులు :

"ఒకటి కొపటి యూసనుండ జెలి భావమిది
మొక మెదుటనె నన్ను మోవ వ్రాసెనే ॥పల్లవి॥

అంతకంటే అభినయంలో సాటిలేనిమేటి క్షేత్రయ్య అంటేను వాస్తవమే. అన్నమాచార్యులలో లేని ఎన్నో అపురూప రాగాల్ని క్షేత్రయ్య వాడుకచేసి సంగీతానికి పుష్టిని తుష్టినీ చేకూర్చాడు. అన్నమాచార్యుల సంకీర్తనల్లో అణగిమణగి తారుడుతూ అలరిస్తూ వచ్చిన అభినయం క్షేత్రయ్యలో ప్రముఖస్థానమాక్రమించింది. క్షేత్రయ్య పదాలంటే శృంగార పదాలనీ, పదాభియ పదాలనీ పేరెన్నికగొనేట్టు చేసిన అభినయాచార్యుడు క్షేత్రయ్య.

ఇలాగా అన్నమాచార్య క్షేత్రయ్యలలోని సామ్యాలు, సాధర్మ్యాలు, — అన్ని రీతుల విదితమవుతున్నాయి.

## గురజాడ గురిజాడ

దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయి
స్వంతలాభం కొంతమానుకు
పొరుగు వాడికి తోడుపడవోయీ
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్ (దేశభక్తి)

గురజాడ వేంకట అప్పారావు గారు ఆధునిక యుగంలో నవకవులకు మార్గదర్శకులు; మహాకవి. ఆయన వేసిన నవకవిత్వపు బాటలే సమకాలిక, తదనంతర నవకవులకు రాచమార్గాలయ్యాయి. అందుకే ఆయన అడుగు జాడలు తక్కిన వారికి గురిజాడ లయ్యాయి.

గురజాడ విజయనగర సంస్థానంలో ఉద్యోగం చేయవచ్చుగాక; ఆనంద గజపతిని, రేవారాణిని, జార్జిచక్రవర్తిని స్తుతించి ఉండవచ్చుగాక కాని వారి హృదయం ప్రజలకోసమే, ప్రజలసముద్ధరణకోసమే పరితపించిందని చెప్పవచ్చు.

"నాది ప్రజల ఉద్యమం. దానిని ఎవరిని సంతోషపెట్టానికైనా వదులుకోలేను.... నా ఆశయం ప్రజల ఆశయం. సంస్కారవంతుల సదభిప్రాయం నాకు అండగా ఉంది." అని గురజాడ వారు ముక్తకంఠంగా చెప్పిన మాటలందుకు చక్కటి ఉదాహరణలు.

అందరికీ అందుబాటులో ఉండాలన్న మహోదాశయంతో గురజాడ సులభ శైలిలో సరళమైన వ్యావహారిక భాషను ప్రయోగించి రచనలు చేసిన తీరును గమనిస్తే ఆయన హృదయం స్పష్టమవుతుంది.

"కన్నుకానని వస్తుతత్త్వము
కాంచనేర్చరు ఆంగ్లరీజులు
కల్లనొల్లరు వారివిద్యల
కరచి సత్యము నరసితిన్" (ముత్యాలసరాలు)

—అనే కవిత నుదాహరించి గురజాడ ఆంగ్లేయుల్ని మెచ్చుకొన్నారన్న అభిప్రాయంతో వారిని ఈసడించే వారున్నారీనాడు. కానీ మూడు నాలుగు పాదాల్లోని విషయాన్ని గమనిస్తే గురజాడ వారి హృదయ కుహరంలో నిగూఢంగా నిక్షిప్తమైన సత్యం స్పష్టం కాక మానదు. మొదటి రెండు పాదాల్లోనూ ఇంగ్లీషు వాళ్లని మెచ్చుకొన్నా, కంటికి కనిపించని వస్తుతత్త్వాన్ని గ్రహించగలిగిన వారని చెప్పారు. ఆ వెనుక రెండు పాదాల్లోనూ గల కల్లనొల్లరు; వారి విద్యల, కరచి సత్యము నరసితిన్' అని చెప్పడంవల్ల ఆంగ్లేయులు అసత్యమూరగులనీ, అంటే సత్యనిష్ఠాపరులని చెప్పి అలాంటి వాళ్ల విద్యల్ని నేర్చుకొని సత్యమేమిటో గ్రహించగలిగానని గురజాడ స్పష్టం చేస్తున్నారు. వారి విజ్ఞత కది నిదర్శనం.

గురజాడవారు కొత్తపాతల మేలుకలయిక. సంస్కృతాంధ్ర సాహిత్యాలతో పాటు ఆంగ్ల సాహిత్యం చదువుకోవడంవల్ల వీటిని నిగ్గుదేల్చి.

"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల
కొత్తపాతల మేలు కలయిక
క్రొమ్మెఱుంగులు జిమ్మగా"—అని రచించిన కహాకవిగా సాక్షాత్కరిస్తారు.

"ఆకులందున అణగిమణగి
కవిత కోకిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమందభి

మానములు మొలకెత్తవలెనోయ్"— అని ఎంతో సున్నితంగా విశిష్టంగా కవితామాధుర్యంలో దేశాభిమానం రంగరించారు. వారి కవితామరంద మాధుర్యానికి ఒకటి రెండుదాహరణలు.

'ధూమకేతువు కేతువనియో
మోము చందురుడలిగి చూడడు
కేతువాయది ? వేల్పు లలనల
కేలివెలితొగ కాంచుమా!' (ముత్యాలసరాలు)

'తొగల కాంతులు కనులుపరపగ
మించుతళుకులు నగలు నెరపగ
నడకలంచకు నడలుకరపగ
కన్నె పరతెంచెన్, రాజవీధిని' (కన్యక)

'పాటపాడెను చెట్లుచేమలు
కోటి చెవులను గ్రోలియలరగ
తాటి వనమున నాగి, చంద్రుడు
తాను చెవియొగ్గెన్'
కరము బట్టి యురంబు యురమున
జేర్చి ముద్దిడి కురులు దువ్వితి
తాళవనమును వెడల చంద్రుడు
పక్కనను నవ్వెన్" (లవణరాజుకల)

'కన్నులకాంతులు కలవలచేరెను
మేలిమిజేరెను మేనిపసల్
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ' (పూర్ణమ్మ)

—వీటన్నిటా కమనీయమైన కవితను గ్రహిస్తే రసానందకందమై ప్రాచీన కవుల ఉపమా సామగ్రిని, కవిసమయాలను స్వీకరిస్తూనే నవ్యమైన రీతిలో మనోహరంగా కవిత చెప్పిన తీరును గమనించగలుగుతాము. అదే గురజాడలోని కొత్తపాతల మేలుకలయికతో కూడిన కవితా మాధుర్యం. పైపెచ్చు ఇందలిభాష సరళమూ, లలితమూను; తేటైన తెలుగు మాటలు.

గురజాడవారి కవితలోని ప్రత్యేకతని మనం గమనించవలసి ఉంది. వారి కవిత కొత్తపాతల మేలుకలయికేగాదు. భావ, అభ్యుదయ కవితారీతుల కలయిక.

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్త వలెనోయి
నరుల చమటను తడిసిమూలం
ధనం పంటలు పండవలెనోయి (దేశభక్తి)

—ఇందులో మొదటి రెండు పాదాలు భావకవితకు నిదర్శనం. తక్కిన చివరి రెండు పంక్తులు అభ్యుదయ కవితా పతాకకి ప్రతీక. సందేహం లేదు. ఇంతేగాదు "దేశమనియెడి దొడ్డవృక్షం ప్రేమలను పూలెత్తవలెనోయి" అన్నట్లే వారి కవితాలత రెండుగా కొనలుసాగింది. ఆ కొనల ననలు పూవులై పరిమళించాయి. ఆపరిమళాలు ఈనాటికి గుబాళిస్తూనే ఉన్నాయి. ఆపూవులలో ఒకటి భావప్రారంభమై పువ్వుపుట్టగానే పరిమళించునన్నట్లు కవిత్వపు ఘుమఘుమలు వెదజల్లింది. రెండోదైన అభ్యుదయ కవిత - కొంచెం ఆలస్యమైనా-తదనంతర కాలంలో సత్ఫలితాల నిచ్చింది. మొదటిది ఆనందనిష్యంది. రెండోది అణగారిన జనసముదాయపు సముద్ధరణకై ఉద్దేశించబడింది.

గురజాడ భావకవితా ఖండికలు-ముత్యాల సరాలు, లవణరాజు కల, దేశభక్తి, కాసులు, ఊటిచోద్యమేమిచెపుదు- మొదలైనవి.

గ్రామీణ జీవితంలో పల్లె పట్టులలోని వాతావరణ వర్ణన భావకవితలో ఒక భాగం. అలాంటి రచనని గమనిస్తే ఈ విషయం విదితమౌతుంది.

"తూర్పు బలబల తెల్లవారెను
తోక చుక్కయు వేగుచుక్కయు
ఒడయుడౌ వేవెల్గు కొలువుకు
వెడల మెరపిది మిన్నువీధిని
"వెలుగు నీటను గ్రుంకె చుక్కలు
చదల చీకటి కదలబారెను
ఎక్కడనొ వొకచెట్టుమాటున
నొక్కకోకిల పలుక సాగెను
మేలుకొలుపులు కోడికూసెను
విరులు కన్నులు విచ్చిచూసెను
ఉండి, ఉడిగియు, ఆకులాడగ
కొసరెనోయన గాలి వీచెను (ముత్యాల సరాలు)
"వెలుగు సోడలు కనులకింపై
మెలగి చెలగెడు నాకసంబున
చల్లగాలులు సాగి యలులుగ
జల్లు జల్లున రాల్చె పూవులు (లవణ రాజుకల)

—ఇలాగే దేశభక్తి భావకవితలో భాగమేకదా !

'దేశమును ప్రేమించుమని' ఇంతగా దేశభక్తి ప్రబోధం చేసిన ప్రథమ కవి గురజాడే కదా !

ప్రేయసీ ప్రియుల, భార్యాభర్తల ప్రేమ, దాంపత్య జీవితం శారీరకమైన దానికంటె పరమమైందని "మాయమర్మము లేని నేస్తము మగువలకు మగవారికి కొక్కటి రాజమార్గమని' 'మగడువేల్పన పాతమాటది' ప్రాణమిత్రుడు" ననీ ఉపదేశం చేసిన ప్రేమానురాగాల దాంపత్య జీవితాలకు నూతన వ్యాఖ్యానం ప్రకటించిన మహాకవి గురజాడ.

'మరులు ప్రేమని మదిదలంచకు
మరులు మరలును వయసుతోడనె
మాయమర్మము లేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె"

బ్రతుకు సుకముకు రాజమార్గము
ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును
ప్రేమనిలిపిన ప్రేమనిలుచును
ఇంతియె

కాసువీసము నివ్వనొల్లక
కవిత పన్నితిన నితలంపకు
కాసులవె; నీకంఠసీమను
జేరి బంగరు వన్నెగాంచుత
మగడు వేల్పన పాతమాటది,
ప్రాణమిత్రుడు నీకు, సినెనరు
కలుగక యున్న ఖేదను; కలిగినను
నాపదవి వేల్పులరేని కెక్కడ" (కాసులు)

—దీన్నే గ్రహించి కాకపోయినా, ఈ సూచన ప్రాయమైన నవ్యప్రేమ విధానాన్ని తృణకంకణంలో రాయప్రోలు సుబ్బారావుగారు అతిమనోహరంగా' అమలిన శృంగారతత్వాన్ని ప్రతిపాదించి కావ్యరచన చేయడం మనకందరికీ తెలిసిన అంశమే. రాయప్రోలు భావకవులలో ప్రథమగణ్యుడుగదా ।

ఎందరో భావకవులు ముత్యాల సరం ఛందస్సుపై మోజుపడి అలాగే. ఇంకా ఎంతో బాగా రచన చేశారు. దేశభక్తి గూర్చే రాయప్రోలువారు వర్ణించారు.

"శిశ్రిలు పొంగిన జీవగడ్డయి
పాలుగారిన భాగ్యసీమయి
వ్రాలినది యీ భరతదేశము
భక్తి పాడర తమ్ముడా ! (తమ్ముడా)

— ఇట్లె 'తిలకము' ఖండికలోనూ చూడగలం.

ఇలాగే అబ్బూరిరామకృష్ణారావు గారు, బసవరాజు, దువ్వూరి కవికొండల, విశ్వనాథ (కోకిలమ్మ పెళ్లి), శివశంకరశాస్త్రి, కృష్ణశాస్త్రి ప్రభృతి ప్రసిద్ధ భావకవు లందరూ మహాకవి ననుసరించి ఈ ముత్యాలసరాలను స్వీకరించి రచించారు.

కృష్ణశాస్త్రిగారి ముత్యాల సరాలకు ఒకటి రెండుదాహరణలు.

గుత్తునాయని జాతిముత్యాల్
గుచ్చినాదే మేలిసరముల
ఇత్తునా యని తెలుగుతల్లికి
ఇచ్చినాదే భక్తితో (మహాకవి గురజాడ అప్పారావు)
చేతికందెడు పూల కొరకై
చేయిచాపక చేరికోరిక
దూరమగ లేవంచువానిని
దూరివదలితిని (మకర్కులు)

—ఇలాగా ఉత్తమమైన భావకవితారీతులకు, గురజాడ వారి ప్రేమతత్వమూ ముత్యాలసరాల ఛందస్సూ, సమకాలిక, తదనంతర భావకవుల కెంతగానో ఉపకరించాయి. అందుకే గురజాడ అడుగు జాడలు గురిజాడలయ్యాయి.

గురజాడ మరణానంతరం సుమారు 15 సంవత్సరాల తర్వాత వీరిలో బీజప్రాయమై ఉన్న అభ్యుదయ కవితారీతి ఒక ఉన్నతమైన వటవృక్షంలా పెరిగి పెద్దదైంది. వీరి అభ్యుదయ కవితకు ముత్యాల సరాలు, కన్యక, పూర్ణమ్మ, లవణ రాజుకల, దేశభక్తి, మనిషి మొదలైన కవితా ఖండికలు చక్కటి ఉదాహరణలు.

ముత్యాల సరాల్లో తోకచుక్కను కామబాణంగాను, 'సంఘసంస్కరణ ప్రయాణ పతాకగాను భావించిన వీరి సంస్కరణాభిలాషను గుర్తించవచ్చును. తోకచుక్క అశుభ సూచకమనడం మన మూఢ విశ్వాసానికి నిదర్శనమని నిరూపించారు. అవి పెత్రిపురాణ గాథలని తిరస్కరించారు తోకచుక్కను గూర్చిన కవితలో.

దూర బంధువు యితడు భూమికి
దారిపోవుచు చూడవచ్చెను
డెబ్బదెనుబదేండ్ల కొకతరి
నరుల కన్నుల పండువై
"తెగులు కిరవని కతల పన్నుచు
దిగులు చెందుటదేది కార్యము
తలతు నేనిది సంఘసంస్కర
ణప్రయాణ పతాకగాన్" (ముత్యాల సరాలు)

— ఇలాగే కన్యకలో, పూర్ణమ్మలో మహిళాభ్యున్నతిని కాంక్షించి ఆయాఖండికల్లో తీర్చిదిద్దిన తీరును గమనించి హర్షించక మానము.

—ఇలాగే లవణరాజుకలలో మాలెతతో రాజుకు ప్రణయం కూర్చి కుల మతాలకతీతంగా ఉండాలన్న ప్రబోధం చేసిన మహనీయు డీకవి.

మలిన దేహుల మాలలనుచు
మలిన చిత్తుల కధిక కులములు
నెలవొసంగిన వర్ణ ధర్మమ
ధర్మ ధర్మంబే"

మంచిచెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండెకులములు
మంచి యన్నది మాలమైతే
మాలనే యగుదున్" (లవణరాజుకల)

యెల్ల లోకమునొక్కయిల్లై
వర్ణ భేదము లెల్ల కల్లై
వేలనెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ
మతములన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటి నిలచి వెలుగును" (ముత్యాల సరాలు)

"చెట్ట పట్టాల్ పట్టుకుని దే
శస్థులంతా నడవవలెనోయ్
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్ని మెలగవలెనోయ్ (దేశభక్తి)

—ఇలాగే దేశాభ్యుదయానికి మానవాభ్యుదయానికి వారి సూత్రాలను గమనిస్తే ఎంతగా గురజాడ అభ్యుదయాన్ని కాంక్షించారో తెలుస్తుంది.

పాడిపంటలు పొంగిపొర్లే

................................

యీసురోమని మనుషులుంటే

................................

వెనకచూసిన కార్యమేమోయి ?
మంచిగతమున కొంచెమేనోయి

మందగించక ముందు అడుగేయి
వెనుక బడితే వెనుకేనోయి'
దేశాభిమానం నాకుకద్దని

................................

స్వంతలాభం కొంత మానుకు

................................

దేశమని యెడిదొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి
నరుల చమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయి (దేశభక్తి)

—ఇందంతటా అభ్యుదయమే గదా ?

"మనిషిచేసిన రాయిరప్పల కంటే మనిషే ముఖ్యమనీ 'మనిషి' ఖండికలో వివరించారు. మూఢ విశ్వాసాన్ని ఖండించారు.

భావకవులే కాదు; అభ్యుదయ కవులు సైతం గురజాడవారి ముత్యాలసరాల ఛందస్సును స్వీకరించి కవితలల్లారు. అభ్యుదయ కవులనేత శ్రీశ్రీయే బాటసారిలో

కూటికోసం కూలికోసం
పట్టణంలో బ్రదుకుదామని
తల్లి మాటలు చెవిని బెట్టక
బయలుదేరిన బాటసారికి"

అని అత్యంత మనోహరంగా తీర్చిదిద్దిన సంగతి మనందరికీ తెలిసిందే.

ఇలాగే పురిపండా అప్పలస్వామి రచనను పరికించండి.

నేలదున్నీ మొక్కనాటీ
కంచెవేసీ నీరుపోసీ
తోటవేశాడు అతడు
తోట పెంచాడు
ఆకువేసీ పొదలుగా ప్రాకినవి
మింటికి చెట్లుగా సాగినవి
మొక్కలు

—ఇదేరీతితో కవికొండల వెంకటరావుగారి 'కూలియన్నల కుతుకము' పేర్కొనదగ్గది. పోతే చిరుమార్పుతో 'జయభేరి'లో 'అవతారం'లో, శ్రీశ్రీ ముత్యాలసరాల చందస్సును వాడుకొన్నాడు.

స్వభావోక్తి గురజాడ, శ్రీశ్రీలలో ఎంతమనోజ్ఞంగా ఉందో ఈ కింది వర్ణనలు గమనిస్తే విదితమవుతుంది.

గురజాడ : పండు గెడ్డము ఎండుకన్నుల
నిండ శాంతరసంబు, పలుకుల
కడు గాంభీర్యంబు; మెడలని
దివ్యతేజంబున్ (లవణరాజు కల)

శ్రీశ్రీ : "ముగ్గుబుట్టవంటి తలా
ముడుతలు తీరిన దేహం
కాంతిలేని గాజుకళ్ళు
తనకన్నా శవం నయం (భిక్షువర్షీయసి)

— గురజాడ కవితామార్గంలోనే ఆయన సమకాలికులు, తదనంతర కవులు నడిచి భావ, అభ్యుదయకవితా ధోరణులలో పయనించారు.

అందుకే ఆ మహాకవి అడుగుజాడలు ఎందరో నవకవులకు గురిజాడలయ్యాయన్న పూర్వోక్తమైన మాటను పునరుక్తి చేస్తున్నాను.

# నవ కవిత - నగరజీవన వర్ణన

తెలుగు నవకవిత అంటే తెలుగులో వెలసిన ఆధునిక కవిత. ఇది గురజాడ తోనే ప్రారంభమైంది. 'కొత్త పాతల మేలుకలయిక' అని గురజాడ సెలవిచ్చినా తరువాత ఆధునిక కవిత సంప్రదాయ కవితపై తిరుగుబాటులాంటిది. మన ఈ ఆధునిక కవితకే మనవాళ్లు భావకవిత్వమని పేరుపెట్టారు! ఈ భావకవిత ఆంగ్లం లోని 'రొమాంటిక్ పొయెట్రీ' లేక లిరికల్ పొయెట్రీ'ననుసరించిమన సాహిత్యంలో వెలసిన నవకవిత. వస్తు, భావ, భావ వ్యక్తీకరణలలో నవ్యతను సాధించి, భాషాశైలులలో సారళ్యాన్ని సమకూర్చి భావకవులెంతగానో సముచితరీతిని భావ కవితను సంతరించారు.

ఈ భావ కవితపై 1930 తరువాత తిరుగుబాటు జరిగింది. అభ్యుదయ కవితోద్యమం ప్రారంభమైంది. ఉద్యమ నాయకుడు శ్రీశ్రీ. 'కదిలేదీ కదిలిం చేదీ కావాలోయ్ నవకవనానికి" అని ఢంకా బజాయించి ఉద్యమించాడు. శ్రీరంగం నారాయణబాబు, పట్టాభి, శిష్ట్లా ప్రభృతులు తామూ తమ గొంతులెత్తి అభ్యుదయ కవితనాలపించారు. కుందుర్తి, 'వచన కవితా పితామహుడు', దాశరథి, నారాయణ రెడ్డి, ఆరుద్ర, సోమసుందర్, అనిసెట్టి, పినిసెట్టి, రెంటాల, గంగినేని, రమణారెడ్డి మొదలైన కవులు అభ్యుదయపథంలోనే కవితలల్లి సుసంపన్నం చేశారు. వర్గ సంఘర్షణ, విప్లవ ప్రబోధం, వీరగాథాకథనం, యుద్ధ విముఖత, సమసమాజ నిర్మాణం, మార్క్సిస్టు దృక్పథ ప్రబోధం, తెలంగాణ విముక్తి మొదలైన అంశా లను, జాతీయంగానేగాక అంతర్జాతీయంగా ఉన్నస్థితిగతుల అవగాహనతో అభ్యు దయకవిత ప్రచారం పొందింది.

1955లో దిగంబర కవిత వెలసింది. దీనితోపాటు పైగంబర కవిత, చేతనావర్తం కవిత, తిరగబడు కవిత మొదలైనవి వెలసినా, కొనసాగలేక పోయాయి. దిగంబర కవిత 1970లో రూపుమాసిపోయింది. విప్లవ కవితో ద్యమం ఉప్పెనలావచ్చి వీటినన్నిటిని తుడిచిపెట్టుక పోయింది.

ఈ మధ్యలోనే మినీకవిత ప్రకాశవంతం కాకపోయినా మిణుకుమిణుకుమని చిరు వెలుగులు చిందించింది. అభ్యుదయ కవితలో నగరజీవన వర్ణన గావించారు అభ్యుదయ కవులు. భావకవులు పల్లీ జనజీవన రీతిపై, ప్రకృతి కవితలపై మోజు చూపగా, అభ్యుదయకవులు చాలావరకు నగరజీవనమే గడపినవారు కావడంవల్ల కర్మాగారాల్లో, కార్ఖానాల్లో శ్రమించే శ్రమజీవుల చాలీచాలని జీత భత్యాలతో, తలదాచుకో నీడలేని దుర్భర జీవితమనుభవించే వ్యక్తుల జీవనచిత్రణ చేసి మానవత్వాన్ని నిద్రలేపి అత్యంత దయనీయ స్థితిని నిరూపించి ప్రదర్శించారు. వాస్తవ చిత్రణతోపాటు, అవివాస్తవికతను, సెక్సు ప్రాధాన్యాన్ని, ప్రతీక వాద ధోరణినీ అతి నవ్యధోరణులుగా ప్రకటించారు. అందులో నగరజీవనవర్ణన మొకటి.

తెలుగు ప్రాచీన కవితలో ప్రధానంగా ప్రబంధాలలోని అష్టాదశ వర్ణనల్లో నగరవర్ణనమొకటి. తద్విరహితంగా కావ్యమే-ముఖ్యంగా-మన ప్రబంధాల్లు లేవు. ఆ వర్ణన, ఆ విధానమూ వేరు. ఈ నవకవితలోని నగరజీవన వర్ణనా రీతి వేరు. జన జీవన విధానాన్ని విస్పష్టంగా వివరించేది నవకవిత. ఇందులో వ్యంగ్యముంటుంది. నగరం, నగరంలోని జనం, జనం మనస్సుల్లోని స్థితిగతులను అంతర్బాహిరాల్లోని వివిధ రీతుల్ని తెలిపే కవితలు వెలువడ్డాయి.

ఆధునిక యుగంలో తెలుగులో వెలసిన వివిధ సాహిత్య ప్రక్రియలకు ఆంగ్ల సాహిత్య ప్రభావమే కారణమన్న అంశం మనకందరికీ తెలిసిందే. అదే విధంగా నవకవితలో నగర జీవన వర్ణన రీతి సైతం తెలుగులో వెలిసింది. మొట్ట మొదట ఈ అంశాన్ని గూర్చి వివరించిన ఆచార్య నారాయణరెడ్డిగారి మాటలుట్టకించడం సముచితమే.

"ఆధునిక నాగరికత వలన నైతికస్థాయిని కోల్పోయి నగర జీవితమును చిత్రించినవారిలో ఇంగ్లీషు కవిత్వమున ఎజ్రాపౌండ్, ఇలియట్ ముఖ్యులు. ఇలియట్ 'The love story of J. Alfred Prufrock' అను కావ్యములోను 'Waste Land' లోను నగరజీవన చిత్రణమునకు పాదులు వేసినాడు. నగర జీవుల బ్రతుకు ఎంత యాంత్రికముగా మారిపోయినదో సూచించుటకు ఇలియట్ ఒకచోట 'Time kept city' అన్నాడు. ఇంకొకచోట 'I have measured

out my life with Coffee spoons' The love song of J. Arfred Prufrock—The Waste Land and other Poems. అన్నాడు. ప్రకృతి వర్ణనలకు గూడ నాగరక జీవితములోని ఉపమానములనే స్వీకరించినాడు. ఉదాహరణ కొకటి.

'When the evening is spread out against the sky
Like a patient otherised upon a table ?'

ఇందులోని ఉపమానము నవ్యతా భరితమైనదని వేరే చెప్పనక్కరలేదు. ఆపరేషన్ టేబిల్ మీద చావుబ్రతుకుల మధ్య పడియున్న రోగి అవస్థతో సాయం సంధ్యను పోల్చుట, నగరకజీవితచిత్రణమునకు ప్రతిబింబమే. ఇలియట్ ప్రభావముతో తెలుగులో పఠాభి, నారాయణబాబు, ఆరుద్ర, అనిసెట్టి, నారపరెడ్డి మున్నగువారు నగరజీవిత చిత్రణము ప్రారంభించిరి." (ఆధునికాంధ్ర కవిత్వముద్ది సంప్రదాయములు; ప్రయోగములు పు. 603) ఇంతేగాదు ఇంకా తిలక్ మొదలైన కవులు ఈ నగరజీవన చిత్రణ చేశారు.

నగర జీవన చిత్రణ కవితల్లో ప్రసిద్ధమైంది. శ్రీరంగం నారాయణబాబు విశాఖపట్నం.

"విశాఖపట్నం
విశాఖపట్నం
జోడులేక
పోకూడదు
నీగ్రో స్త్రీ బుగ్గలాగ
నిగనిగలాడే తారురోడ్డు" (రుధిరజ్యోతి)

"ఇక్కడ
సోడాలో కాక్టైల్
కిల్లీలో ఉల్లి పాషాణం

సిరాబుడ్డిలో ఆత్మహత్య
విమానంలో భ్రూణహత్య
పెట్టె బండిలో గర్భస్రావం
సూటులో సతి గుండం
టార్చిలైటులో కౌరవిదయ్యం
రోగంలో శృంగారం
రేడియోలో సింహగర్జన
మనీపర్సులో దొంగలు" (రుధిరజ్యోతి)

ఇందులో నారాయణబాబు అభివ్యక్తివాదం, ప్రతీకవాదం అంతకంటే వాస్తవికత, దానికంటే అధివాస్తవికతను కవితలో ప్రతిబింబించారు. విశాఖపట్నం 1930-40 మధ్యకాలంలో ఉన్న స్థితిని అభివర్ణించారు.

దీనితో ప్రభావితులైన మానేపల్లి 'విశాఖపట్నమ్ నగరకావ్యమ్' — అని కావ్యమే రాశారు.

'వాల్తేరంటే తెలుగువాళ్ళ విశాఖపట్నం కానేకాదు
వాల్తేరంటే పైజాగ్ వాల్‌జర
వైజాగంటే విశాఖపట్నం యొక్క విశ్వరూపం.
శాకాహార మాంసాహార కాఫీ ఫలహార హోటేళ్ళు
మిలటరీ బోర్డింగ్ అండ్ లాడ్జింగ్‌లు
కింగ్ జార్జి ఆస్పత్రి అంతర్జాతీయ రోగమాల
మార్చురీనిండా మగా ఆడా శవాలు
ఇంటర్నేషనల్ రెస్టారెంట్స్‌లో
మనుషుల్నే గరమసాలా పెట్టి వండివార్చేస్తారు.
జన్మలన్నిట్లోన నరజన్మమే మేలు కద
ఘరి మాంసాలలో కెల్ల మనిషి మాంసము చౌక

కింగ్‌జార్జి ఆస్పత్రి కక్కుతోన్న కంపుతో
స్టార్ హోటేళ్ళన్ని గుమ్మముగా గుబాళిస్తున్నాయి.
బార్ బార్ దేఖో హజార్ బార్ దేఖో
ఉమర్ ఖయామ్ పింక్ ఎలిఫెంట్ మీద కూచుని
ఖజురహో ఖజురహో" (విశాఖపట్నం. పు. 9,10)

..........................................

"ఆంధ్రుల హక్కు విశాఖ ఉక్కు లేదు మనకు లక్కు
తెగ్గొట్టిన డేగ రెక్కలాగ విరిగిన తెరచాప
నిలబడే ఉంది మన ఇందిరమ్మ యిచ్చిన ఉక్కు ఫ్యాక్టరీ
చూడరండి చూడరండి కన్నులుంటే" (పై దే)

అని అభివర్ణించారువీరు. అంతేగాదు విశాఖపట్నం పరాయీకరణం జరుగుతున్న దని 'వైజాగ్ నైన్‌టీ' ఖండికలో తన ఆదుర్దాను తెలిపారు.

"ఏం ఇజం ఏది నిజం ఏ దిశ ఇది ఏ దశలో
ఎవరు విప్పుతారీ సైద్ధాంతిక చిక్కుముడి.
ఈ నగర పౌలస్త్య హృదయం తెలిసిన విభీషణుడేడి
అంతవరకు అంతుపట్టని రహస్యం ఉత్పత్తిశక్తుల విన్యాసం
వార్తావరణ కాలుష్యం ధనకాలుష్యం దాచేస్తే దాగుతుందా ?

ఏ పరిశ్రమ ఎవరిదసలు ఏ దేశానికి ఎగుమతి
ఎక్కణ్ణుంచి దిగుమతి ఎవరా వెనుక బుద్ధిమతి
మట్టి మనది తట్ట మనది తలకెత్తిన తళుకుమనది
ఉక్కునగర మధ్య చిక్కుకుంది చిక్కుకుంది తెలుగువెలుగు

మాంగనీస్ మైక్రోవేవ్ అమ్ముకునే బేహారులు
ఆక్టోపస్‌లా విజృంభించు నెపంతిస్ నాగరికత
నగర మృగ సామ్రాజ్య వీర్యానికి కాస్ట్రేషన్ వెయ్యాలి.
దాచేస్తే దాగని సత్యం మూసేస్తే మూతపడదు.

..........................................

పరాయీకరణ బానిసీకరణ భ్రష్టీకరణ
స్వేద సంపదకి అకుపురుగు రోకపురుగు కొంకపురుగు
వ్యసనం సుఖవ్యసనం ధనవ్యసనం అధికార వ్యసనం
పరాయీకరణ పరదాల్లో అంతఃపుర సౌందర్యం.

నేలతల్లి రోమకూపాల్లో డ్రోసిరా మొలకలు
లాభార్జన పరాయీకరణ ధనీకరణ అదే పట్టణీకరణ.
"డబ్లిన్ వీథుల్లో జేమ్స్‌జాయిస్‌లో
పైజాగ్ వీథుల్లో తిరుగుతున్నాను, నేను మానేపల్లిని
... ................

గంజిలేని జనాల గుండెలమీద
శృంగారనాట్యం చేస్తోంది అప్సర
మతిలేని జడ్జికోర్టు కళ్ళప్పగించి చచ్చిన శవంలాగ
అంతర్జాతీయ హోటెల్ డాల్ఫిన్స్

ఇంటర్నేషనల్ కరెన్సీ పేర్పు
జగదంబా ఎయిర్ కండీషన్‌లో ఎంతహాయి
ఆకాశవాణి స్తంభం కొస ఎరుపు
ఎంతమంది చెవుల్లో మాట్లాడుతోంది" (పై దే. పు 20)

నారాయణబాబు ఆనాటి విశాఖను వర్ణిస్తే మానేపల్లి ఈనాటి స్థితిని వర్ణించారు.

పఠాభి చిన్నప్పుడే కలకత్తా నగరాన్ని చూచి అందులోని చాలీచాలని జీతాలతో, పూటలు గడవని నిర్భాగ్యుల దీన హీన గాథల్ని పరిశీలించి ఎదరగిలి బాధపడ్డారు. ఆ వెనుక మద్రాసులో నివసిస్తూ అక్కడి పరిస్థితుల్ని గమనించి అతివాస్తవికంగా వర్ణించారు. మద్రాసు నగరంలోని ఒక రాత్రి చంద్రుని దర్శించి

"తగిలించబడి యున్నది జాబిల్లి
చయినా బజారు గగనములోన" (ఫిడేల రాగాలడజన్ పు. 3)

అన్నారు.

"కనిపిస్తావు నీవు, స్పెన్సర్సు కంపెనీ
లేక వయిటువేసులో కి
దారితప్పి ప్రవేశించి
తందరాడు చున్న దరిచేపి గ్రామస్థున్లాగ" (పై దే.)

ట్రాఫిక్ ఐలండులోని పోలీసు 'భరతనాట్యంబాడుమన్న........నటర్షి చూడామణిలా కనిపించాడట ! పోలీసు—

'బల్బు హారన్‌ల తాళంతోడి
యలక్ట్రిక్కు హారన్ల రాగానికిన్ని
మోటారు సైకిళ్ళ మృదంగానికిన్ని

అనుగుణ్యంగా వర్తిస్తుంటాడు." (పై దే) అనిచెప్పి అతని సామర్థ్యాన్ని గూర్చి 'పోలీసు భటుణ్ణి చాలా నేను స్తుతిచేస్తాను" అని ప్రశంసించి అభివర్ణించాడు.

ఆరుద్ర 'సినీవాలి'లో కాల కూట మకరందము'లాంటి నగర జీవితాన్ని వర్ణించారు.

'పాడుతాను నాకు తెలిసిన నగరం గురించి
నగరంలో నాతి గురించి నీతిగురించి." అని కావ్యవస్తు నిర్దేశం

చేశారు.

ఇంకా 'యాంత్రిక నాగరికత కాంతివంతమై చీకటివలె' జీవితాన్ని ఆవరించి వేళ్ళాడుతున్నదంటారు.

'త్వమేవాహం'లో మధ్యతరగతి వ్యగతాలను తెలిపారు ఆరుద్ర.

'కన్ ఫ్యూషన్ ముద్దడినుంచి
ఏంగ్జాయిటీ గుప్పటి నుంచి
మము బ్రోచేవారెవరు లేరా ? (త్వమేవాహం)

మధ్యతరగతి నిస్సహాయతను స్పష్టంగా చూపారు.

"లాభంలేదు సిస్టర్ శణగాయం
మానదోదు డాక్టర్
చేతులు కడుక్కో-పోడ్ మిస్టర్" (వైదే)

ఇంకా ఇలా వర్ణించారు వీరు.

"శ్రీమంతుల్ని ప్రేమించటానికి
ఆశపడుతుంది ఆధునిక నగరం
అయిదంతస్తుల హోటళ్ళ డాబా మీద
పూదోటలో వెలుతురు తగ్గించిన ఎలక్ట్రిక్
దీపాల నీలి మసాబులో
పన్నెండు గంటల రాత్రి తరువాత
పరిష్వంగ నృత్యంలో
స్లో ఫాక్సు ట్రాట్ సంగీతానికి
కళ్ళు మూస్తుంది నగరం
డాన్సు ఫ్లోరుమూల
తిరిగేటప్పుడు నిన్నుదముకొంటుంది
నీ మీద చూపించిన ప్రేమే
ప్రేకు డాన్సులో ఇంకొకరి మీదకాక్ష
నిష్కారణంగా నిష్కాషంగా
చూపెట్టే పింఢాణిని నగరం (సిసీవాలి)

ఇలాగే తిలక్ కూడా నగరం నగరజీవితం వర్ణించాడు.

"బల్ల పరపు జీవితం క్రింద రాషన్‌గా దాచిన
కోర్కెల సీక్రెటు బాక్సులోంచి తీసి
ఉద్రేకాల్ని, సెక్సుని, శృంగారాన్ని
క్రైంని, షాక్‌ని, లాటరీ కాగితాన్ని
చాటుకుంటా చూసుకొని నవ్వుకొని మీసం మెలేసుకొని
మాట్లాడకుండా జెంటిల్‌మన్‌లా

మత్తుగా పడుకొంది గొంగళి పురుగు— (అమృతం కురిసిన రాత్రి)

ఇందులో మధ్యతరగతి జీవుల చాలీచాలని జీతంతో గడిపే రీతి చెప్పబడింది.

కుందుర్తి 'నగరంలో వాన'లో నాగరిక జీవితాన్ని ఇలా వర్ణించారు.

"సన్నగా తెల్లగా కళకళలాడే
సిమెంట్ రోడ్‌లా అద్దాలలోకి
మింటినుండి మెడలు వంచిచూసి
తమ అందం చినుకుల కుప్పలుగాపోసి
అంతులేని ఆకాశమంత ఆనందంతో
మెలికలు తిరుగుతూ మిలమిలా మెరుస్తాయి మేఘాలు"—

(నగరంలో వాన) అనీ,

'పక్షాలు పోయినా పాదాలు వచ్చి
పర్వతాలు పారాడుతున్నట్లు
పరుగెత్తే రెండంతస్తుల బస్సుల్ని చూసి
గిరిశిఖర భ్రాంతితో క్రిందికి దిగివచ్చి మేఘాలు
పైకి తిరిగి వెళ్ళడానికి బద్ధకం వేసి కాబోలు
బహుకాల నగర దర్శన భాగ్యప్రాప్తిని కాబోలు
ఆ రాత్రికి సినిమాచూసి ఉదయమే వెళ్ళొచ్చని కాబోలు"

అని అంటూ డబుల్‌డెకర్ బస్సులను గూర్చి ప్రస్తావించారు.

"నగరం మీద ప్రేమగీత"మంటూ బాలగంగాధర తిలక్

"టాంక్ బండ్ సన్నని నడుముచుట్టూ
చెయ్యిచుట్టి
అందమైన నగరముఖాన్ని
దగ్గరగా తీసుకొని
ఆశలతో అలసమైన
అబిడ్ కళ్ళల్లోకి చూసి
చెక్కిళ్ళపై ముద్దు పెట్టుకో"(అమృతం కురిసిన రాత్రిపు.72)

— అని చక్కగా వర్ణించారు.

నగం స్ట్రీకింగ్ కాదు నాగరికతా కాదు, (నవోదయం పు. 55) అనే శీర్షికలో దీనురాలి గాథను దయనీయంగా చిత్రీకరిస్తూ మానవతా దృక్పథాన్ని నగర వర్ణనలో ప్రకటించాడీ వ్యాస రచయిత.

"కారు బూరల రొదల నగరాలు నేను కోరను

అందులోని హడావిడి అట్టహాసాలు నేను కోరను" (పైదే. 46) అని అంటూ "ఎల్లెకు పోదాం" (పైదే.పు. 59) అనే ఖండికలో నగరజీవిత వైముఖ్యాన్ని ప్రకటించాడీ వ్యాస రచయిత.

అనంతపుర వర్ణన చేస్తూ
"ఈ నగరీమ తల్లి
నిగనిగలాడే నల్లటి జడ
నడుమ నేరుగానున్న తారుమెయిన్ రోడ్డు
ఈ పురంధ్రీమతల్లి
జడలో తురిమిన మల్లెలు
మొల్లలు రకరకాల
పుష్పాలతోమాల
మన ప్రభుత్వ కళాశాల" (పై దే. 52) అంటూ ఈ వ్యాస రచయిత చిత్రించాడు.

ఇలాగా నగరంలో జీవించడానికి పొట్టచేతబట్టుకొని వచ్చి, జీవితం గడవని ఈ స్థితితో కొందరు శ్రామికులు, ఏదోవిధంగా చిన్న ఉద్యోగాల్లో చేరి చాలీచాలని జీతంతో చిరుద్యోగులు కర్మాగారాల్లో, కార్ఖానాల్లోనే పనిచేసే కష్టజీవుల చెమట బిందువులకు విలువ లేకపోతూంటే పడే ఆవేదనా, ఆర్తి - తమ సొత్తయిన శ్రమ జీవులు - మోసం, దగా, ఆర్భాటం, ఆడంబరం - క్రుంగదీస్తూ ఉండగా నగర జీవనం దుర్భరమైనట్లు నవ కవులు చిత్రించారు. అలనాటి నగర వర్ణన వేరు - ఈనాటి నగర జీవన వర్ణన వేరు. ఇంతే తేడా!

# జాతీయ సమైక్యం - సాహిత్యం

ఏ దేశ ప్రజలకైనా జాతీయభావం ఉండడం అత్యావశ్యకం. లేకపోతే బల వంతులైన ఇతర దేశీయుల ఆక్రమణ సందర్భంలో దేశానికి ముప్పు ముంచుకొని వచ్చే సమయంలో లేదా పారతంత్ర్యంలో మ్రగ్గుతూన్న క్లిష్టసమయంలో "ఎవరికివారే యమునా తీరే" అన్నట్లు ప్రజలు ఏమీ పట్టించుకోకపోతే దేశ ప్రజల మనుగడ విపత్సముద్రంలో మునిగిపోయే అవకాశం వుంది. ప్రజలందరూ ఆ సమయంలో జాగ్రదవస్థలో ఉండి, శత్రువులను పారద్రోలగలిగారంటేనే దేశ సమగ్రత సమైక్యత నిలువగలదు. ప్రజలు సుఖసంతోషాలతో అభివృద్ధిని సాధిం చగలరు. ఇది ఏ దేశానికైనా వర్తించే లక్షణం. ఇది తిరుగుబాటుచేసి స్వాతంత్ర్యం సంపాదించుకొన్న ప్రతి దేశానికి వాస్తవమైన అంశం. అప్పుడే జాతి జాగృతమై, తమ్ము తాము రక్షించుకోవడానికి సాధ్యమవుతుంది. ఇది భారతదేశం పట్ల సత్యం. ఈ జాతీయ సమైక్యానికి సాహిత్యం దోహదకారి అయిన అంశం స్తవం గాని వాస్తవం.

కవి సమాజంలోని కేవలం ఒక వ్యక్తి మాత్రమే కాదు; మేధావి వర్గంలో మొదటి శ్రేణికి చెందినవాడు; నిద్రావస్థలో ఉన్న సమాజాన్ని తట్టిలేపి జాగృతం చేయగల వైతాళికుడు. అందుకే సమాజంలోని మంచి చెడులకు అనుగుణంగా స్పందించి తదుచితరీతిని రచనలు చేసి, తన రచనలద్వారా ప్రజల్ని, జాతిని మేల్కొల్పుతాడు. పరిస్థితుల ప్రభావం కవిపై ఉంటుంది. కవి తదుచితరీతిని రచన చేస్తాడు. కాబట్టి సామాజిక స్థితి ప్రభావం కవిపైన, కవి రచనల ప్రభావం జాతి మీద పరస్పరం ఉంటుందని మనం గ్రహించవచ్చు. ఇది మామూలుగా కొనసాగే కాలంలో ఉండకపోవచ్చు. విపరీతమూ, విరుద్ధమూ, ఘోరమూ అయిన పరిస్థితులు నెలకొన్నప్పుడు తప్పనిసరిగా జాతి స్పందిస్తుంది. అందులో ప్రప్రథమంగా రచయి తలు స్పందించి, తన్నిరోధం కోసం, మంచిని పెంచుటకోసం రచనలు చేస్తారు. సమంగా ఈ లక్షణమే మన భారతదేశం అస్వతంత్రమై పరపీడన భరించలేక స్వాతంత్ర్యంకోసం అర్రులుచాచి, ఆరాటపడిన దినాలలో భారతజాతీయ సమైక్యం

కోసం కవి కోకిలలు గళాలువిప్పి సంసమన్వరంతో కవితాగానం ఆలపించాయి ఆ కవితలే, ఆ సాహిత్యమే జాతి సంఘటిత సంఘటిత పరచి స్వాతంత్ర్యోద్యమ సమరంలో దూకడానికి చైతన్యాన్ని ఇచ్చింది. ఉన్ముఖులను చేయడమే గాక ప్రాణబలిదానానికి సిద్ధపరచింది. జాతి, మత, వర్గ భేదాలు లేకుండా దేశప్రజలందరూ సమైక్యమై జాతీయ సమరంలో చేసి తెల్లవారల బారినుంచి తప్పించి, దేశ స్వాతంత్ర్యం కోసం ఒకే బాటపై నడచి, స్వాతంత్ర్యం సంపాదించి స్వేచ్ఛా వాయువులు పీల్చగలిగారు. మనం స్వతంత్రులమయ్యాము. ఈ సందర్భంలోనే జాతీయ సమైక్యానికి సాహిత్యమెంతగానో దోహదం చేసింది.

భారతదేశంలో ఆధునిక యుగంలో మాత్రమే "జాతీయత", "జాతీయ సమైక్యం" అనే పదాలు అవసరమయ్యాయి. ఆంగ్ల ప్రభుత్వ పాలనలో అస్వతంత్రులైన భారతీయులకు ఈ పదాల ఆవశ్యకం తెలిసివచ్చింది. ఆంగ్లప్రభుత్వాన్ని భారతదేశం నుంచి తరిమికొట్టడానికి భారత జాతిలో జాతీయ భావాలు వెల్లివిరిశాయి. అయితే ప్రాచీన కాలం నుంచి "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అనే సూక్తి ఉన్నా ఈనాటి "జాతీయత" నెలకొని ఉండలేదనవచ్చు. జాతీయత అంటే 'Nationalism'. దాని నిర్వచనం యిది—

"Nationalism is a state or condition of mind characteristic of certain people with a homogenous culture, living together in close association on a given territory and sharing a belief in a distinctive existance and a common destiny."

(Encyclopeadia of Americana C. V. 191) అంటే ఒకే విధమైన జీవనపద్ధతిలో, ఔన్నత్య సముపార్జనలో నమ్మకం కలిగి ఉండి, ప్రాంతీయ సాంస్కృతికమైన దగ్గర సంబంధంతో ఆ ప్రజలకు సహజసిద్ధమైన మానసిక స్థితినే జాతీయత అనవచ్చునని పై ఉద్ధరణవల్ల వ్యక్తమవుతుంది. ఇదే సూత్రం మన దేశానికి సమన్వయిస్తుంది. అనేక మతాలు, భాషలూ ఉన్న భారతదేశంలోని ప్రజలు ఆంగ్ల ప్రభుత్వాన్ని పారద్రోలడానికి సమైక్యమయ్యారు. ఆధునికయుగంలో

భారత ప్రజలు అనేకులు ఆంగ్లభాషా సాహిత్యాల పఠన పాఠనాల వల్ల చైతన్య వంతులయ్యారు. విదేశీ విద్యాసముపార్జనమే మనల్ని విజ్ఞుల్ని చేసింది. స్వాతంత్ర్యం కోసం మనవాళ్ళు ప్రయత్నించారు. ఎందరో ఆత్మ బలిదానం చేశారు. స్వాతంత్ర్య సమర సమయంలో కాశ్మీరు నుండి కన్యాకుమారి దాకా సమస్త భారతీయులు రంగంలో దూకారు. కవులు, రచయితలు తమ వంతుగా సాహిత్యం ద్వారా ప్రజల్ని జాగృతం చేశారు.

ఈస్టిండియా కంపెనీ భారతదేశంలో నెలకొన్న తరువాత క్రమంగా ఆంగ్ల ప్రభుత్వం ఈ గడ్డపై మెల్లగా కాలూని, స్థిరపడింది. భారతీయులలో ఇది కొంత కలవరపాటు కలిగించింది. క్రమంగా సైనికులలో, స్థానికులలో, సంస్థానాధిపతులలో రాజులలో అసంతృప్తి కలిగింది. తత్ఫలితమే 18వ శతాబ్దంలోనే కలిగిన తిరుగు బాట్లు, ముఖ్యంగా 1857లో జరిగిన సిపాయి తిరుగుబాటు మొదటిది. భారత స్వాతంత్ర్యోద్యమానికి పునాది. సిపాయి తిరుగుబాటుగా ఆంగ్ల ప్రభుత్వం భావించి, అణచివేసింది. స్వాతంత్ర్య భావ బీజాలు భారత ప్రజల హృదయ సీమల్లో ఉద్బుద్ధమయ్యాయి. క్రమంగా స్వాతంత్ర్యంకోసం ఉత్తర భారతంలో ఎందరో ఎన్నో విధాలా ప్రయత్నించారు. కొంత ఆలస్యంగానే అయిన దక్షిణ భారతంలోను ప్రజలు స్పందించారు; చైతన్యవంతులై స్వాతంత్ర్య సముపార్జనకు పాటుపడ్డారు. అలాగే ఆంధ్రులు సైతం తమ వంతుగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. కవులు తామూ ప్రజల్ని సాహిత్యంతో ఉత్తేజపరచి, ముందుకు నడిపి, స్వాతంత్ర్య సముపార్జనలో కీలక పాత్రను వహించారు జాతీయ సమైక్యం కోసం సాహిత్యం దోహదం చేసింది. ఆ సందర్భంలోనే కవితలు, నాటకాలు, నవలలు రచితమై, ప్రజలకు స్వాతంత్ర్య ఆవశ్యకాన్ని, ప్రాధాన్యాన్ని ప్రస్ఫుటం చేసి, ముందంజ వేయడానికి ఉపకరించినాయి.

20వ శతాబ్ది ఆరంభం నుంచి భారతదేశంలో జాతీయత పాదుగట్టుకొంది. వంగదేశంలో ఆరంభమైన పోరాటం ఆంధ్రలో అందుకొంది. ఆంగ్ల ప్రభుత్వాన్ని తొలగించి స్వతంత్ర వాయువులు పీల్చాలన్నది అందరి ఆకాంక్ష. "వందేమాతరం" నినాదం అందర్నీ చైతన్యవంతుల్ని చేసింది. ప్రబోధ గీతాలు, పద్యాలు, ఖండి

కలు, కావ్యాలు వెలిశాయి. తెలుగులో "జాతీయత" అనే పదం వాడి మొట్టమొదట కవిత రాసిన కవి దుష్వారి రామిరెడ్డి.

"ఓసి జాతీయతా! నీదిలోజ్జ్వలత్వ
మెంత ? నీశక్తిసామర్థ్య మెంత ? నీదు
శంఖరవమునగల యింద్రజాలమెంత ?
అస్థిపంజరములు సైత మాడునొర ?"

బంకించంద్రుని "వందేమాతరం", రవీంద్రుని 'జనగణమన' ఇక్బాల్ "హిందూస్తాన్ హమారా" గేయాలు జాతీయగీతాలు. ప్రజల్లో ఎంతో ప్రభావాన్ని చూపి, స్వాతంత్ర్యోద్యమంలో దూకేట్టు చేశాయి.

1907లో బిపిన్ చంద్రపాల్ ఆంధ్రలో పర్యటిస్తూ రాజమండ్రిలో ఆంగ్ల ప్రభుత్వాన్ని దుయ్యబట్టుతూ ఇచ్చిన ఉపన్యాసం విన్న చిలకమర్తి వారు ఆశువుగా-

భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియ గట్టియ'. అని చక్కగా చెప్పారు.

దీనితో దేశభక్తి ఆంధ్రులలో ఉద్దీపించింది. దీనికి ప్రోత్సాహమిచ్చి ప్రేరేపించిన గేయం "హిందువులారా! ఎన్నాళ్ళీగతి" అన్నదానిలోని ....'దూడనోరుగొట్టి ద్రోహంబు గొల్లలు పాకిసమస్తము పరునకమ్ముగతి కూడులేని నా కొడుకుల గాదని యేడకో నాధనమెల్లను దోచెడి' అనేభావాలే కావచ్చు. అనేఈ గేయకర్త ఎవరో తెలియదు. ఇది 1905లోనే ప్రకటించబడింది.

ఇలాగే 1909లో వచ్చిన 'మేలు కొలుపు' ప్రబోధాత్మకమైన గేయం.

'మేలుకొనుమీ భారత పుత్రుడ మేలుకొనుమా సుజన పుత్రుడు........వేడుకను జాతీయతను వేగుచుక్క పొడిచెనదిగో కూడి వందేమాతరమ్మను కుక్కుటములరచెన్.'

గురజాడ అప్పారావుగారు 1910వ సం॥లో రచించిన దేశభక్తి గీతం అనన్య సామాన్యమైంది. ఇలాంటి ప్రగాఢ దేశభక్తి గేయం మరొకటి లేదంటే అత్యుక్తి కాదు.

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్"
"యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్
"దేశాభిమానం నాకు కద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్
పూనియేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయ్"
"దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్."

అని యింకా సర్వమానవ సౌభ్రాత్రాన్ని కోరుకొన్న మహాదాశయులు గురజాడవారు.

ఇలాగే రాయప్రోలు సుబ్బారావు గారి—

"ఏ దేశమేగినా ఎందుకాలిడినా
ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గౌరవము"

చాలా ప్రసిద్ధమైంది.

చెరుకువాడ వెంకటరామయ్య, నాయని సుబ్బారావు వెంకట నరసింహారావుల "జాతీయ గీతాలు —

"మేలుకో సుచరిత్ర ! మేలుకో భరతపుత్ర ! మేలుకో చిరమిత్ర మేలుకో" అంటూ ఆనాటి భారత ప్రజల్ని జాగృతం చేశాయి.

గరిమెళ్ళ సత్యనారాయణ గారు స్వాతంత్ర్య సాధనకై చేసిన యత్నం వారి గేయంలో స్పష్టం.

"మాకొద్దీ తెల్ల దొరతనం దేవ మాకొద్దీ తెల్ల దొరతనము"
అని బాగా ప్రచారంలోకి తెచ్చి దేశభక్తిని ప్రబోధించింది.

ఇలాగే ప్రత్యక్షంగా పరోక్షంగా జాతీయోద్యమభాగంగా ప్రబోధాత్మకంగా కావ్యాలు రచించబడ్డాయి. గాంధీ జీవితాన్ని ఆశయాలను గూర్చి రచనలు వెలువడ్డాయి. శ్రీ తుమ్మలవారి ఆత్మకథ, మహాత్మాకథ మునుముందుగా చెప్పదగ్గ కావ్యాలు.

"గాంధి యుగమున బుట్టితి, గాంధి నడుపు
నుద్యమంబుల నలఁగితి నోపినంత
గాంధి వీక్షించితిని, గాంధి కవిత వ్రాయఁ
గంటి నీజన్మమునకు నీ పంటచాలు" నంటారు తుమ్మలవారు.

"శ్రీ గాంధీ భారతము" నుమారింగంటి శేషాచార్యులు గారు, ఇలాగే తదితర నాయకుల మీద అనేకులు కావ్యాలు రచించారు. నేతాజీ, బాపూజీ కావ్యాలు, జాషువాగారి అమృతకలశం నుంచి వెలువడ్డాయి. ఇవన్నీ ప్రత్యక్షంగా ప్రబోధాత్మకాలు. ఇక పరోక్ష ప్రబోధాత్మక కావ్యాలు వచ్చాయి. దుర్భాక రాజశేఖర శతావధాని గారి "రాణాప్రతాపసింహచరిత్ర" మొదటిది.

ఇందులో కవి

"ఇది నాయూరిది నాదు రాష్ట్రమనుచున్
హీనుల్ మదిన్ దుర్బలుల్
మదినూహింతురు కాని విక్రమకళాలంకారులౌ వారి క
య్యుదయాస్తాచల మధ్య గంబయిన సర్వోర్వీతలంబునన్ ముదా
స్పదమౌ కొంగుపసిండివోలె"

కావాలనీ,- జాతి, మత ప్రాంతీయ భేదాలుండరాదని ప్రబోధించారు. వీరిదే మరొక కావ్యం 'అమరసింహ'. ఇలాంటి కావ్యాలే గడియారం వేంకటశేషశాస్త్రిగారి "శివభారతము", పుట్టపర్తి వారి "షాజీ" మొదలైనవి. ఇవన్నీ గూడ దేశ స్వాతంత్ర్యం కోసం ప్రజల నుత్తేజపరచినరచనలు.

స్వాతంత్ర్యోద్యమ భాగంగానే ఆంధ్రాభిమానం వృద్ధిచెంది ఆంధ్రరాష్ట్రా వతరణకైపాటు పడ్డారు ఆంధ్రులు. శ్రీ తుమ్మలవారు "రాష్ట్రగానం" చేశారు. విశ్వనాథవారి "ఆంధ్ర పౌరుషము" "ఆంధ్ర ప్రశస్తి", దుగ్గిరాల బలరామకృష్ణయ్య గారి "తెలుగుసీమ" దోనేపూడి వెంకట్రావు గారి "ఆంధ్రతేజము", కొడాలి సుబ్బా రావు గారి "హంపీక్షేత్రం", పుట్టపర్తి వారి "పెనుగొండలక్ష్మి", మధునాపంతుల వారి "ఆంధ్రపురాణం", కొండూరి వారి "అమరావతి" పేర్కొనదగ్గ కావ్యాలు. జాతీయత ప్రకటిస్తూనే ఆంధ్రరాష్ట్రావతరణకు ఇవి దోహదం చేశాయి. ఇలాగే ఇంకా అనేక రకాలైన సాహిత్య ప్రక్రియలు వెలిశాయి. శతకాలు, దండకాలు, కీర్తనలు, హరికథలు, రచితమై జాతీయభావాలను పెదజల్లాయి.

ఇలాగే దామరాజు పుండరీకాక్షుడు మొదలైన కవులు గాంధీపై నాటకాలు రచించి ప్రదర్శించారు. శివాజీ, రాణాప్రతాపసింహ మొదలైన నాటకాలు దేశభక్తి ప్రబోధాత్మకంగా రచింపబడి ప్రదర్శితమయ్యాయి. రాజకీయ సంబంధి, గాంధీ తత్వ ప్రబోధాత్మకంగా నవలలు రచింపబడ్డాయి. దేశభక్తిపూరితంగా రచనలు చేసి, స్వాతంత్ర్య సముపార్జనలో తమ వంతుగా నాటక కర్తలు సైతం యత్నించారు.

ఈవిధంగా సాహిత్య ప్రక్రియలు అనేకం రచితమై ప్రజలను దేశ స్వాతంత్ర్య సమరాని కుద్యుక్తులను చేయడానికి, సమైక్యం చేయడానికి ఎంతగానో ఉప కరించాయి. సాహిత్యం ద్వారా ఆనాడు మనదేశంలో సమైక్యం సాధించడం జరి గింది. ఇది మరింత వృద్ధిచెందడానికి సాహిత్యమొకసాధనంగా నిలువగలదనడంలో సందేహం లేదు.

"నాకు తలంపులేదు లలనాజనతా కలితీ భరైకభూ
షాకలనన్, సత్త్విమృదు భుజాంతర తల్పకుచోపగూహని
ర్మోకమునన్, వధూజన కపోల గళచ్ఛ్రవణావతంగుహే
వాకమునన్ విలాసినుల పాపట చందురు కావిపూతలన్".
"నీచపుదాస్యవృత్తి మననేరని శూరత మాతృదేశ సే
వాచరణమ్ము నందనువు లర్పణచేసిన వారి పార్థివ
శ్రీ చెలువారుచోట, తదస్ఫుగ్రుణమలన్ వికసించి వాసన
ల్వీచును గాలిపోవగవలెన్ తదుపాత్త సమాధి మృత్తికన్.
(కాంత : వేదుల సత్యనారాయణశాస్త్రి)

# సమాజ శ్రేయస్సు-ఆధునిక సాహితి

సాహిత్యానికీ సమాజానికీ విడదీయరాని సంబంధం ఉంది. సాహిత్యం సమాజ శ్రేయస్సుకు ఉపకరించాలన్నది ఆధునిక యుగంలో బయలుదేరిన నూతన దృక్పథం (Modern Concept) అయితే ఒక అంశం ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. మన ప్రాచీనులు సైతం సాహిత్య ప్రయోజనాన్ని గురించి చెబు తూ "విశ్వశ్రేయఃకావ్యమ్" అన్నారు. కానీ ఆనాడు కావ్యప్రయోజనం రసానంద దాయకం కావడం ముఖ్యం. నీతిబోధగౌణం. ఈనాడు మనం సాహిత్య ప్రయోజనం సమాజ శ్రేయస్సును కోరేదిగానే ఉండాలన్నది తప్పనిసరి అంటున్నాం. దానికి రసానందమూ తోడైతే మరీమంచిదే. అంటే కళకళ కోసం[1] అనే సిద్ధాంతం నుంచి కళ సమాజానికుపకరించాలని కళాకారులు, సాహితీపరులు ఈనాడు ఆశిస్తున్నారు. అందుకే ప్రపంచ సాహిత్యంలో లాగానే మనదేశంలోను - ముఖ్యంగా తెలుగునాడు లోను సాహిత్యం సమాజ శ్రేయస్సుకు దోహదకారి కావాలనీ, రచయితలు ఇందుకు ప్రయత్నించాలనీ గుర్తించడం జరిగింది. ఆధునిక యుగంలో వెలువడిన తెలుగు సాహిత్యాన్ని మనం విహంగావలోకనం చేస్తే స్పష్టమవుతుంది ఈ అంశం.

ఆధునిక యుగంలో తెలుగులో మొదట మొదట మధ్య కాలపు(Medieval Period) పద్ధతులు గోచరించినా, తన్మూలంగా సాహిత్యంలో ప్రాచీన ధోరణులు ఉన్నప్పటికీ, క్రమంగా పరిణామాలు వచ్చాయి. ఇది ప్రప్రథమంగా సమాజంలోని ఆచారాల పేర జరుగుతూన్న అనాచారాల మూలంగా మూఢవిశ్వాసాలను గుడ్డిగా అనుసరించడంవల్ల అనేకానర్థాలు స్పష్టం కావడంతో మహానుభావులు ఎందరో ఎదిరించారు; ఆదుశ్చర్యల్ని దుయ్యబట్టారు. ఆకుష్ఠను సమూలంగా తుడిచి పెట్ట ప్రయత్నించారు, అందుకు సంఘసంస్కరణమే ధ్యేయమనీ, దానికి సాధనం సాహిత్యమనీ గుర్తించారు. సాహిత్యాన్ని సాధనంగా గ్రహించి సంఘసంస్కరణకు పూనుకొన్న ప్రప్రథమ వైతాళికుడు కందుకూరి వీరేశలింగం పంతులు గారు అన్న విషయం సర్వాంధ్రలోకానికీ తెలిసిందే.

ఇక్కడ ఈ సంఘసంస్కరణార్థం ఆధునిక రచయితలు వివిధ సాహిత్య ప్రక్రియల్నివాడు కొన్నారు. నాటకం, ప్రహసనం, నవల, కవిత, కథ, వ్యాసం మొదలైన సాహిత్య ప్రక్రియలు ఈ ఆధునిక యుగంలో వెలిశాయి. లేదా ఆయా రచయితలు వెలయించారు. ఆధునిక యుగంలో కవితకంటేనాటకానికే ప్రారంభంలో ప్రాముఖ్యం అధికంగా కనిపిస్తుంది. పార్శీ, ధార్వాడ నాటక కంపెనీల మూలంగా నాటకం తెలుగులో వెలసినా, మన సమాజ శ్రేయస్సును కాంక్షించినట్లు స్పష్టమవుతుంది. 1860లో తెలుగు నాటకం ఆరంభమైనా 1880లో వావిలాల వాసుదేవశాస్త్రి గారు రచించిన 'నందక రాజ్యము' అనే నాటకంలో అనాడు వైదిక, నియోగుల మధ్య ఉండే వైరుధ్యాల్ని ఖండించారు. కందుకూరి వీరేశలింగం పంతులుగారు ప్రహ్లాదలో శైవవైష్ణవమత భేదాల్ని నిరసించారు. ఇట్లే ధర్మవరం వారు పౌరాణిక నాటకాల్లో అక్కడక్కడ స్త్రీ స్వాతంత్ర్యాన్ని మొదలైన అంశాల్ని వివరించారు. కోలాచలం శ్రీనివాసరావు చారిత్రక నాటకాల్లో అతి బాల్య, వృద్ధ వివాహాల్ని ఖండించి, స్త్రీ పునర్వివాహాన్ని ప్రోత్సహించారు. కన్యాశుల్కాన్ని నిరసించారు. సంఘసంస్కరణతోపాటు, భాషాసంస్కారం కోరిన గురజాడ అప్పారావు గారు జీవితాన్ని ప్రతిబింబిస్తూ 'కన్యాశుల్కం' నాటకం రచించి తమ లక్ష్యాన్ని సాధించారు. అదే రీతిగా పానుగంటి, కాళ్లకూరి, స్త్రీ జనోద్ధరణ కోసం సామాజిక స్థితిగతుల్ని వివరిస్తూ ధనవంతులు నిరుపేదల్ని పెట్టేబాధల్ని, సమాజంలోని కుళ్ళుని, లేమిని ప్రతిబింబిస్తూ రచించిన నాటకకర్తలు అనేకులు. వారిలో రాజమన్నారు,

చలం, సుంకర వాసిరెడ్డి, ఆ త్రేయ మొదలైన వారు. ఈనాడు ఎస్.ఆర్. నంది, గణేశ్ పాత్రో, దోనేపూడి, ఎం. డి సౌజన్య పేర్కొనదగ్గవారు.వీరినాటకాల్లో సామా జిక స్పృహ ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

ప్రహసన ప్రక్రియని తెలుగులో ప్రవేశపెట్టిన ఘనత కందుకూరికి దక్కు తుంది. వారి వ్యవహారధర్మబోధిని, బ్రాహ్మ వివాహం మరవరాని ప్రహసనాలు. చిలకమర్తి ప్రహసనాలు సైతం పేరు ప్రఖ్యాతులు గడించాయి. కోలాచలం వారు నాలుగు ప్రహసనాలే రాసినా, అందులో అతిబాల్య, అతివృద్ధ వివాహాల్ని, కన్యా శుల్కాన్నీ, వేశ్యావృత్తిని ఖండించారు. ఆ వెనుక పానుగంటి మొదలైన వారి ప్రహసనాల మూలంగా ఆనాటి అనేక సమస్యల్ని ఎత్తి చూపించారు. తరువాత ఇవే నాటికలు, ఏకాంకికలుగా రూపుదిద్దుకొన్నాయి. చలం, రాజమన్నారు, నార్ల, డా॥ జి.వి. కృష్ణారావు మొదలైన వారీ ప్రక్రియని బాగా ప్రచారంలోకి తెచ్చారు. సామా జికతని ప్రతిబింబించారు.

నాటకం తరువాత బహుశా నవలకే ఎక్కువ ప్రాధాన్యం తెలుగులో ఉందని చెప్పడం తప్పులేదు. వీరేశలింగంపంతులు గారే రాజశేఖరచరిత్రలో ఆనాటి సమా జాన్ని చాలా చక్కగా చిత్రించారు. ఆ తరువాత నవలా సాహిత్యాన్ని ఏ భాషకీ తగ్గనంతగా రచయితల్ని మించి రచయిత్రులు రూపొందించారు. అక్కడక్కడా ఊహా జగత్తుఉన్నా, చాలవరకు సమాజాన్ని విస్మరించలేదనేచెప్పవచ్చుకానీక్రమంగా సాంఘికనవలల్లో భూతప్రేతపిశాచాదుల ఔద్ధత్యాన్ని, లేనిదాన్ని ఉన్నట్లు ఊహిం చడంతో రచయిత రచయిత్రులు ఈనాటి కాలక్షేపం కోసం చదివే పాఠకుల కోసం, పత్రికలుఅమ్ముడుపోవడానికీ ప్రయత్నిస్తున్నట్లుతెలుస్తుంది. ఉన్నవ వారి 'మాలపల్లి" నవల ఆనాటి సమాజానికి అద్దం పడుతుంది. అడవి బాపిరాజు నారాయణరావు ఒక ఆదర్శనాయకుని జీవిత చిత్రణమే అయినా విశిష్టమైంది. పురావైభవ పునరుద్ధరణమే తమ లక్ష్యమని భావించినా విశ్వనాథ వారి 'వేయిపడగ'ల్లో ఆనాటి సమాజం తొంగి చూస్తూనే ఉంది. చలం, శ్రీదేవి, బుచ్చిబాబు, కొడవటిగంటి, మొదలైన వారు తప్పనిసరిగా పేర్కొదగ్గవారు. తెలుగు నవలా సాహిత్యంలో సామాజికత చోటు చేసుకొంది.

ఈ ప్రక్రియల కంటె ముందు చెప్పుకోదగింది కవిత. కానీ ప్రాచీన సాహిత్యం క్షీణదశ నుంచి వేరుపడినా, నూతన రక్తం పోసుకొన్నా పాతఫక్కీ కనిపిస్తుంది ఆరంభంలో. కందుకూరి వారి 'సరస్వతీ నారద సంవాదము'లో కట్టమంచి వారి ముసలమ్మ మరణంలో, దుష్ప్వారిలో, తిరుపతి వేంకట కవుల శ్రవణానందంలో నవ్యత పొడసూపింది. అంతకంటే ముఖ్యంగా 'పాతకొత్తల మేలుకలయిక'గా ముత్యాల సరాలు రచించి కవులందరికీ గురిజాడ అయ్యాడు గురజాడ. రాయప్రోలు స్నేహలత, తృణ కంకణం మొదలైన కవితల్లో నవ్యతను ఆపాదించారు. కానీ భావకవులు ఊహాలోకాల్లో విహరించనారంభించారు. "దిగిరాను దిగిరాను దివినుండి భువికి నవ్వి పోదురుగాక నాకేటిసిగ్గు" అన్న కృష్ణశాస్త్రిగారినే అనుసరించారు. ఇందుకు సమాధానంగా పాతరోత అనీ, భావకవిత బావకవిత అనీ' భావించిన ఆధునిక కవితా యుగకర్త శ్రీశ్రీ "ఆకాశంలో పయనించే మబ్బుల్లారా ప్రపంచమిదీ ఒకసారి గమనిస్తారా?" అని ప్రశ్నించి మహాప్రస్థానం రాసి ఈ ప్రపంచాన్ని మరోప్రపంచానికి మరలించారు. 'పాతితులు, పీడితులు, బాధాసర్పదష్టుల్ని' గూర్చి కవిత చెప్పారు సామాజిక స్పృహతో. ఆధునిక యుగంలో అభ్యుదయ కవితకి ప్రత్యేక స్థానముంది. అభ్యుదయ కవితా వైభవానికి శ్రీ శ్రీ — శిష్టా.నారాయణ బాబు, పఠాభి నాలుగు స్తంభాలు. క్రమంగా ప్రజలకు దగ్గరగా కవిత వెళాలన్న పట్టుదలతో ఈనాటినుంచే వచన కవిత వెలిసింది. ఆ వెనుక దిగంబర కవిత వచ్చింది. చేతనావర్తం కవులు, పైగంబర కవులు వచ్చారు. అరసం, విరసం, సరసం, విశ్వసం వెలిశాయి. మధ్యే మార్గీయులు-కడుపునిండిన కవులు- ఉంటూనే వచ్చారు. మినీ కవిత అనే మనీ కవిత కావాలని ఆకాంక్షించారు. ఇందులోను సామాజిక స్పృహ ఉండాలన్నదే ఆకవుల కోరిక.

కథ తెలుగులో చక్కటి ప్రశంసకు పాత్రమై సామాజిక స్పృహకు నిదర్శనమై నిలిచింది. మొట్టమొదట పేర్కొనదగ్గ కథకులు గురజాడ. మంచి నిదర్శనం వారి దిద్దుబాటు. పాలగుమ్మిపద్మరాజు గాలివాన, పడవ ప్రయాణం స్మరించదగ్గవి. వేలూరి, మల్లాది, బుచ్చిబాబు, కొడవటి గంటి, గోపీచంద్—ఇంకా ఎందరో మహానుభావులు. ఈనాడు ప్రస్తుతం ఆర్.ఎస్. సుదర్శనం, ఆర్. వసుంధర పేర్కొనదగ్గ కథకులు. మధురాంతకం రాజారామ్, రావిశాస్త్రి కాళీపట్నం, బీనాదేవులను ఎలా మరవగలం ? వారిలో సామాజిక స్పృహ ప్రస్ఫుటమై ఒప్పుతూంటుంది.

సాహిత్య ప్రక్రియల్లో మొదటే ఆరంభమైనా చివర పేర్కొన్న దగ్గరి వ్యాసం. వ్యాసాన్ని సంఘసంస్కరణం కోసం ఉపయోగించుకొన్న మొదటి సాహితీవేత్త కందుకూరి వారే. ఆ వెనుక చిలకమర్తి, గిడుగు రామమూర్తి గురజాడ, కోలాచలం, రఘుపతి వెంకట రత్నం నాయుడు, పానుగంటి. తాపీధర్మా రావు మొదటి దశలో చెప్పదగిన మహానుభావులు. ఆ వెనుకపైని తెలిపిన సమస్త సాహిత్య ప్రక్రియలు సమర్థులైన సాహితీపరుల చేతుల్లో రూపుదిద్దుకొని,సర్వోత్కృ ష్టమూ, సౌష్ఠవమూ అయిన తీరులో పరిణతి చెంది మూడుపూవులు ఆరుకాయలుగా అభివృద్ధి చెంది ఈ ఆధునిక యుగంలో తెలుగు సాహిత్యం వటవృక్షమైంది. అందు లో సామాజిక స్పృహ సుస్పష్టరేఖలతో మనకు ప్రత్యక్షమై ఆహ్లాద జనకమై, సమాజాన్ని ప్రగతి శీలం చేయగల సామర్థ్యాన్ని సాధిస్తూంది. ఈ మంచిలో చెడు ఉంటూనే ఉంటుంది. చెడును తొలగించి మంచిని గ్రహించడం విజ్ఞుల లక్షణం గదా ?

నేను ముందే పేర్కొన్నట్లు ఇది కేవలం విహంగావలోకనం మాత్రమే. అందువల్ల ఆధునిక సాహిత్యాన్ని రక్తమాంసలాల రహితమైన అస్థిపంజరంలా మాత్రమే వివరించవలసి వచ్చింది. సంక్షిప్తతమే దీనికి కారణం. దీన్ని సర్వ విశి ష్టంగా, ఉత్తమంగా విశదీకరించాలంటే కొన్ని సిద్ధాంత గ్రంథాలే రాయవచ్చునని నా అభిప్రాయం. అయినా ఉన్నంత వ్యవధిలో పై శీర్షికను స్పష్టం చేశానని భావిస్తు న్నాను; సహృదయుల్ని ఇది అలరించి ఆలోచింపచేస్తే నాప్రయత్నం ఫలించినట్లుగా భావిస్తాను.

# సంస్కరణోద్యమంలో నాటకం

ఆధునిక యుగంలో తెలుగునాట సంస్కరణోద్యమానికి ఆద్యుడు కందుకూరి వీరేశలింగం పంతులు. సాహిత్యాన్ని సాధనంగా స్వీకరించి, సంఘ సంస్కరణోద్యమం ప్రారంభించి సఫలీకృత మనోరథుడయినవారు పంతులుగారు. ఆయన ప్రారంభించిన సంస్కరణోద్యమం మూడుపూవులు ఆరుకాయలుగా వర్ధి

్లంది తరువాతి కాలంలో. ఆయన సాహిత్య ప్రక్రియలన్నిటినీ గ్రహించినా, నాటకం, అందులోనూ ప్రహసనం తమ ఉద్యమానికి బహుధా ఉపకరించింది.

సంస్కరణోద్యమం రెండు విధాలు. భాషా సంస్కరణం; తద్వారా సంఘసంస్కరణం. ఈ రెండురీతుల తానారంభించిన ఉద్యమం ద్వారా సమాజానికి ఎంతో సేవచేసిన మహనీయుడు కందుకూరి. ఆయన అడుగుజాడల్లో ఎందరో నడచి సత్ఫలితాలను సాధించారు.

సంస్కరణోద్యమంలో నాటకం అనగానే అందరికీ గుర్తుకు వచ్చేది గురజాడ అప్పారావుగారు రచించిన కన్యాశుల్కం. నిజమే! దాని ప్రభావం అలాంటి మహత్తరమైనది. కాని, దీనికంటే పూర్వమే సంస్కరణోద్యమానికి దారితీసిన పరిస్థితులు తదుచిత నాటక రచనా రీతులు మనకు విదితం కాకమానవు.

తొలితెలుగు నాటకం 1860లో వెలసినా సాంఘిక నాటకం 1880లో మాత్రమే రచితమైంది. అది వావిలాల వాసుదేవశాస్త్రి కృతమైన 'నందకరాజ్యం' ఇది కల్పిత నాటకం. సంస్కరణోద్యమంలో భాగంగానే శాస్త్రిగారీ నాటకం. రచించారు. ఆనాడు బ్రాహ్మణులలోని వైదిక నియోగి తెగల వైషమ్యాలను గర్హిస్తూ వావిలాలవారు ఈ నాటకం రచించారు. వైదికులను నియోగులు మోస పుచ్చిన తీరును కంటికి కట్టినట్లు ఈ నాటకంలో రచించారు. నియోగులు గావిస్తూ వచ్చిన అన్యాయాలను, దౌర్జన్యాలను, వైదికుల అమాయకత్వాన్ని స్పష్టంగా చిత్రించారు. సందర్భోచితంగా, పాతకొత్త నాటక ప్రదర్శనాల చర్చ, స్త్రీ విద్యా ప్రాముఖ్యం వివరించారు. ఇది ఐదంకాల నాటకం. కానీ ఇది ప్రదర్శించినట్లు కానరాదు.

కందుకూరి వీరేశలింగం పంతులుగారి సంస్కరణోద్యమానికి బాగా ఉపకరించినవి ప్రహసనాలు. వారి మొదటి ప్రహసనం 'బ్రాహ్మ వివాహం.' ఆనాటి అతిబాల్య, అతివృద్ధ వివాహాలను ఖండిస్తూ కన్యాశుల్కాన్ని నిరసిస్తూ రచించిన ప్రహసనమది. 1880 నాటికే ప్రజలలో ఎంతో ప్రచారం పొందిన ప్రహసనం. దీనికి 'పెద్దయ్యగారి పెండ్లి పుస్తక'మనే పేరువచ్చింది. దీని తరువాత వ్యవహార

ధర్మబోధిని అనే ప్రహసనం రచించారు. ఇది న్యాయవాదులలో ఆవరిస్తున్న అన్యాయాల్ని ఎత్తిచూపే ప్రహసనం. ఇది 1880లో రాజమండ్రిలోని విజయ నగరం బాలికా పాఠశాలలో ప్రదర్శితం కావడం విశేషం. ఆనాటికి ప్రదర్శన నూతనం కావడంవల్ల ప్రజలు చూసి పరమానందం పొందినట్లు పంతులుగారే తమ స్వీయ చరిత్రలో రాసుకొన్నారు. దీనికి 'ప్లీడరు నాటకమ'ని ప్రసిద్ధివచ్చింది. ఆనాటికే ఒక ప్లీడరు 'వ్యవహార ధర్మబోధిని' లోని ఇతివృత్తానికి బాధపడుతూనే ప్రశంసించారు. "........... ... I see you are mercilessly exposing the faults of the young Rajahmundrians Harsh expositions will some times do more harm than good ........ If you will pardon me, I will pointout that some of the passages in your వ్యవహారధర్మ బోధిని are too sweeping and Condemnatory. You have overdrawn the picture altogether. The plot aud design are no doubt admirable............" ఇవి కేవలం ప్రహసనాలు మాత్రమే కావు. నాటకాలే అనడంలో దోషంలేదు. స్త్రీపునర్వివాహ ప్రాధాన్యాన్ని గూర్చి 'వివేక దీపిక' ప్రహసనంలో చిత్రించారు. ఇలాగే ఎన్నో ప్రహసనాలు సంస్కరణోద్దేశంలో వీరు రచించారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు సంస్కరణోద్దేశంతోనే అనేకప్రహసనాలు రచించారు.

తొలి తెలుగునాటకకర్త ధర్మవరం రామకృష్ణమాచార్యులు. ఆయన నాటకాలలో జాతీయ భావాలు, సంస్కరణ భావాలు ఎడనెడ కన్పిస్తాయి.

కోలాచలం శ్రీనివాసరావు నాటకాల్లోను, ప్రహసనాల్లోను సంస్కరణోద్యమ పూర్వకంగా, సందర్భోచితంగా, సముచిత రీతిని, ఆయారీతుల్ని చిత్రించి ఉండడం గమనించగలం. అతిబాల్య, అతివృద్ధ వివాహాల ఖండన "రామరాజుచరిత్ర (The Fali of Vijayanagar) నాటకంలోను, కన్యాశుల్కాన్ని "మైసూరు రాజ్యాభివృద్ధి" 'శిలాదిత్య' నాటకాల్లోను, 'సతీసహగమనాన్ని' 'ప్రతాపాక్బరీయ' నాటకంలోను నిరసించి స్త్రీకి విద్యాస్వాతంత్ర్యాలు అవసరమని 'బభ్రువాహన' నాటకంలోను చిత్రించారు, "ఆచారమ్మన ప్రహసనవు' అనే కన్నడ ప్రహసనంలో

ఆచారాల పేర జరిగే అనాచారాలను వేశ్యావృత్తి నిర్మూలనావశ్యకాన్ని 'నాచిపార్టీ' ప్రహసనంలోను, మద్యపాన దోషాన్ని 'అన్యాయ ధర్మపురీ విలాస' ప్రహసనంలోను చక్కగా వర్ణించారు.

తెలుగు నాటక సాహిత్యంలో ప్రముఖస్థానం గురజాడ అప్పారావుగారు రచించిన 'కన్యాశుల్కం' నాటకానిదే ఆనాటి సంఘాన్ని పీడిస్తూండిన కన్యాశుల్క దురాచారం, అతిబాల్య, అతివృద్ధ వివాహాలు, వితంతువుల దుస్థితి, వేశ్యావృత్తి-వీటన్నిటినీ గర్హిస్తూ జీవితమంత నాటకం గురజాడవారు రచించారు. జీవద్భాష అయిన వ్యావహారిక భాషలో ఈ నాటకాన్ని రచించడం మరో విధమైన సంస్కరణాభిలాషకు నిదర్శనం.

ఈ అంశాలనే గ్రహించిన కందుకూరి వారు 'బ్రాహ్మ వివాహం' రచించినట్లు పూర్వోక్తం. వీటి లక్ష్యమొక్కటే అయినా 'బ్రాహ్మ వివాహం'కంటే 'కన్యాశుల్కం'ను ఉత్తమ లక్షణ లక్షితమైన జీవిత ప్రతిబింబంగా రచించారు గురజాడ. ఈ విషయాన్నే కన్యాశుల్క నాటకోపోద్ఘాతంలో ఇలా పేర్కొన్నారు.

"Recently I happened to read 'Brahma Vivaham' by Raj Bahdur Viresalingam Panthulu garu and found there were some parallel passages in our plays, a thing perfectly natural considering that his piece traversed the whole field of Brahmin marriages. But it will be seen that these plays have little else in common our treatment being essentially different. 'Brahma Vivaham' was meant to be a pure comedy of manners, while in 'Kanya Sulkam' humour, charactarisation and the contribution of an original and complex plot have been attempted with what success, it is for the public to judge ..." కనుకనే 'కన్యాశుల్కం' నాటకం సంస్కరణోద్యమంలో చాలా ఉత్తమమైందని చెప్పడం. ఈ సందర్భంలోనే కన్యాశుల్కాన్ని గూర్చి ప్రశంసించిన కట్టమంచి రామలింగారెడ్డి గారి మాటలు పేర్కొనడం సమంజసం.

"........ Kanya Sulkam remains a master piece in the difficult realm of Social Satire. It is a glow with life and humanity, its men and women move about with all the graces and kindness, oddities, cruelties and chicaneries, sanctities and hypocrisies of real life - a life in which nature and custom, reason and tradition, sentiment and superstition are in miserable conflict ........" ఈ మాటలు నాటికి నూరుపాళ్ళు సత్యం. అందువల్లనే ఈ నాటకం ఈనాటికీ, ఇంకా ఏనాటికైనా మానవ జీవిత ప్రతిబింబం. ఈనాడు కన్యాశుల్కం సమస్య కానేకాదు. అయినా నాటకంమీద ఆదరణ, విశిష్టత తొలగి పోలేదంటే కన్యాశుల్క నాటక ప్రాధాన్యం స్పష్టమవుతుంది. ఇందులో హాస్యాని కొక ప్రత్యేకతను గురజాడ సంతరింపచేయడం విశేషం.

తరువాత పేర్కొనదగ్గ ఉత్తమ నాటకం పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి 'కంఠాభరణము'. ఆనాటి సాంఘిక దురాచారాలను, దుష్టుల మనస్తత్వాలను విశదీకరించి, హాస్యాస్పదం చేసి చక్కటి హాస్యాన్ని సృజించినవారు పానుగంటివారు. ఆ విధంగా కంఠాభరణ నాటకానికొక ప్రత్యేకత ఉంది.

కాళ్ళకూరి నారాయణరావుగారు సమాజాన్ని పీడిస్తూండిన మూడు సమస్యల్ని గ్రహించి 'చింతామణి', 'వరవిక్రయం', 'మధుసేవ' నాటకాలు గద్యపద్యాత్మకంగా రచించారు. ఆనాడు నాటకాల్లోని పద్యాల ఆవశ్యకాన్ని అనుసరించి సమాజ సంస్కరణోద్దేశంతో ప్రజాదరణకై పద్యాత్మకంగా రచించారు. కానీ నాటకాలు నీతిబోధకంటే అవినీతినే ప్రబోధించాయన్న ఒక వాదం వుంది. అయినా నాటక కర్త ప్రయత్నం మెచ్చదగింది. "ఈనాటికీ స్టేజీ నాటకాల్లో 'చింతామణి' ప్రసిద్ధమే. ఇలాంటిదే సోమరాజు రామానుజరావుగారి 'రంగూన్ రౌడి' నాటకం.

ఆ వెనుక నాటక నాటికలు రచించినవారు మునిమాణిక్యం నరసింహారావు, భమిడిపాటి కామేశ్వరరావుగారలు. వీరిలో హాస్యమధికం.

1929లో వెలువడిన రాజమన్నారు 'తప్పెవరిది' ఒక విశిష్టమైన నాటకం. బళ్ళారి రాఘవ దీనిలో ప్రధాన భూమిక ధరించి విజయాన్ని సాధించారు, సమాజంల

లోని కుళ్ళును తుడిచిపెట్ట ప్రయత్నించడం ఇందులోని ముఖ్యాంశం. ఇలాగే శ్రీరంగరామ్‌గారి 'దంపతులు', బెల్లారి రాఘవగారి 'సరిపడనిసంగతులు' పేర్కొనదగ్గవి.

మార్క్సిస్టు దృక్పథంతో రచితమైన సుంకర వాసిరెడ్డిగారల 'ముందడుగు' 'మాభూమి' విశిష్టమైన నాటకాలు. పాలగుమ్మి, అనిసెట్టి, పినిసెట్టి ప్రభృతుల నాటకాలుకూడా పేర్కొనదగ్గవి.

ఆపైనుత 'తప్పెవరిది' నాటకం తర్వాత అంత ప్రసిద్ధికెక్కి జనాదరణ పొందిన నాటకం ఆత్రేయ 'ఎన్.జీ.వో. లేక గుమస్తా'. దీనికి ఈనాటికే విశిష్టత ఉంది.

మూఢ విశ్వాసాలను ఖండిస్తూ, హేతువాద దృక్పథంతో రచనలు చేసినవారు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు స్త్రీజనోద్ధరణకై కంకణం కట్టుకొని తదుచితంగా నాటక నాటికలు రచించినవారు చలంగారు,

సంస్కరణోద్యమం పైపుగా నాటికలు రచించినవారు రాజమన్నారు, నార్ల, చలం, డా॥ జి.వి. కృష్ణారావు, గోరా, ముద్దుకృష్ణ ప్రభృతులు.

ఈనాడు ప్రసిద్ధికెక్కిన నాటకకర్తలు పాత్రో, గొల్లపూడి, జంధ్యాల, ఎన్.ఆర్. నంది ప్రభృతులు.

ఇంకా ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయాలలోని నాటక రంగశాఖలలోని అధ్యాపకులు నేటి జీవితానికి దర్పణం పట్టినట్లు చిత్రించే నాటకాలు రచించి ప్రదర్శించి ప్రయోగాలు చేస్తున్నారు.

ఈవిధంగా తెలుగు నాటకం సంస్కరణోద్యమంలో నందకరాజ్యంతో ఆరంభమై అతినవీన ధోరణులతో విలసిల్లుతూ వికసిస్తూంది. ఇది మరింత శోభాయమానమైన మానవ మనస్తత్వ చిత్రీకరణచేసి సమాజ సముద్ధరకుపకరించాలని ఆకాంక్షిస్తున్నాను.

అబ్సర్డ్ థియేటర్, అలీనియేషన్ డ్రామా, వీథి, యక్షగానం మొదలైన రీతులలో ఈనాడు నాటకం పరిణతి చెంది సమాజంలోని సమస్త అంశాల్ని విపులీ

కరిస్తూ ప్రదర్శన యోగ్యమై ప్రజాదరణ పొందుతున్నాయి. సామాన్య ప్రజానీకా నికి దగ్గరగా వస్తున్నాయి. ఏనాడో ఆరంభమైన సంస్కరణోద్యమం నాటకం ద్వారా సమాజాన్ని సంస్కరించి దాని విశిష్టలక్షణాన్ని సార్థకం చేసుకొంటుందని చేసుకోగలదని ఆశిస్తున్నాను. అందుకు తగిన వాతావరణాన్ని కల్పించవలసిన గురుతర బాధ్యత ప్రజలమీద, నాటకకర్తలమీద, ప్రభుత్వం మీద ఉన్నదని భావిస్తున్నాను.

ఉజ్వలమై వెలుగొందిన మన తెలుగునాటకం మళ్ళీ మరింతగా ఉపకరించా లని ఆకాంక్షిస్తున్నాను.

# మేఘదూతంలో సామాన్య జన జీవనం

'సరస్వతీ పుత్ర' పుట్టపర్తి నారాయణాచార్యులు ఆధునిక ప్రసిద్ధ కవులలో ఒకరు; బహుభాషావేత్తలు; సంగీత సాహిత్యాభినయ ఖని. గేయకవిగావారికత్యంత ప్రసిద్ధి. చిన్నవయస్సులోనే 'పెనుగొండ లక్ష్మి' కావ్యరచన చేసినా 'శివతాండవం' గేయకావ్యంతో బహుళ ప్రఖ్యాతిగాంచిన కవి. ద్విపదల్లో పండరి భాగవతమూ, గేయంలో జనప్రియ రామాయణమూ, 'అగ్నివీణ' మొదలైన కావ్యాలు రచించిన వీరే 'మేఘదూతం' గేయకావ్యంగా తీర్చారు. గేయం వారి చేతుల్లో అద్భుత రూపం ధరించింది. వారి గళంతో మనమూ గొంతు కలుపక మానము. వారికున్న ఉభయ భాషా పాండిత్య ప్రకర్షకిది నిదర్శనం. సంస్కృత సమాసాలు సందర్భోచితంగా కుదురుతాయి. తెనుగు నుడికారం, పలుకుబడి స్వతస్సిద్ధంగా కవితలో తమకు తామే చేరిపోతాయి. మరి వారు 'సరస్వతీ పుత్రులు' గదా!

సంస్కృతంలో, తెలుగులో అనేక సందేశ కావ్యాలు వెలిశాయి. వీటన్నిటికీ మూలమనదగ్గ కావ్యం కాళిదాస 'మేఘసందేశం'. దాని అనువాదాలు, అనుకృతులు అనేకం. ఉత్తర మేఘం సైతం వెలువడింది. 'మేఘసందేశం'లో యక్షుడు యక్షిణికి పంపే ప్రేమ సందేశం. తెలుగులో నారాయణాచార్యులకంటె ముందే వెలసినకావ్యం జాషువాగారి 'గబ్బిలం'. ఇది అనాది నుంచి పంచముల ఆవేదనను, ఆక్రందనను

అభివ్యక్తీకరించే ప్రతీక కావ్యం. అణగారిన పంచముడు-భరతమాత కడగొట్టు బిడ్డడూ-పరమేశ్వరునికి గబ్బిలం ద్వారా పంపే సందేశం క్షేమకాదు; శృంగార మంతకంటే కాదు. కరుణ రసార్ద్రమైన కవి ఆర్తి ఇందులో ప్రాధాన్యం వహిస్తుంది. మేఘమాతం మేఘసందేశానికి అనువాదంకాదు, కానీ అనుకృతి. ఇందులో నాయకుడు ధనమదాంధులచేత కారాగారంలో పడవేయబడ్డవాడు. అందులోనాయకుడు యక్షుడు-కుబేర శప్తుడు. జాషువా కవి 'గబ్బిలం'లో భరతోర్వీజన శప్తుడు. మేఘ సందేశంలో లాగే మేఘమాతంలో జైలులో అష్టకష్టాలనుభవిస్తూన్న నాయకుడు తన ప్రేయసికి మేఘంద్వారా సందేశమంపుతాడు. ఇందులో అనేకాంశాలను మనం గమనించగలము.

మేఘసందేశంలో కాళిదాసు ఉత్తర భారత వర్ణన చేశాడు. అలాగే గబ్బిలంలో జాషువా దక్షిణ భారతంతో ఆరంభించి, తెలుగుసీమనంతటినీ, ఉత్తర భారతంలో హిమాలయాల వరకు వర్ణించాడు; నారాయణచార్యులుగారు కాళిదాసు ననుసరించి మేఘమాతమని కావ్యానికి నామ కరణంచేసి ఆంధ్రదేశాన్ని మొత్తం వర్ణించారు. నాయకుడు ధనమదాంధుల కర్కశపాద ఘట్టనలచే నలిగిపోయి జైలుపాలై బళ్లారిలో బ్రతుకు భయంకరంగా గడుపుతున్నారు. శ్రీకాకుళంలోని ఒక పల్లెలోనున్న తన ప్రియురాలికి మేఘుని ద్వారా సందేశం పంపుతున్నాడు. హంపీవిజయనగరంమొదలు కొని శ్రీకాకుళంవరకు ఉన్న సమస్తాంధ్రావనిని మనసారా వర్ణించి తరించారు పుట్టపర్తివారు. వారు వర్ణించింది కేవలం మట్టినేకాదు- 'దేశమంటే మట్టికాదోయ్! దేశమంటే మనుజులోయ్' అన్న గురజాడ ప్రబోధం గురించే పుట్టపర్తివారు తెలుగు నేలలోని సామాన్య జన సముదాయ స్థితిగతులను సవిస్తరంగా, సువిస్ఫుటరేఖల్లో వర్ణించారు.

అణగారిన జనసముదాయపు బాగుకై గొంతెత్తి విలపించినవారు అభ్యుదయ కవులు. అందునా తాడితులు. పీడితులు, కర్షక కార్మికుల గూర్చి చెప్పిన శ్రీ శ్రీ గుర్తుకు వస్తాడు. ఆయన్ని స్మరిస్తూనే కవిత చెప్పిన పుట్టపర్తివారి మానసిక వేదనను గుర్తించగలము. రాజ్యాలెలా అభ్యున్నతిని పొందాయో, ఎలా పతనమై పోయాయో, వాటికంతటికి మతమే కారణమనీ, తల్లికోట యుద్ధంలోరామరాయలను బహమనీ సుల్తానులు సంహరించి తుంగభద్రలో కత్తిని శుభ్రపరచుకొన్నఅంశాన్ని,

రాజుల మతపిచ్చివల్ల నే రణరంగాల్లో ర క్తనదులు పారాయనీ, కృష్ణానది ఈ విష యాలన్నీ తెలిసి శోకగీతికలాలపిస్తూందనీ, అనాదిగా తెనుగుజాతికి బహునాయ కత్వం పీడిస్తూందనీ, తుంగకు కృష్ణకులేని భేదభావం రాజులకెందుకో అని ప్రశ్నార్థకాన్ని సూచించి,

మతమంట మతమెుక్క
మారిపై పట్టినది
మతిలేని రాజవర్గంబు వారి స

మ్మతికిఁజచ్చినదీ, సైనంబు హృదయాన గరుణ కరుపై యున్న నరుల కెక్కడి మతము! పరపీడనమే, దేశచరితలకు మూలంబు" (3-30) అని శ్రీశ్రీ 'దేశ చరిత్రలు' ఖండికను స్మరించి, దీనికంతటికి పరపీడనమే మూలమని **వివరించారు.**

'ఏ దేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం!
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం'
................
గతమంతా తడిసె ర క్తమున
కాకుంటే కన్నీళులతో'

—అనే శ్రీశ్రీ మాటల ఆవేశపూరిత భావసరంపరను తలపింపచేశారు పుట్టపర్తి వారు. ఇంతేకాదు. మార్కాపురాన్ని స్మరించి మార్కాపురంలోని చెన్నకేశవ స్వామి ఆలయంలోగల సలకం తిమ్మయ్యను రామరాయలు వధించి వేయించిన శాసనాన్ని చెప్పి, అక్కడే పెద్ద చెరువు నిర్మించింది గజపతి పుత్రిక అనీ,

'కొండలకుఁగొండలకుఁ
గ్రొత్త చుట్టరికమ్ము

జేసి కట్టించినది చెఱువూ ఆ రాచ
కోడలికిఁ దక్కిన పరువూ రేఁబవలు
మన్ను మోసినవారి మాటయే లేదురా!
వన్నెకాఁడా! ద్రవిణవంతుల దిడే వరుస' (3-77)

అని చాలా సముచితంగా మళ్ళీ శ్రీశ్రీని గుర్తుకు తెస్తున్నారు పుట్టపర్తి. మళ్ళీ మనకు శ్రీ శ్రీ 'దేశ చరిత్రలు' ఖండిక స్మరణకు వస్తుంది. 'తారీఖులు దస్తావేజులు చరిత్రకర్థంకాదనీ, రాజుల ప్రేమప్రాణం ముట్టడికైన ఖర్చులూ, మతలబులూ, కైఫీయతులూ చరిత్రసారం కాదనీ, ఇతిహాసపు చీకటి కోణంలో అట్టడుగున పడి కాన్పించని దావేస్తే దాగని సత్యమైన కథలు' కావాలనీ పేర్కొంటూ

"నైలునదీ నాగరికతలో
సామాన్యుని జీవనమెట్టిది ?
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీలెవ్వరు ?
సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుని సాహసమెట్టిది ?
ప్రభువెక్కిన పల్లకి కాదోయ్
అది మోసిన బోయీలెవ్వరు?"

అని నిలదీసి ప్రశ్నించిన శ్రీశ్రీ మాటలనే పుట్టపర్తివారు, గజపతి పుత్రిక చెరువు నిర్మింపచేస్తే చేయవచ్చు. ఖ్యాతి రావచ్చుగాక దక్కింది గనుక; ధనవంతుల గొప్పదనమే ఇది, కాని ఆ చెరువు నిర్మాణంలో చలిగాలి ఎండవానలను భరించి కండలు కరిగించిన మట్టిమోసిన కూలీలమాటలేవి? 'మన్ను మోసినవారి మాటయే లేదురా!" అని పుట్టపర్తివారు పెదవి విరిచారు. శ్రీ శ్రీని తలపింపజేశారు తమ గేయకావ్యంలో.

ఇలాగే సమకాలికాంధ్ర కవులలో శ్రీ విశ్వనాథవారిని 'వలపు నాగపసాని, తెలుగు కిన్నెరసాని" అని స్మరించారు.

ప్రాచీనాంధ్రకవుల నెందరినో స్మరించినా అందులో పేర్కొనదగ్గ కవి శ్రీకృష్ణదేవరాయలు. రాయలు వర్ణించిన అతిసామాన్యులను పుట్టపర్తివారు స్మరించి, ఆనాటికే రాయలు అతిసామాన్య జన ప్రాముఖ్యాన్ని, వారి జీవన గతులను గుర్తించిన అంశాన్ని వివరించారు. పొలాల్లో పనిచేసే భర్తలకు అంబళ్ళు కొనిపోయే భార్యలను వర్ణించాడు కృష్ణదేవరాయలు. ఇదే రీతిలో రాయలసీమలో సామాన్యుల ఆహారం 'సంగటి'ని కొనిపోయే స్త్రీలను వర్ణించారు పుట్టపర్తివారు.



"మరుడనెడు రారాజు
దురుసు టేనుగు కుంభ
ములకు సైదోడులైనట్టి కుచయుగము
మిసిమిఱ్ఱగా నొఱగుగట్టి పొలమందు
సంచరించెడువాని 'సంగటి'ని గొనిపోవు
సకియలను, సరకుసేయక, నీవు పొయ్యేవు" (4-13)



ఇలాగే 'అంబళ్ళ' కొని వెళ్లే తీరును వర్ణించారు. (9-17)

అయితే నారాయణాచార్యులు సందర్భానుసారంగా అవకాశం కల్పించుకొని శృంగార వర్ణన చేయడం గమనించగలము.



తాడితులు, పీడితులు, దగాపడిన తమ్ముళ్ళు, కర్షక కార్మికులు మొదలైన అణగారిన జనసముదాయ కల్యాణానికి సామ్యవాద సిద్ధాంతాలను ప్రచారంచేసిన శ్రీ శ్రీ తీరును గుర్తుచేస్తారు పుట్టపర్తి వారు. అనేక రీతుల హరిజనులు, మాలెతలు, కమ్మరి, చాకిత, రైతు, పాలేరు, పణ్యాంగనలు, ఆటవికులు, కోయలు, లంబాడీలు, బుడబుక్కలు, కంకరగొట్టు వారు మొదలైన- అట్టడుగు అన్నివర్గాల ప్రజల్ని వివిధ రీతుల స్వాభావికంగా వర్ణించిన తీరు హృదయ విదారకంగా, కరుణరస రంజితంగా ఉంటుంది. 'మండుటెండల్లో నిండుటాకవితో నడపీనుగుల్లా ధూళి ధూసరితులైన హరిజనులు (3-5), యౌవనం దీళ్ళ చంద్రికలైనట్టి వారు రాళ్ళు మోస్తున్న వారు (3-6) 'పొట్టకో బొక్కలేర్పడువాడూ, వాని కనుగ్రుడ్లలో కన్నీరు కొంచెముగ దిగజారి కాయగాచిన కరంతో కంకరనుగొట్టుచున్నాడూ (3-8) 'తడబాటు నడకతో, నడుము కిటకిటలాడ కూటికై పేటలను మార్చుచూ వాపోవు

మాలెతలు (5-21), మొదలైన దీనుల హీనుల దైన్యహైన్య స్థితిని వర్ణించి జాలి చూపుమని మేఘుని వేడుకొంటారు కవి. మబ్బులు పట్టగానే పుట్టగొడుగులు వెలుస్తాయన్న నమ్మకాన్ని చెబుతూ 'కట్టు బట్టయుఁ దిండి గతిలేని దేశాన పుట్టగొడుగులుగాక పురుషులెవరున్నారు" (3-13) అంటారు వ్యంగ్యంగా.

ఇంతకంటే కరుణరసాత్మక దృశ్యాన్ని అభివర్ణించి కమ్మరి దీనస్థితిని, తిండికిలేక మలమలమాడుతున్న వాడి భార్య తన పుత్రునికి తిండిలేని తనవద్ద పాలెక్కడివి, రక్తమే తాపుతుందేమో అంటారు కవి. ఇది చాలా దారుణ దృశ్యం. జాలిగొలిపే సన్నివేశం.

వాడె కమ్మరి చూడు!
దౌర్భాగ్యముల గూడు

కొలిమి నూదుచునున్నవాడూ! తన పొట్ట
కోసమై నరయుచున్నాడూ! అల్లంత
దూరాన నదె వాని తొయ్యలిని గనుగొమ్ము
జీరాడు చనులతో చీర నోచనిదాన!!

తెలి నవ్వులందముల
జిలికింప మొగముపై

పాలకై ఏడ్చుచున్నాడూ బుడతండు
పట్టుదలకెత్తికొన్నాడూ ఆ తల్లి
చనుబాల నిచ్చునో! దన యురము జీల్చి
రక్తంబులే ద్రాపునో! ధనికు లే మెఱుగుదురు (3-9, 10)

ఆ కమ్మరి కొలిమి తిత్తికి ఊపిరిపోసినట్లే తన పొట్టకు కేవలం ఊపిరి మాత్రం పోసుకొంటున్నాడు. తిన తిండిలేక, కండలేక, కట్టగుడ్డలేక గుడ్డపీలిక మాలికలైనట్లు 'జీరాడు చనులతో' తన తెలినవ్వులందాల మొగంతో పాలకై ఏడ్చే చిన్నపాపడికి పాలుగాదు తన రక్తంతో సంతృప్తిపరుస్తుంది కాబోలునని ఆ కార్మికుల దుర్భర దుస్థితిని కరుణరసార్ద్రంగా వర్ణించారు పుట్టపర్తివారు.

రైతన్నేగాదు, పాలేరుసైతం ఎంతో కష్టించి పొలం పనులుచేసి పంటలు పండిస్తే వానికే తినడానికుండదు. అది భామందుకే చెందుతుందని ఉన్న పరస్పర విరుద్ధభావాన్ని ప్రకటించారు కవిగారు.

'పల్లెపట్టులయందు(
బయనించు సమయాల

పాలేరువాడు గన్పించూ మిడిమెండ
బ్రద్దలుగొట్టి పండించూ వాడెంత
గష్టించినా మిరపహారమే సంగటికి,
కలబోయిభామందు, కలిమివానికె చెందు" (4-19)

ఇలాగే కళ్ళల్లో కన్నీరు కాల్వగట్టగా నాగేటివాళ్ళలాంటి తన తీరికలేని బ్రతుకును గూర్చి 'వృషభరాజ' భాష (4-11) నీకర్థమవుతుందా? అని ప్రశ్నిస్తున్నారు.

ఒందరి మైలబట్టలు శుభ్రంచేసి తిరిగి ఇచ్చే చాకితకు గుడ్డలే లేవు. కటి బిగువుగా కడుపు బిగువులేని "ఇంతైన కట్టుకొనగా జెన్నుగల బట్టయే లేదు" అని వాపోతారు.

"గిలుకు మట్టెలపాట
తొలకించి చనుదెంచు
నదిగదిగో! చాకితను చూడూ తెలిసీటి
యౌవనము చూపులకు సూడూ యింతైన
గట్టుకొనగా(జెన్నుగల బట్టయేలేదు
కడుపు బిగువేలేదు కటిని బిగువేగాని" (3-11)

ఘోరమైన వేశ్యల జీవిత దుస్థితిని ప్రస్తావించి ఆ వచ్చేవారే పణ్యాంగనలు వారినీ నీవు రయాలతో వెదలగొట్టక కూటికి లేక తనువమ్ముకొన్నారుగానీ తింటాని తిందేఉంటేవాళ్ళే పాతివ్రత్యాన్ని గూర్చి ప్రసంగాలుచేయగలర'ని తెలిపి, వ్యభి

వార నిర్మూలనపని నాయకులంటూ ఉంటారుగాని, ఆవేదనా భరిత జీవనులకై చేసింకేమీ లేదని కవిగారు దుయ్యబట్టారు.

"వారు పణ్యాంగనలు............కూటికై

తనువమ్ముకొన్నారు-తినతిండియేయున్న వారు పలికేరు"పాతివ్రత్య భావంబు

"వ్యభిచార దోషమ్ము

నాకట్టవలెనంచు

నీతులను పల్కేరుగానీ నాయకులు

వారి కొలకివ్వ లేకానీ శుష్కధ

ర్మార్థములతో దేశ మగడు బట్టినదోయి

అర్థమే సర్వమై స్వార్థమ్ము పెరిగినది" (4-38, 39)

ఇదంతా డబ్బున్న వాళ్ళు చెప్పే మాటలు. కానీ లేనివాళ్ళ దుస్థితి ఇది.

కోయలు, ఆటవికులు, 'అడవిదారులకక్కి నుడివడెడి లంబాడీ'లను వర్ణించారు. ఇంతకంటే బుడబుక్కల వర్ణన విశిష్టంగా వుంది. ప్రజలందరికీ మంచి చెడ్డలను చెప్పగల దిట్ట కొత్త కొత్త బాణీలతో పాటలు గట్టి పాడి వినోదం గూర్చే బుడబుక్కలవాడి కష్టాలను గమనించమంటున్నాడు.

"పులితోలు గట్టికొని

చెలుపు 'ఛత్రీ' బట్టి

రంగురంగుల గుడ్డలూనీ చేతక్క

జెంగలింపగ క్రొత్తబాణీ గన్పించు

బుడబుక్కల వాడు నిడుద పాటలతోడ

కడలేని యవ్వాని కష్టంబు నడుగరా! (5-18)

ఇలాంటివెన్నో గ్రామీణ జీవితంలో జానపద ప్రదర్శన కళారూపాలుండేవి, వాటితో అనేకులు జీవించేవారు. కానీ యీనాడు

"ఇంటింటిలో గూడ నింగ్లీషు చిలుకలై
నేడు మా చదువులే నేలపాలై పోవు" (5-19)

అని వాపోతారు.

గొల్ల సుద్దులను ప్రస్తావించి పెర్రిగొల్లలనీ, జాతి తక్కువనీ చూడకూడదనీ, వారు మన జాతి విక్రమానికే పతాకలనీ ప్రశంసించారు.

"తన రుమాలకు వింత
తాండవములు దిద్ది
పంకించి పంకించి శిరసూ శబ్దములు
జంకించి, చూపించి దురుసూ సుద్దులను
బలుకువారల జూచి తలచేస్తూ తక్కువని
జాతి విక్రమమునకు కేతువులువారన్న" (5-17)

ఇంతేగాదు చదువు సందెలు లేకున్నా వారి కష్టంతో సంపన్నులు సౌఖ్య సౌధాలు కట్టుకొన్నారని విస్పష్టంగా పేర్కొన్నారు.

"చదువు సంధ్యలు సుంతలేక్షూ శ్రమపడిన
సౌఖ్యములు వారికే కావ్వా నాగరక
తా జాతి - వారి మేధో మాంసములపైని
'తాజా'గ( గట్టినది దమ సౌఖ్య సౌధాలు" (5-16)

బీదలకొక్కకడి జిక్కదనీ, 'పంటకో ధనవంతునింటి సంచులు నిండు"ననీ (4-22) ధనవంతుల ముఖం చూడకుమని మేఘుని ఉద్బోధిస్తూ

'వడ్డిరూకల(గడువు
లడ్డంబు బెరుగ నా
పడ్డలై గనుపింత్రు నీకూ ధనులు ద
న్ముఖ దర్శనము సేయ వాకూ సరివారి
సౌఖ్యంపు పుత్రెలో జగతి సేమము ద్రావు
గడుదుష్టులకు వింతకాపాలికులువారు" (4-20)

అని వివరించారు.

ఇలాగా ధనవంతులు ధనహీనుల్ని ఎలా పీడిస్తున్నారో గతితార్కిక భౌతిక వాదాన్ని పఠించిన పుట్టపర్తివారు సముచితరీతిని వివరించారు.

'నరజాతి చరిత్ర సమస్తం
దరిద్రులను కాల్చుకు తినడం'
'బలసంతులు దుర్బలజాతిని
బానిసలను కావించారు
నరహంతలు ధరాధిపతులై
చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి'
'ధనవంతుల పన్నాగాలూ
ఇంకానా! ఇకపై చెల్లవు" అని శ్రీశ్రీ చెప్పిన మాటల్నే

పుట్టపర్తి తమ కవితలో నిరూపించారు.

'కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం
జాలరి పగ్గం, సాలెల మగ్గం
శరీర కష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి
సహస్రవృత్తుల సమస్త చిహ్నాలు
'కార్మికలోకపు కల్యాణానికి
శ్రామిక లోకపు సౌభాగ్యానికి"

అని ప్రతిజ్ఞ శ్రీశ్రీ చేసిన దాన్ని పుట్టపర్తివారు అతి సామాన్య ప్రజల దీనగాధలను హీన చరిత్రలను తెలిపి ఎలా ధనవంతులచేత అణచివేయబడుతున్నారో నిరూపించారు 'మేఘదూత' కావ్యంలో.

వాస్తవానికి ఈ కావ్యేతివృత్తంలో నాయకుడు ధనమదాంధుల క్రౌర్యానికి ఆహుతి అయిన సామాన్యుడు. ధనవంతుల దుండగాలకు కారాగారబద్ధుడైనాడు. ఇలాగే అతిసామాన్య మానవులు ఎలా ధనవంతునిచే పీడింపబడుతున్నారో పూర్తిగా నిరూపించారు. ఈ కావ్యంలో ప్రధానాంశమిదే. అయినా ఆంధ్రదేశచరిత్రను, దేవాలయాలను, నదులను, సమస్తమూ చిత్రించి గేయరీతిని చక్కగా ఉపయోగించు

కొన్నారు. ఆ గేయకీర్తిని వినిపించడంకంటే పాడుతుంటే మనోహరంగా ఉంటుంది. పుట్టపర్తివారు పాడుతూంటే మనం విని తరించాలి. ఈ కావ్యంకంటే వారికి పేరు ప్రఖ్యాతులు తెచ్చిన కావ్యం వారి 'శివతాండవం'. మేఘదూతంలోని సరస్వతీ పుత్రుల భాషాశైలీ విన్యాసాలను, రాయలసీమ మాండలికాన్ని ప్రత్యేకంగా పరిశీలించవలసి ఉంది. కావ్యనాయకుని విరహాతిశయాన్ని వర్ణించినా కవి కిష్టమైన శృంగారాన్ని సందర్భానుసారంగా వర్ణించక వదలలేదు. దీన్ని ప్రత్యేకించి వివరించవలసి ఉంది. ఇన్ని అంశాలుండగా, నారాయణాచార్యుల హృద్గతాభిప్రాయాన్ని సామాన్యజన జీవనాలపై, దైన్య హైన్య స్థితిపై మొగ్గుచూపిన రీతిని లేశమాత్రంగా ఈ వ్యాసంలో ప్రదర్శించ ప్రయత్నించాను ఆయన మహాకవి; సరస్వతీ పుత్రులు!

# శ్రీవిశ్వనాథరేడియోనాటికలుతెలుగుసాహిత్యం-అనుశీలన

ఆధునికయుగంలో తెలుగు సాహితీ జగత్తులో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికొక ప్రత్యేక స్థానముంది వివిధ సాహితీ ప్రక్రియల్ని సృజించి మహాకళా స్రష్టగా నిరూపించుకొన్నారు. ప్రప్రథమంగా తెలుగులో జ్ఞాన పీఠ పురస్కారం పొందిన మేటి ఆయన కవి సమ్రాట్.

విశ్వనాథవారు రామాయణ కల్పవృక్షం మొదలు కోకిలమ్మ పెళ్ళి దాకా, వేయిపడగలు మొదలు హాహాహూహూదాకా, త్రిశూలం మొదలు రేడియో నాటికల దాకా, నన్నయ ప్రసన్నకథా కలితార్థయుక్తి మొదలు ఒకడు నాచన సోమన్నదాకా అనేక రచనలు చేసి కళావేత్తగా సాహితీలోకంలో తమ గొప్పదనాన్ని నిలుపుకొన్నారు.

త్రిశూలం, నర్తనశాల, వేనరాజు, అనార్కలి మొదలైన ఉత్తమనాటకాలతోపాటు రేడియో నాటికలెన్నో రచించారు. అందులో ప్రత్యేకించి తెలుగు సాహిత్యానికి సంబంధించి పదిరేడియో నాటికలు రచించి రేడియోలో ప్రసారం చేయడమేగాక

'భారతి'లో ప్రకటించారు. ఆనాటికలివి భారతావతరణం, ఉభయకవిమిత్రం, పాల్కురికి శివభక్తి, నందికంత పోతరాజు, అద్వైతశేఖరం, వసంతోత్సవం, కనకాభిషేకం, నాటకోత్సవం, ఆతిథ్యం, హేతువాదయుగం- అనేవి. ఈ పది నాటికల్లో విశ్వనాథ వారు కళాస్రష్టగా, ఉత్తమ విమర్శకులుగా మనకు ప్రత్యక్షమవుతారు. ఈ పది నాటికల్లో నాయీ వ్యాసం ప్రత్యేకించి ఆధునికాంధ్ర సాహిత్య వైభవాన్ని వివరించే నాటకోత్సవం, ఆతిథ్యం, హేతువాద యుగం అనే మూడు నాటికలకు మాత్రమే పరిమితం. అయినా ప్రాచీనాంధ్ర సాహిత్య సంబంధులైన మొదటి ఏడు నాటికలను గూర్చి స్థాలీపులాక న్యాయంగా పరిశీలించడం ఆధునికాంధ్ర సాహిత్యయుగ నాటికల విశ్లేషణకు పునాది కాగలదు. అందుచే ఈ నేపథ్యంలో విశ్వనాథ వారు ప్రాచీన సాహిత్యాన్ని వివర్తించిన తీరు, దాని మూలాన తదనంతర కాలంలో పాశ్చాత్య ప్రభావంతో వెలువడ్డ వివిధ సాహిత్య ప్రక్రియల వివరణలో అమోఘమైన అవగాహన, తద్వారా విశ్వనాథ వారి ప్రతిభా పాటవాలు, వీటన్నిటిని సమన్వయించే తీరు, సహృదయ హృదయతాముద్ర అవగతమై విశ్వనాథ వారి విరాట్స్వరూపం విదితమవుతుంది.

ప్రాచీనాంధ్ర సాహిత్య సంబంధి ప్రప్రథమ నాటిక భారతావతరణం. నన్నయ భారతాన్ని తెనిగించి ఆవిష్కరించడం ఇందులో విషయం. రాజరాజనరేంద్రుని ఆస్థానంలో ఈ ఆవిష్కరణ సభ జరిగినా, స్వర్లోకంలో సరస్వతీదేవి, తదితర కవులు, బ్రహ్మ, మేనక మొదలైన వారి మధ్య సంభాషణ సాగినట్లు విశ్వనాథ వారు కల్పించారు. తెనుగు భాషావిషయంలో ఆనాడు సంస్కృత పండితులలో ఉన్న తూష్ణీం భావాన్ని, ప్రవేశపెట్టిన బ్రాహ్మణుల సంభాషణలో వివరించి, నన్నయ తనకు ప్రత్యర్థి అనీ, వ్యాసునే ఎక్కువ ప్రస్తుతించాడని వాల్మీకి తనవ్యథను సరస్వతీదేవితో వ్యక్తం చేస్తాడు. జీవద్భాషకు మార్పు సహజమని సరస్వతీ దేవిచేత చెప్పిస్తారు. పైపెచ్చు సరస్వతీదేవి వివర్తశోభ పరిశీలకించడానికి కాళిదాసు, భవభూతి, మురారి విచ్చేసినట్లు చెప్పించారు. నన్నయ "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ....శ్లోకంతో ప్రారంభించి "పాయక పాక శాసనికి...." మొదలైన పద్యాలు చదివి వినిపించాడు. కాళిదాస భవభూతులిద్దరు నన్నయగా అవతరించినట్లుసరస్వతీదేవిచెబుతుంది. ఇందులో సరస్వతీ దేవి పాదాలకు పారాణి పెట్టడానికని మేనకను ప్రవేశపెట్టారు విశ్వనాథ.

అంతే గాదు. సందర్భోచితంగా మేనక కాళిదాసుని ఎత్తిపొడుస్తుంది. "ఓయీ కాళిదాస భవభూతులారా! నా శరీర కాంతి నన్నయ సంస్కృతమూచేత, మీ సంస్కృతము చేతవలెనే వెలుగులు మీరుచున్నవి" అని సరస్వతీదేవి పలుకగా ఆంధ్ర భారతానికి, ఆంధ్రజాతికి, ఆంధ్ర సారస్వతానికి జయం కోరుతూండగా నాటిక ముగుస్తుంది.

రెండో నాటిక 'ఉభయ కవిమిత్రం', తిక్కన భారతాంధ్రీకరణను గూర్చిన విషయ వివరణతో కూడినది. అయితే ఇక్కడ ఉభయకవిమిత్రుడు తిక్కన. ఉభయ కవి శబ్దానికి సంస్కృతాంధ్ర కవులనిగాక ఐహికాముష్మికాలు రెంటికి సంబంధించిన కవి అని వ్యాఖ్యానించినట్లు విశ్వనాథ వారే వివరించారు. ప్రారంభంలో కాటమరాజుతో కలిగిన యుద్ధంలో, ఖడ్గతిక్కన్నబ్రహ్మరుద్రయ్యలు యుద్ధం చేసి ఇద్దరు మరణించడం ఈనాటికలో చూపబడింది. ఇందులో తిక్కన భారతాంధ్రీకరణతోపాటు శ్రీ గణపతిదేవ చక్రవర్తి ఆస్థానానికి రాయబారిగా వెళ్ళి మనుమసిద్ధికి పోయిన రాజ్యాన్ని సంపాదించి పెట్టినట్లు వివరించబడింది. పైపెచ్చు మనుమసిద్ధికి, కాటమరాజుకు పుల్లరి విషయంగా యుద్ధం జరిగిన సంగతి ఉంది కానీ మనుమసిద్ధి తదనంతర కాలంలో, అతని పుత్రుడు నల్లసిద్ధికి, కాటమరాజుకు యుద్ధం జరిగినట్లు పరిశోధనలవల్ల తేలింది.

మూడోనాటిక 'పాల్కురికి శివభక్తి'. ఇందులో ప్రతాపరుద్ర మహారాజు పాల్కురికి గ్రంథాల్లోంచి శ్లోకాలు, పద్యాలు, ద్విపదలు, స్వయంభూ శివాలయంలో స్తుతిస్తూ ఉండగా వేంకట మఖి, రామభద్ర సోమయాజి అనే బ్రాహ్మణులుపాల్కురికి భాష నాశనం చేశాడని, అతని సాహిత్యమంతా తప్పుల తడక అని నిందిస్తారు. వంచయ్య, మల్లయ్య అనే శివశరణులు శివనింద చేసినవారిని, అంతకంటే శివభక్తుల్ని నిందించిన వారిని శిక్షించాలనీ అయితే గురువైన పాల్కురికి తెలియకుండా ఆ పనిచేయ గూడదనీ పాల్కురికి వద్దకు వెడతారు. ప్రాణివధ చేయరాదని బోధిస్తాడు పాల్కురికి. భయంకరమైన గొడవే జరుగబోతుందను కొన్న సమయంలో ప్రతాపరుద్ర మహారాజు క్షమాభిక్ష కోరగా ఉత్తమశివభక్తుడైన కొప్పయ్యకి దోకిపర్తిని అగ్రహారంగా ఇప్పించి క్షమిస్తాడు. ఇది ఇందలి కథ. ఇందులో పాల్కురికి సాహిత్యం, దేశి సాహిత్యమనీ, మార్గకాదనీ పాల్కురికి చేతనే పలికిస్తారు విశ్వనాథవారు.

నాల్గోనాటిక 'సందికంత పోతరాజు'. సందికంత పోతరాజుఅనేది కత్తిపేరు. ఇది కొండవీటి రాజ్య చిహ్నం. ఆకత్తి రెడ్డిరాజుల వద్దనే ఉంచే రాజ్యోన్నతికి లేకపోతే వినాశనానికీ కారణమవుతుంది. శ్రీనాథుడు మహాకవి మాత్రమేగాక, రాజ్యాన్ని నిలుపగల మహావ్యక్తిగా విశ్వనాథవారు ఇందులో వివరించారు. రాజ మహేంద్రవరంలో ఉన్న సందికంతపోతరాజును అల్లాడ వేమారెడ్డి నడిగికొని తెచ్చి, కోమటి వేమారెడ్డికి కొండవీటిలో అప్పగిస్తాడు. అదే రీతిగా ప్రౌఢ దేవ రాయలకు బందీ అయి కోమటి వేమారెడ్డి కుమార్తె హేమాంబకు భర్తగానిర్ణయించ బడిన సోమదేవ ప్రోడుని విడిపించుకొని రావడం శ్రీనాథుని రెండు ఘనకార్యాలు. ఇవి యుద్ధంవల్ల సాధించేవి గావని విశ్వనాథ వ్యాఖ్యానం. అవచితిప్పయ్య తోటిస్నేహాన్ని, వల్లభామాత్యుని పరిచయం, క్రీడాభిరామ కర్త వల్లభామాత్యుడే అయినా శ్రీనాథుని పేర వెలసిన రీతిని చక్కగా వివరించారు. ఇంతేగాక రాజ శిక్షితుల మెడలో దండలు, మొదలైన చిహ్నాలున్న వీధినిపోవడాని కంగీకరించని మెత్తని హృదయుడైన శ్రీనాధునికి చివరికదే ప్రాప్తిస్తుంది. "దేనిని జీవుడు భయ ముచే పరిహరింపనెంచునో భగవంతుడు వానికి దానిని సంఘటించును" అని దీనికి విశ్వనాథవారి వ్యాఖ్యానం.

ఐదోనాటిక 'అద్వైత శేఖరం'. ఇందులో విశ్వనాథవారు పోతన భాగవతం రచించిన తీరును వివరించారు. పోతన తదనంతరం శిథిలమైన స్కంధాలను ఇతర కవులు రచించినట్లుకాక పోతన కాలంలోనే అతని అనుమతితో రచించినట్లు తమ అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. ఇది కొంతమంది విమర్శకులుఅంగీకరించినఅంశం. భాగవతంలో ఐదవ స్కంధం బొప్పరాజు గంగన, ఆరవస్కంధం ఏర్చూరిసింగన, పదకొండు, పన్నెండు స్కంధాలు వెలిగందల నారయ రచించారు. పోతన తక్కిన ఎనిమిది స్కంధాలు రచించాడు. పై విశ్వనాథ వారి వాదం నిలిచిన నిలవక పోయిన ఆయాకవుల కవితా లక్షణాలు స్పష్టంగా విదితమవుతాయని విశ్వనాథ వారి ప్రగాఢ విశ్వాసం. ఇందులోని పాత్రలు తండ్రి కేతన, పోతన అన్న తిప్పయ్యలను ప్రవేశ పెట్టి వారి సూక్ష్మమైన మనస్తత్వాలను స్పష్టంచేశారు. ఇంకా .ఆమె (గంగయతాత కూతురు) చేత భాగవత విషయాలను చక్కగా వ్యాఖ్యానింపజేశారు. నాటిక చివర సర్వజ్ఞ సింగభూపాలునికి ఈ కావ్యాన్ని అంకిత మివ్వమని పోతనను కవులుకోరగా

పోతన అంగీకరించడు. పైపెచ్చు ఇలాంటి మాటలు విన్నప్పుడెల్లా సరస్వతీదేవి కన్నీటితో కన్పిస్తుందని కాటుక కంటినీరు"....నమ్మ భారతీ" అని పోతన పద్యంతో విశ్వనాథవారు ఈనాటికను ముగించారు.

ఆరవనాటిక 'వసంతోత్సవం'. శ్రీకృష్ణదేవరాయలు భువన విజయం భవనం లో అష్టదిగ్గజ కవులతో పాటు ఇతర కవులు పరివేష్టించి ఉండగా కవితా సల్లాపం జరుపుతున్నట్లు, తిరుమలదేవి, చిన్నాదేవి మధ్య సంభాషణ కొనసాగినట్లు ఆయా కవుల కవిత్వ పటుత్వాన్ని వసుబంధు అనే వాడిచేత భువన విజయంలో జరుగుతూ ఉన్న కవితా కలాపాన్ని చెప్పించినట్లు వ్రాశారు. ఆ వెనుక తిరుమలదేవి, చిన్నా దేవి ఇద్దరు వసంతోద్యానవనంలో రాజుగార్ని కలుసుకుంటారు. వంది జయజయ ధ్వానాలతో నాటిక ముగుస్తుంది. ఇందులో రాణులిద్దరూ కవిత్వపు సొగసులను గుర్తించిన కళాహృదయలుగా విశ్వనాథవారు తీర్చిదిద్దారు.

ఏడవ నాటిక 'కనకాభిషేకం'. ఇందులో విజయరాఘవ నాయకుడి చేత రంగాజమ్మ కనకాభిషేకం చేయించుకున్న విషయాన్ని విశ్వనాథ వారు వివరిం చారు. ఈ నాటికను కేతినాయుడు, సూత్రధారుల చేతనడిపించారు. రంగాజమ్మ కవిత్వ కామనీయకాన్ని విశ్వనాథ వారు చక్కగా వివరించారు. అంతేగాక యక్ష గాన విశేషాలను, తత్సంబంధమైన సాంకేతిక పదాల్ని విశ్వనాథవారు మిక్కిలి మనోహరంగా గుదిగుచ్చారు.

ఇంతవరకు ప్రాచీనాంధ్ర సాహిత్యానికి సంబంధించిన నాటికలను ప్రస్తావిం చడం జరిగింది. నన్నయ నుంచి దక్షిణాంధ్ర యుగం దాకా ప్రాచీనాంధ్ర సాహి త్యంలోని వివిధ సాహిత్య ప్రక్రియలను ఆయాయుగాల్లో ఉత్తమ కవులవరివస్యను విశ్వనాథవారు సముచితరీతిని సద్విమర్శక శ్రేష్ఠుడుగా—తమ అభిప్రాయాలను అభి వ్యక్తీకరించి పదవగాహనకు అవకాశం కల్పించడం మనకు విదితమవుతుంది.

ఆధునికాంధ్ర సాహిత్య వైభవాన్ని తక్కిన మూడు నాటికల్లో చక్కగా వివరించి ఉత్తమ విమర్శకుడుగా నిరూపించుకొన్నారు.

ఎనిమిదో నాటిక 'నాటకోత్సవం'. ఇందులో నాటకోత్సవంలో వివిధ నాటక ప్రదర్శనలు జరుగుతుండగా గిరి, హరి అనే పాత్రలద్వారా తెలుగు నాటకాలకు సంబంధించిన సమస్త విషయాలను విశ్వనాథవారు వివరించి, ఇది వీరేశలింగయుగ మనీ ఆయన సంఘ సంస్కరణోద్యమంలో భాగంగా ఎన్ని అడ్డంకులెదురైనా విధవా వివాహాలు చేసిన మహనీయుడనీ, నవలలు, నాటకాలు, చక్కటి గద్యమూరచించిన ఆధునికాంధ్ర సాహిత్య నిర్మాత అనీ ప్రశంసించారు. అలాగే చిలకమర్తి ఉత్తమ నవలా కారుడనీ, ఆయన గయోపాఖ్యాన నాటకకర్త అనీ ప్రశంసించారు. ధర్మ వరం రామకృష్ణమాచార్యుల చిత్రనళీయం మొదలుకొని, వడ్డాది, బలిజేపల్లి, కొప్పరపు కొండ, వేదం, తిరుపతి వేంకట కవులు, పానుగంటి, కోలాచలం మొదలైన నాటకకర్తలను, ముప్పిడి జగ్గరాజు, పెడన సుబ్బయ్య, హరిప్రసాదరావు, ఉప్పు లూరి సంజీవరావు, ముంజులూరి కృష్ణారావు, బుర్రారాఘవరావు మొదలైన నటులు, గిడుగు వ్యావహారిక భాషావాద విషయమూ, ఇంకా వావికొలను, జనమంచి శేషాద్రి శర్మ, శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి కవులను, మనసాహిత్యాన్ని ఉద్ధరించిన నాగపూడి కుప్పుస్వామయ్య, తంజనగరపు తేవప్పెరు మాళ్ళయ్య, బ్రౌన్ పండితుడు - అనే వారిని పేర్కొనడం ఈ నాటికలోని విశేషాలలో విశేషం. అయితే విశ్వనాథవారు కొందరు ప్రముఖ నటుల్ని పేర్కొనకపోవడమూ, ఒకరి రచనను మరొకరిదిగా పేర్కొనడమూ ఇందులోని లోపాలుగా తోస్తాయి. మొదటిదైన నెరసు అంటే నటులకు నటుడు బళ్లారి రాఘవ ప్రశంస లేకపోవడం. ఇదైన మనం సమర్థించ దగ్గదే. కారణం, నెల్లూరి నగరాజారావు ప్రశంసతోపాటు మరికొందరు ఉత్తమ నటులు స్థానం, బందా, జి.వి. సుబ్బారావు, డి.వి. సుబ్బారావు మొదలైన వారు న్నారు. అంతేగాదు విశ్వనాథవారే 'హరి' అనే పాత్ర చేత పల్కించినట్లు ఇద్దరు కాదు రెండు వందలమంది నాటక కర్తలను, నటులను, కవులను మర్చిపోయినట్లు అనిపించారు గనుక ఈ విషయం మనం పట్టించుకోవలసిన పని లేదు. కానీ కోలా చలం శ్రీనివాసరావు కేవలం నాటకాల్ని రచించడమేగాక, వేదవేదాం గోపనిషత్తులపై బ్రహ్మాండమైన పరిశోధనలు చేశారనీ ప్రశంసించడం బాగుంది. కానీ వారు వ్రాసిన నాటకం శ్రీనివాస కల్యాణమనీ, ఆనాటకంలో శ్రీవారస్వామి అయ్యారుగారు వేష ధారి అనిపేర్కొన్నారు. ఇక్కడ గమనించవలసిన అంశం కోలాచలం శ్రీనివాస

రావు శ్రీనివాస కల్యాణమనే నాటకం రచించనేలేదు. ఈ పొరగు ఎలా పొర్లిందో తెలియదు. శ్రీనివాస కల్యాణ నాటకకర్త మైసూర్ మహారాజా విక్రమదేవ వర్మ.

తొమ్మిదో నాటిక 'ఆతిధ్యం'. ఇందులో ప్రధానంగా కనిపించే పాత్రలు మూడు : భావకవితా సరస్వతి ఆమె తమ్ముడు, అతిథి. వీరి సంభాషణల్లో ప్రధాన మైన సకలాంధ్ర భావకవుల గురించి వినిపిస్తాయి. ఆ అతిథి మీదుగా ఆతిధ్య మనే పేరు ఈ నాటికకు పెట్టారు. భావ కవితా సరస్వతి ఆతిధ్య మివ్వడానికి వచ్చినట్లు చెబుతుంది ఇందులో భావకవులందరిని విశ్వనాథవారు పేర్కొన్నారు. అందులో ఆయా భావకవుల అత్యుత్తమ కవితల్ని ఉదాహరించడం విశ్వనాథవారి సహృదయ తాముద్రకు చిహ్నం. కవయిత్రుల్లో విశ్వసుందరమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మమ్మ, సీతాదేవి పేర్కొనబడ్డారు. కాని ఇక్కడ రాయల సీమకవులెవరిని పేర్కొనకపోవడం వింతగా ఉంది. చివరికి తెలంగాణా కవులెంతోమంది ఉన్నారని చెప్పి, అభినవ పోతన్న వానమామలై వరదాచార్యుల్ని పేర్కొన్నారు.

ప్రస్తుతం ఇద్దరు మహాకవులు విశ్వనాథ, జాషువాల శతిజయంత్యుత్సవ సభలు జరుగుతున్నాయి గనుక విశ్వనాథ వారు జాషువా గురించి ఈ నాటికలో పాత్రలచేత పలికించిన మాటలు పేర్కోవడం ఎంతైనా సముచితం.

**అతిథి :** మరి హరిజనుల్లో ఎవ్వరూ లేరా ?

**తమ్ముడు :** ఓరినీకడుపుడకా ! ఎంత ప్రశ్న వేశావోయి ! లేరా అంటావూ? భావ కవితా తారాపథంలో ధగద్ధగాయ మానంగా వెలిగిన దివ్యతార ఉన్నాడోయ్ ఒకడు. అతని పేరు జాషువా. అతడు తెలుగుదేశాన్ని తన మధుర కవితాప్రవాహం చేత ఉర్రూతలూగించి వేశాడు.

**అతిథి :** అతని పద్యం ఒకటి చదువు.

**తమ్ముడు :** ఇదిగో 'శిశువు' అన్న శీర్షికలోని పద్యం.

బొటవ్రేల ముల్లోకములు చూచిలోలోన
నానందపడు నోరులేని యోగి

తల్లిదండ్రుల తనూ వల్లరీ ద్వయికి వ
న్నెయపెట్టు తొమ్మిదినెలల పంట
అమృతంబు విషమును వ్యత్యాస మెఱుగకా
స్వాదింప జను వెట్టి బాగులాడు
అనుభవించు కొలంది నిసుమడించుచు మరం
దము జాలు వారు చైతన్య ఫలము

భాషరాదు వట్టి పాలు మాత్రమే త్రాగు
నిద్రపోవు లేచి నిలువలేడు
ఎవ్వెరుంగ రితని దేదేశమో కాని
మొన్న మొన్న నిలకు మొలిచినాడు" అనిముగిస్తాడు

—చివరికి అతిథి ఇలా అంటాడు ... ...కానీ నాకొక్క అనుభవం ఉంది. వీళ్ళందరూ కవులే. చాలా బాగా వ్రాస్తారు. వీళ్ల కవిత్వం వ్రాసేటప్పుడు మహానుభావులుగాని లోకంలో ప్రవర్తించడంలో అందరివంటి వాళ్లే. వాళ్ల కవిత్వం వింటే మనమే మంచివాళ్ల మనిపిస్తుంది." అని చెప్పగా "ఎందుకులేరూ" అని "వ్యక్తిత్వమెంతగొప్పదో కవిత్వమూ అంతమంచిదైనకవి తుమ్మల సీతారామమూర్తి చౌదరి" అని సమాధానం తమ్ముడు చెప్పగా అతిథి మెచ్చుకొంటాడు. ఇది ఆధునికాంధ్ర కవిత్వంలోని భావ కవిత్వ మాధుర్యాన్ని ఆస్వాదించి, ఆస్వాదింపజేసిన ఉత్తమ విమర్శకులైన విశ్వనాథవారి తీర్పు.

ఇంక చిట్టచివరిది వచ్చేది అయిన నాటిక 'హేతువాదయుగం' అనేది. అభ్యుదయ కవులనేత శ్రీశ్రీ "ఆనందం అర్ణవమైతే; అనురాగం అంబరమైతే అనురాగపుటంచులుచూస్తాం; ఆనందపు లోతులు తీస్తాం" అనే గీతంతో ప్రారంభించి "మరో ప్రపంచం, మరో ప్రపంచం; మరో ప్రపంచం పిలిచిందిః పదండి ముందుకు పదండి తోసుకు అనే గీతంతో ముగించడం విశేషం. "ఈ క్రొత్త కవుల్లో ఒక్కడే మహాకవి. ఆయన పేరు శ్రీశ్రీ............ ఈ క్రొత్త కవితా యుగానికి హేతువాద యుగమని పేరుపెడితే, ఆ యుగం అతనిమీద నడుస్తున్నది" అని శ్రీశ్రీ ప్రాముఖ్యాన్ని వివరించి "అయితే శ్రీశ్రీ వంటి నవ్య కవిలో కూడ

అలంకారాలుంట వంటవా" ? అని ప్రశ్న లేవనెత్తి "అయ్యో! ఉన్నదే అతని కవిత్వంలో. శబ్దాలంకారాలని ఉంటవి. ఒకదాని పేరు వృత్త్యనుప్రాసము. ఈ వృత్త్యనుప్రాసము యొక్క ప్రాబల్యమే శ్రీ శ్రీ కవిత్వంలోని మొదటి సొగసు. అంత్యానుప్రాస కూడా ఒక శబ్దాలంకారం. అది లేకపోతే వీళ్ళ నడక లేదుగా! శ్రీ శ్రీ చంద్రవంకను చూచి కాళ్ళ తెగిన ఒంటరి ఒంటెలాగా ఉందన్నాడు. ఇది ఉపమాలంకారం. ఎట్లాంటిది ? మృచ్ఛకటికంలో నీటిలో మునిగి ఏనుగు ఎత్తిన రెండు దంతములవలె చంద్రవంక ఉందన్నాడే అంతగొప్ప ఉపమానం........" అని శ్రీశ్రీ ఉపమాలంకారానికి ప్రాచీన సాహిత్యంలోని మరో ప్రసిద్ధ ఉపమాలంకారంతో పోల్చి శ్రీశ్రీ కవితా గుణాన్ని మనసారా ప్రశంసించిన విశ్వనాథ సహృదయత మెచ్చదగింది. ఆ వెనుక శ్రీ శిష్టా, నారాయణబాబు, పురిపండా, ఆరుద్ర, పఠాభి, బెల్లంకొండ రామదాసు, అనిసెట్టి, బాలగంగాధరతిలక్, సోమసుందర్ అని పేర్కొని

హరి : అడక్క పోయినా చెబుతాను విను. ఈ విప్లవాన్ని బాగా సాధించినవాళ్ళు కొందరున్నారు.నుంకర,తుమ్మల వెంకట్రామయ్య, అవసరాల సూర్యారావు రెంటాల, రమణారెడ్డి, రాంషా మొదలైన వాళ్లు. ఇందులో తుమ్మల వెంకట్రామయ్య చాలా గడుసైన కవి. గొప్ప కవితాశక్తి కలవాడు. విప్లవాన్ని పరమ రమణీయంగా చెప్పకలవాడు, చక్కని పలుకుబడికలవాడు"

గిరి : అయితే అతని పాట ఒకటి వినిపించు.

హరి : చెల్లి....అని ఒక పాట వ్రాశాడు.

"చెల్లీ కన్నీరదేల ?
తల్లీ గద్గదమదేల ?
నీ నెచ్చెలి గుండెనుండి దూసుకున్న తుపాకి గుండ్ల
కఠిన కర్కశ విలయ ధ్వనిలో
నీ గాజుల మంజుల రావం
నీ కంకణ నిక్వాణం
నీ నవ్వుల చిరుమువ్వలు వినరావో? ఇకతల్లీ

ఈ శోకపు తెరవీడి పోయి
దానవ లోకం సమయునులే
నవలోకం ప్రభవించునులే
మానవ లోకం వెలయునులే
వగపేటికి తల్లీ వగబూనుము
నీ వగ తీరునులే చెల్లీ............
నీ వగతీరునులే చెల్లీ .. .... ...

"నిజం మాట్లాడాలంటే తుమ్మల వెంకట్రామయ్యే అచ్చమైన తెలుగుకవి. ఇతరులు వ్రాస్తారు. శబ్దాలంకారాలుంటవి. ఫిరంగి ధాంకారాలుంటవి. పాశ్చాత్యుల కవిత్వాలలోని కవి సమయాలుంటవి. ఇతని కవిత్వములో అచ్చమైన తెనుగు తనముంటుంది. యథార్థమైన విప్లవ భావముంటుంది." అని మిక్కిలి ప్రశంసించిన తీరు గమనించదగ్గ అంశం, సహృదయ రంజకం.

ఇంకా ఇతరమైన కవితారీతుల్ని ప్రస్తావించారు. అందులో సంపత్, వుట్టపర్తి మొదలైన కవుల్ని, సినారె మొదలైన వారిని పేర్కొన్నారు.

ఆ వెనుక కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి హేతువాద యుగానికి మూలపురుషుడనీ, సూత పురాణాన్ని కీర్తిస్తూ

"శ్రోత్రియ వరుడైన సోమయాజులు సాని
కొంపతల్పులు చేత కొట్టుచుండ
వీరగంధము తోడ పెనగిపూనిన మల్లు
సానివాడ పచారు సల్పుచుండ
యజ్ఞయాగాదుల - ఆచరించిన యోగి
రోపదంతుల ఇండ్లు రోయుచుండ
నిద్రించి తపములో నెగ్గిన జటిలుండు
బొజుగుబోటుల కౌజుపొంతనుండ

జాడ తెలియక జడదారి తారుచుండ
కొంచె తెరగంటి కన్నీడన్ గొట్టు చుండ
నలువు కాడగ్గై వెడనవ్వు నవ్వుచుండ
నల్ల కల్లోల మైపోయె నాకపురము"

"ఆయన పద్య రచనాశైలి అంత మనకంగా ఉంటుంది. భావాలన్నీ పురాణాలకు వ్యతిరేకం. మొదట విప్లవం తెచ్చింది ఆయన. ఈ విప్లవ వాదులు నిజంగా విప్లవవాదులైతే ఆయనకొక శిలా ప్రతిమ వేయవలె" అని పలికిస్తారు విశ్వనాథ. ఇలా కొనసాగుతుంది విశ్వనాథవారి సహృదయ విమర్శ.

ఈ చివరి నాటికలో విశ్వనాథ చక్కటి విమర్శను గుర్తించగలము. ఇందులో ప్రముఖంగా మనం గమనించవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి. సమకాలిక కవులలో కొందరంటే విశ్వనాథకు పడదన్న అపోహ కొందరిలో ఉంది. కానీ ఈపై నాటికల్లో ప్రముఖంగా ఈ హేతువాద యుగంలోవిశ్వనాథ హృదయం ఆవిష్కృతం కావడంవల్ల ఆ అపోహలకు అవకాశం లేకుండా పోయిందని స్పష్టమవుతుంది. మొదటి అంశం; పూర్వోక్తమైనట్లు ఈనాటి శ్రీశ్రీ "ఆనందం అర్ణవమైతే" అనే గేయంతో ప్రారంభమై "మరో ప్రపంచం, మరో ప్రపంచం పిలిచింది"తో ముగియడం. అంతటితో ఆగక శ్రీశ్రీ కవితా గుణాల ప్రశంసజేయడం- రెండోది: జాషువాను స్మరించి ఆయన సర్వోత్తమ కావ్యఖండిక 'శిశువు' పద్యాల్ని పేర్కొవడం. మూడు: జీవితమూ, కవిత్వమూ రెండూ ఒకటిగా నిరూపించుకొన్న తుమ్మల సీతారామమూర్తిగారిని ఉదాహరించడం, నాల్గు : నిజమైన విప్లవ కవి తుమ్మల వెంకట్రామయ్య అని అతని కవితలో తెలుగుదనముట్టిపడుతుందని ప్రశంసించి, 'చెల్లీ కన్నీరదేల' అనే కవితను ఉదాహరించటం. ఐదు : వీటన్నిటినీ మించి 'నిజమైన భావవిప్లవకారుడు త్రిపురనేని రామస్వామి చౌదరి' అని పేర్కొని 'ఈ విప్లవవాదులు నిజంగా విప్లవవాదులైతే ఆయనకొక శిలాప్రతిమ వేయవలె' అని పల్కించడం! వీటిద్వారా విశ్వనాథవారి హృదయం విదితమవుతుంది.

ఇలాంటి విశ్వనాథ హృదయావిష్కరణ సమర్థమైన తెలుగు సాహిత్యేతి వృత్త ప్రధానాలైన ఈ పది నాటికలు త్వరలో అచ్చు పడవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

# జాషువా కవితాత్మ

'రాజు మరణించె నొక తార రాలిపోయె
కవియు మరణించె నొకతార గగనమెక్కె
రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు'
'రాజు చేతికత్తి రక్తంబు వర్షించు
సుకవి చేతి కలము సుధలు గురియు
అత డేలగలుగు యావత్ప్రపంచంబు
నీత డేల గలుగు నిహము పరము' (కొత్తలోకము-2)

—ఇవి మహాకవి జాషువా వాక్కులు. మహా కవికి మరణం లేదు. కలంతో సుధలు గురిపించే ఆ మహాకవి అమరుడు. ఉల్కాపాతమైనప్పుడు ఎవరో మహా వ్యక్తి జీవితం ముగిసిందని భావిస్తాము. అలాగే రాజు మరణిస్తే నక్షత్రం రాలి పోవచ్చుగాక. కానీ కవి మరణిస్తే కవిత్వ జగత్తులో ఆ కవి సంపాదించిన యశః కాయంతో చిరకాలం ఆకాశంలో ధ్రువతారలా నిలిచి ఉంటాడు. రాజుగారు చేసిన ఘనకార్యాలకు రాతి విగ్రహమో, కాంశ్య విగ్రహమో, భూమిమీద నిలిచిపోవచ్చు. కానీ మహాకవి వాక్కు ప్రజలలో జీవిస్తుంది. రాజు చేతి కత్తి కంటే కవి చేతి కలం గొప్పది. కత్తి రక్తం చిందుతుంది; కవి కలం అమృతం గురుస్తుంది. అందుకే "సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్" అనే ఆభాణకం వచ్చింది.

నవయుగ కవి చక్రవర్తి జాషువా గురిపించిన కవితాసుధ మన మీనాడు గ్రోలు తున్నాము. ఏనాటికైనా అది అలా తాజాగా, పసందుగా విందు చేయగలదు. జాషువా తాను పుట్టిపెరిగిన సమాజంలో తాననుభవించిన అనుభవాల మూలంగ తన కవితాసుధ గురిపించారు. అవి సుధలేగాని; అవి వాడిగా, వేడిగా, ఉండి, ప్రజలను జాగృతం చేయజాలినవిగా ఉండడం విశేషం. తాను దారిద్ర్యంలో పుట్టి పెరిగి తదనుభూతిని పొంది ఉన్నాడు. దారిద్ర్యానికి తోడు అస్పృశ్యతా రాక్షసి కోరలకు

ఎరలవుతూన్న తోటి ప్రజలను చూసి, ఎదరగిలి, తన మాటలు కవితలయ్యాయి. అనాటి సాంఘికార్థిక అసమానతల్ని చూసి భరించలేకపోయాడు. వర్ణవ్యవస్థలో ఉన్న లొసగును గుర్తించాడు. ఆర్తి చెందాడు; ఆవేదన చెందాడు: ఆర్తి కవితగా మారింది. తన హృదయాన్ని ఆవిష్కరించాడు మధుర కవితలో. వర్ణ వ్యవస్థపై తిరుగుబాటుచేసి దారిద్ర్యమొక పక్క, అస్పృశ్యత మరోపక్కా పీడిస్తూ ఉంటే తట్టుకోలేకపోయాడు. సంప్రదాయరీతిలో తాను చదివి తెలుసుకొన్నవాటిపై విప్లవించాడు. తన విప్లవం ఎవరికీ ఏనాడు బాధ కలిగించలేదు: సరిగదా ! తన మాటలతో సంప్రదాయబద్ధుల్ని నిలదీసి అడిగినప్పుడు వారు సైతం తల ఊపక పోలేదు ఇలాగని దుయ్యబట్టడం,ఎండగట్టడం -అనేవి జాషువాలక్ష్యం తనప్రజలబాధ ప్రచారంకోసం కాదు. హృదయపు కోశను కవితద్వారా ఆవిష్కరించడమే ముఖ్యం. తనబాధ, తన ప్రజల స్పందనతనస్పందనతనవారికందరికీ తాను ప్రతినిధి విప్లవం జాషువాఅంతమాత్రంచేత కేవలం తన ఆవేదనని మాత్రం చెప్పడం కాదు. లలిత సౌకుమార్యాలతో, మధుర మోహనంగా ఆవిష్కరించడమే జాషువా కవితా విశిష్టత. అనల్పకల్పనా వైభవంతో జాషువా కవితా వధూటి పరపళ్లు తొక్కినా, శిల్ప సౌందర్యంతో, సహజ వైవిధ్యంతో ఒప్పారడమేదాని నైజ స్వరూపం.సమాజంలో ఒక భాగమైన పంచములను అస్పృశ్యులుగా భావించి అలా పరిగణించడం సభ్య సమాజానికి మాయని మచ్చ. నాగరిక జాతిలోవిఅనాగరిక లక్షణం-అట్టడుగు బడుగు జీవులను అణచిపెట్టడం అన్యాయం: అమానుషం. అందుకే అస్పృశ్యతను తొల గించి మానవతా దృక్పథంతో, అందరూ సమానులనే అంశాన్ని గ్రహించి సమ సమాజం- హెచ్చు తగ్గులులేని సమాజం స్థాపించడమే జాషువా కోరుకున్న మహో త్తరమైన కోరిక; అది వారి మానవతా దృక్పథం.

ఏవంవిధ గుణవిశిష్టమైన జాషువా కవితా కామనీయకం, అభివ్యక్తి, శబ్దభావ చిత్ర కవితా వైవిధ్యం ప్రప్రథమంగా ఆస్వాదయోగ్యాలు. జాషువా కవితలో భావుకత భవ్యమూ నవ్యమే గాదు హృద్యం గూడా! భావుకత అనల్ప కల్పనా శిల్పవైభవంతో ఒప్పారుతూంది. భావుకతకు తగ్గభావన, భావనను అభివ్యక్తీ కరించే భాష సహజ సుందరమై, అనన్య సామాన్యమై ఒప్పారుతుంటాయి.తద్వారా జాషువా వర్ణనా వైదగ్ధ్యం స్పష్టమవుతుంది.

సంజకెంజాయలో జలకంలు, సవరించి
పజతెంచు సూర్య బింబమ్ములోన,
పదునాఱు దినముల పరువు వచ్చిన నాటి
చంద్రుని ధవళ హాసముల లోన,
పూల తోటల తోడ ముద్దు ముచ్చట చెప్పి
చెఱలాడు మొలక తెమ్మెరలలోన,
నీలి మేఘంబుల నెఱియలలోఁ గుల్కి,
పరువెత్తు మెఱపు గర్భములలోన,
హాయిగా బవ్వళించి బ్రహ్మాండములను
బల్కరించుచు నున్న దివ్య స్వరూప!
హృదయమును జీల్చి పూజలర్పించు కొందు
నందుకొని పొమ్ము, వ్యవధి లేదనక రమ్ము' (ఫిరదౌసి. పు. 23)

అద్భుతవర్ణన; అనన్య సామాన్యమా భావుకత; అభివ్యక్తి అనితరసాధ్యం! భావం, భావన, భాష మూడు ముప్పిరిగొన్నాయి. ఆ మహాకవి ప్రతిభా పాటవానికి ఇంత కంటే నిదర్శనమవసరమా ? ఉదయిస్తూన్న సూర్యబింబంలో, రాకా సుధాకరునిలో, పూలపరిమళాల్లో, చెరలాడుతూన్న పిల్లగాడ్పుల్లో, కారుమేఘాల్లో తళుక్కున మెరిసిపోయే సౌదామినిలో హాయిగా పవ్వళించిఉన్నాడటదివ్యస్వరూపుడైనపరమాత్మ జాషువా కవిత్వ మహత్వం స్పష్టమవుతుంది. సంజకెంజాయలో సూర్యుడు జలక మాడాడట! పదహారు కళలతో సంపూర్ణుడైన పున్నమినాటి చంద్రుని తెల్లని వెన్నెలట!పూలతోటలో ముద్దుముచ్చటలాడి విహరిస్తున్న మొలక తెమ్మెరలట ! నీలి మేఘాల్లోని నెరియల్లో కులికి పరిగెత్తే మెరపట ! ఇంత నూతనంగా, అపూర్వంగా అభివ్యక్తీకరించిన కవులెందరు గలరు ? పైగా సీసపద్య రచనలోని నడక, తూగు, ఒయ్యారం; అంతకుమించి ప్రతిపాద పమతా వైభవం మొదలైన అంశాల గూర్చి ఎంతని వర్ణిస్తే మనం సంపూర్ణంగా జాషువాకు న్యాయం చేకూర్చ గలము ?

ఇలాగే ముంతాజ్ షాజహాన్ల దాంపత్య జీవితంలోని పరమ మధుర ప్రణయాన్ని వ్యతిరేక భావపై విద్య వ్యక్తీకరణతో మనోహరంగా వర్ణించిన తీరు అనితర సాధ్యం.

'ఆ సతీ పతుల గాఢాశ్లేషముల నుండి
జారిపోయిన నిమేషంబు లేదు,
ఆ దంపతులకు ఆహ్లాదంబు గూర్చక
తొలగిన వెన్నెల తునక లేదు,
ఆ ప్రేమజీవుల ఋసువాగ వృద్ధికై
రుత మొనర్పని పరభృతము లేదు,
ఆ శుభాకృతుల సౌఖ్యంపు ముద్దులచేత
తీపిసెక్కని ద్రాక్ష తీగ లేదు,

అవధిలేని వారి ఆనంద కేళికి
తోడుపడని పూలతోటలేదు
వారి కూర్మిపెంపు వలచి వర్ణన చేసి
సుప్రసిద్ధి గనని సుకవి లేదు' (ముంతాజ్ మహల్)

చివరికి నవయుగ కవి చక్రవర్తి జాషువాసైతం వారి ప్రణయాన్ని వర్ణించి సుకవిగా సుప్రసిద్ధుడయ్యాడు.

భావ నవ్యతను వ్యక్తీకరించే అభివ్యక్తిలోని నవ్యాతి నవ్యత పరిశీలిస్తే జాషువా పదప్రయోగ వైశిష్ట్యం స్పష్టమవుతుంది. ఒలికిపోయిన పండు వెన్నెలల పాలు క్రోలుచున్నది కుపితచకోరకంబు; సీమ గుడ్డకు కన్నులు చెమ్మగిల్లె; ముతకబట్టకు మర్యాద పొటమరించె; సాత్వికాహారిణీ తపశ్చర్య కతననీ మనంబున జాలివెన్నెలరహించు (గబ్బిలం)—

ఇలాగే ఫిరదౌసి కావ్యంలో ఫిరదౌసి ఆవేదనను, బాధను ప్రకృతితో సమ్మిళిత మొనర్చి వర్ణించిన తీరు అమోఘం.

"తన కళ్యాణీయుఁ గూతురన్ జటుల కాంతారంబులం బాద చా
రిణులై వచ్చుటఁ జూడఁ జాలక కవి శ్రేష్ఠుండు వర్షించు వె
చ్చని కన్నీటికిఁ గారణంబగు మహీశమ్మన్యునిం బండ్లు నూ
రిన యట్లంబరవీథియం దురిమి యార్చెం గర్భిణీ మేఘముల్

—వర్షించు వెచ్చని కన్నీరు, పండ్లు నూరినట్లురిమి యార్చడం, గర్భిణీ మేఘముల్' అనే ప్రయోగాలలోని అభివ్యక్తి విశిష్టమైంది.

పూర్వోక్తమైనట్లు సాంఘికార్థిక అసమానత వల్ల అస్పృశ్యతా రాక్షసి కోరల్లో నలిగిపోయిన జాషువా నాటి సమాజంలో వర్ణ వ్యవస్థ మీద కోపోద్రిక్తుడైన మాట వాస్తవం! నిజానికి తనకోపతాపాల్ని యితరులకు బాధ కలిగించేలా కాక విన్నవెంటనే నిజమేనని ఆలోచింపచేసే తీరులో కవిత్వమనే ఆయుధాన్ని ప్రయోగించి సమాజ రుగ్మతల్ని నరకడానికి యత్నించాడు- గాంధీజీ దక్షిణాఫ్రికాలో మొదటి తరగతి టిక్కెటు కొన్నప్పటికి తెల్లదొరల జాతి వివక్షకు గురియైనందున తిరుగుబాటు చేసి 'మహాత్మ' అయ్యాడు. అంబేద్కర్ కులం తక్కువని పెట్టె బేడ వీధిలోకి గిరాటు వేయబడి నెట్టివేయబడటంతో, పట్టుదలతో మహావేత్త కాగలగి కులవ్యవస్థను నిర్మూలించ నడుముకట్టి మహామేధావి అయ్యాడు. అలానే కులం తక్కువని తన కవితను ఈసడించుకోగా, జాషువా కవితకు కులంలేదని నిరూపించడానికి "గబ్బిలం" మొదలైన ఉత్తమ కవితలల్లి మహాకవిగా, నవయుగ కవిచక్రవర్తిగా ప్రసిద్ధికెక్కాడు. కులమన్నది మానవ కల్పితము- చతుర్వర్ణాలు వృత్తిని బట్టి వచ్చినవే. కాని స్వార్థపరులు దీనినుపయోగించుకొన్నారు. మానవులంతా పుట్టుకతో ఒక్కటే. కాని సమాజంలో తక్కువచేసి పంచములని వేలెత్తి చూపుతూ, అణచివేయగా సహించలేని జాషువా హృదయం రగిలింది-

'ముసలి వాడైన బ్రహ్మకు పుట్టినారు
నల్వురు కుమారులను మాట విన్నాముగాని
పసరము కన్న హీను డభాగ్యుడైన
ఐదవ కులస్థుడెవరమ్మా సవిత్రి? (ఖండకావ్యం-2)

ఈ నాలుగు వర్ణాలు నాలుగు పడగలట: ఆ నాలుగు పడగల నాగరాజు పంచముని జూచికాదు, వాని గాలిసోకితేనే కసరి బుస కొట్టుతుందట!

'అయభాగ్యుని రక్తంబు నాహరించి
యినుపగజ్జల తల్లి జీవనము సేయు
కసరి బుసకొట్టు నాతని గాలిసోక
నాల్గుపడగల హైందవ నాగరాజు' —

నిమ్నజాతులన్నీ జాగృతమై చైతన్యవంత మవుతున్నాయనీ ఇది చాలా విపత్కర పరిస్థితిని కల్పిస్తుందనీ భావించి తన్నివారణార్థం మహాత్ముడు జన్మించాడని వివరించారు జాషువా -

'నిమ్నజాతుల కన్నీటి నీరదములు
పిడుగులై దేశమును గాల్చివేయుననుచు
రాట్నమును దుద్దుకఱ్ఱకరాన బూని
దెసలదోలెంచె గుజరాతు ముసలి సెట్టి' (గబ్బిలం-54)

పంచముల కన్నీరనే మేఘాలు, పిడుగుల్లా దేశ నాశనానికి కారణమవుతాయని, తన్నివారణార్థమే అహింసామూర్తి మహాత్మ జన్మించాడని వివరించడం సముచితమే.

అభాగ్యుడైనఅస్పృశ్యునివేదనజాషువావేదన.ప్రశాంతరాత్రిలోకాన్నంతటిని బుజ్జగించి నిద్రపుచ్చుకొందట! కానీ అంటరాని తనను దురదృష్టవశాన "ఔషధంబు లేని యస్పృశ్యతా జాడ్య/ మందభాగ్యునన్ను మఱచిపోయె"నని వాపోతాడు- ఈలాంటి తనకు భార్యవల్ల కలిగే సంతానాన్ని మళ్లీ ఈ అస్పృశ్యతా కూపంలోనే పడదోయడం సముచితంగాదని బ్రహ్మచర్య దీక్షబూనిన ఉత్తముడు-

"కులములేని నేను కొడుకులం బుట్టించి
యీయభాత మందె త్రోయవలెనె ?
భార్య యేల పుట్టు బానిస కని వాడు
జరుపసాగె బ్రహ్మచర్య దీక్ష" —

ఇందులో మనం గమనించవలసిన జాషువా ఔన్నత్యం, విదితమవుతుంది. అంటరానితనం వల్ల అణగారిపోతూన్న సోదరుల దుస్థితిని చూసి ఎవరిపైనా కక్ష సాధించలేదు; పైగా సామాజిక రుగ్మత అయిన అంటరానితనం నిర్మూలనానికి మేధావులు ఆలోచించి ఆచరించవలసిన అవసరాన్ని వివరించాడుజాషువా మహాకవి-

"కర్మ సిద్ధాంతమున నోరుకట్టివేసి
స్వార్థలోలురు నాభుక్తి ననుభవింత్రు
కర్మమననేమొ ? దాని కీ కక్షయేమొ ?
ఈశ్వరుని చేత బుజావు చేయించవమ్మ"—అనిమాత్రమే గర్విలం

తో అడుగుమని మనవి చేసుకొంటున్నారీ మహాకవి -

నిరుపేదల బాధల గూర్చి, ఆ పేదలు అనుభవించే దారిద్ర్యాన్ని గూర్చి పలు విధాలుగా జాషువా హృదయం ఆక్రోసించింది. భగవంతుని నిలదీసి అడుగుతున్నాడు, నీకేల వలపక్షపాతమని. సమస్త ప్రాణికోటిని మృత్యువునకాహారం చేశావు గదా ! మరి అలాంటి దయా పరుడవైన నీవు నిరుపేదకు బొక్కెడు కూడొసంగ లేకపోయావా ? అని జాషువా మానవతా దృక్పథంతో పలికిస్తున్నాడు.

"బత్తెము చేసినావుగద ప్రాణులనెల్ల దయా విహీనమౌ
మిత్తికి, హాయిగా సకల మేదిని మీద నిరంకుశంబుగా
పెత్తన మాచరించెడి నిరుపేదకు బొక్కెడు కూడొసంగ నీ
చిత్తము సమ్మతింపదొ ? విచిత్రము నీ వల పక్షపాతముల్"
(కొత్తలోకము-40)

తిన తిండిలేక ఎండిపోతున్న, అలమటించిపోతున్న బీదలపాట్లు గమనించి సంపన్నులెవరూ మెతుకు విదల్చలేదనీ, విగ్రహాలకు సింహాసనాలనీ, ఇంకొకటనీ పేరుపెట్టి వాటిని ఆరాధిస్తూ ఎంతైనా ధనవ్యయం చేయగల సంపన్నులీ భారతీయులని, ముప్పది మూడు కోట్లదేవత లెగబడ్డ ఈ దేశంలో దురదృష్టవంతులు పేదల ఆకలి చల్లారుతుందా? అని హేతువాద పురస్సరంగా మానవతా దృక్పథంతో ఆ వేదన వక్కాణీ మహాకవి-

"ప్రతిమల పెండ్లి చేయుటకు వందలు వేలు వ్యయించుగాని దుః
ఖిత మతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్ప దీ భరతమేదిని; ముప్పదిమూడు కోట్ల దే
వత లెగబడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తులారునే ?"

(గబ్బిలము-16)

ఆధునిక యుగంలో మహిళాభ్యుదయానికి పాటుబడ్డ మహనీయులెందరో వెలిశారు. మనదేశంలో-రాజారామ్మోహన్‌రాయ్, కందుకూరి వీరేశలింగంపంతులు, గురజాడ అప్పారావు ప్రభృతులు పేర్కొనదగ్గవారు. జాషువా సైతం మహిళలకు పురుషాధిపత్యం వల్ల నైతేనేమి, పురుషాహంకారం వల్లనైతేనేమి జరిగే అన్యాయాలను ఖండించినారు. స్త్రీల పట్ల చూపించే వివక్షను నిరసించారు. స్త్రీ అబల కాదనీ, సబల అనీ నిరూపించుకోవాలని ప్రబోధించారు. పురుషాధిపత్యాన్ని విడనాడి సమాన గౌరవంతో సత్కరించినపుడే మానవుని మనుగడ మహోన్నతం కాగలదని విషణ్ణ హృదయంతో వివరించారు.

"స్త్రీకన్నన్ బురుషుండు శ్రేష్ఠతనుచున్ సిద్ధాంతముల్ చేసి తా
టాకుల్ కంఠమునెత్తి స్త్రీ జగతి కన్యాయంబు గావించె నో
యేకాలంబున పుట్టి నింటయిన లేక నాటి స్వాతంత్ర్యముల్
స్త్రీ, కీమారు సమాన గౌరవ విభూతిన్ గాంతకుం గూర్చుమా!

(కొత్తలోకం-26)

ఇలాంటి దుస్థితినుంచి, పురుషాధిపత్యానికి లోనుగాకుండ సర్వతంత్ర స్వతంత్ర కావాలని మహిళకు ప్రబోధం చేశాడు.

అమ్మా! భారతనారి ! నీ కడుపునం దావిర్భవం బంది, నీ
యెమ్మెల్ బిండి సుఖించు పురుషుల నింకెన్నాళ్ళు సేవించి, కా
ల మ్మున్ వ్యర్థము చేసి కొందువు ? కరాళ స్వార్థ ధర్మాలలో
గమ్మత్తున్ గనిపెట్టి స్త్రీ జగము దుఃఖంబు న్నివారింపుమా !"

(వంచిత-ఖండకావ్యం-5వభాగం)

వలపుల రాణిగా, చిలుక పలుకుల వాణిగా, స్త్రీని పొగడి, ఆకాశానికెత్తి, తమ పబ్బం తీర్చుకొంటారు పురుషులన్నీ, నీతసుమానసాలను బాధించి, వేదించి నీకేదో ఉపకారం చేసినట్లు భావిస్తారు పురుష పుంగవులనీ, ఈ మోసాలకు లోనుకావద్దనీ ఎన్నాళ్లో కుహనాహర్షాలనీ, వ్యథాభరిత మనస్సుతో వాపోతారు జాషువా మహాకవి.

నిన్నాకాశము దాకగా బొగడుచున్ నీయంద చందాలలో
వన్నెల్ దీర్చి కవిత్వ మల్లుకొనుచున్ పైపై పరామర్శలన్
నిన్నున్ నీదు శరీరమున్ హృదయమున్ ఛేదించి, వేదించి యుం
తన్నం బుం బడవేయు సంఘమును భిక్షా! యెట్లు హర్షింతువో"

(వంచిత-ఖండకావ్యం-6వభాగం)

మహిళా మాన్యతను పలురీతుల తమ కవితల్లో వర్ణించి తరించినవారు జాషువా: ముంతాజ్ మహల్ కావ్యంలో, అనాథలో, స్వప్నకథలో స్త్రీని వివిధ విధాల అంటే, మహోన్నత వ్యక్తిగా, నిరుపేదగా, అనాథగా ఎంతో ఉన్నత స్థితిని, ఎంతో హీనదీనస్థితిని చూపించి, విస్పష్టంగా అభివర్ణించినారు. కానీ తన సతీమణి మరియమ్మ మరణంతో అనంత దుఃఖసాగరంలో మునిగిపోయిన జాషువా భార్యలో తల్లిని చూడగలిగిన మహాత్ముడు.

నాతనుయష్టి ప్రత్యణువునన్ గల పుష్టికి కారణంబు నీ
చేతి సుధాశనంబికద ? చిక్కెనె నా కనరాదుగాని, నా
మాతకు మారుగా, యనుగు మానిని రూపముదాల్చి నట్టి నా
జాతక పుణ్యరేఖ వౌ ప్రశస్తి శుభైక వర ప్రదాత్రివో"

(ఋణవిముక్తి — కొత్త లోకం)

వీరోచితగాథలను ఉగ్గుబాలతో బోధించి మంచి పౌరులను తయారు చేయ వలసిన ఉత్తమ మాతలు కావాలని, పిరికి మందు పోసి పాడు చేసే దుష్టమాతలను జాషువా దుయ్యబట్టారు.

"బూచుల జూపి బాలకుల పాపమనస్సుల మోసులెత్తు వీ
రోచిత ధీరభావముల యుబ్బులడంపుట చేత, ధీరతా

నీచ గుణంబు లేర్పడుట నేరరు కొందరు తల్లు: లిట్టి పై
దాచిక వత్సలత్వములు జాతికి తీరని వజ్రఘాతముల్"—

దీని కంతటికీ కారణం స్త్రీలకు విద్యాబుద్ధులు లేకపోవడమేనని, అబలలనీ అణచి వేయబడ్డ మహిళలు సబలలని నిరూపించుకోవాలని ఏనాడో జాషువా మహాకవి ప్రబోధించారు.

"అబలయన్న బిరుద మంటించి, కాంతల
స్వీయ శక్తులదిమి పిదిమినారు
సబలయన్న బిరుదు సాధించి హక్కులు
గడన చేసి కొమ్ము కష్టచరిత !"

వాంఛించిన రీతిగానే ఈనాడు అన్ని రంగాల్లోను మహిళ పురుషులతో సమానంగా వెలుగుతూంది. ఇది మరింత మహోన్నతమైనప్పుడే జాషువా కవి ఆకాంక్ష నెరవేరినట్లు !

సామాన్యమైన మానవుడుగా పుట్టి అసమాన్యుడై మాన్యుడై, విశ్వనరుడు దాకా ఎదిగిన మహామనీషి జాషువా ! ఆ మహనీయుని కవితా సుమాలన్నిటా వారి కవితాత్మ నినదిస్తూంది, పరిమళిస్తూంది! విశ్వనరుడై వసుధైక కుటుంబాన్ని ఆశించిన ఆ మహాకవి ఇలా తమ హృదయాన్ని ఆవిష్కరించారు.

"ఆలు బిడ్డలకునై యాస్తిపాస్తులు గూర్ప
పెదత్రోవలో పాదమిడను నేను" అని తమ ఋజుమార్గాన్ని తెలిపి,

"నే నాచరించని నీతులు బోధించి
రానిరాగము తీయలేనునేను" అని తాము చెప్పినది ఆచరిస్తామనీ, తామాచరించలేని- లోకరీతులు, నీతులు బోధించమనీ, రాని రాగాన్ని తీయమనీ స్పష్టం చేశారు—

"సకల కార్మిక సమాజముల జీవితకథా-
నకము లాలించు కర్ణములునావి" అని కర్షక కార్మిక

లోకాభ్యుదయమాశించిన అభ్యుదయవాదులు జాషువా ! ఆ విశ్వనరుని హృదయం మీ పద్యంలో సువిదిత మవుతుంది.

"అంగనామణుల దాస్య క్రూరబంధముల్
చిక్కుముల్ చేయార వ్రక్కలించి
అంటరాని తనంపుటడుసులో దిగబడ్డ
యనుజాల దుఃఖంబు న పనయించి
నవ్య భారత సుధా నగరంబు లోజిచ్చు
దరికొల్పు ప్రబల శాత్రవుల నణచి,
ప్రేమ సంగతమైన విద్యార్థి జగమున
నగ్న భావావేశనదులు మలిపి,
సౌఖ్య సౌరభంబు సర్వభూములు నిండ
పాడుకొందు; దిశలనాడు కొందు
నిఖిల భువనమెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు, విశ్వనరుడనేను।" (ఖండకావ్యం-5భాగం)

ఆ విశ్వనరుడైన నవయుగకవి చక్రవర్తి జాషువా శతజయంత్యుత్సవ సమయంలో నా పలుకుల నీరాజనా లర్పిస్తున్నాను.

## జాషువా - మహిళ

ఈనాడు 'దళిత, స్త్రీవాద' శబ్దాలు బహుధా వినిపిస్తున్నాయి. దళితసాహిత్యం, స్త్రీవాద సాహిత్యం ప్రముఖంగా ప్రాధాన్యం వహిస్తున్నాయి. సరిగ్గా ఇవేమాటలు వాడకపోయినా జాషువా సాహిత్యంలో వీటికత్యంత ప్రాధాన్యముందన్న విషయం విజ్ఞులకు తెలిసిందే. అట్టడుగు జీవితాల హీనదీన స్థితిని గాంచి మనసున ముసిరిన ఆవేదనను, ఆర్తినీ కవిత్వ రూపంతో జాషువా మనకందించిపోయారు. దారిద్ర్యం, అంటరానితనం, ఆర్థిక అసమానతలు, వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ, కర్మసిద్ధాంతాలు

— వీటన్నింటితో సతమతమయ్యే తాను, తన సోదరులను చూసి, తిరుగుబాటుచేసి వ్యవస్థను నిలదీసి ప్రశ్నించారు జాషువా. అయితే ఇదంతా ఆలజడివల్లాగాని, నినాదాలవల్లగాని చేయలేదు. మృదుమధుర పదజాలంతో, చక్కటి సరళమైన శైలీవిన్యాసంతో, ప్రతిభాపాటవాలతో కమనీయ కవితగా రూపొందించిన ఘనత జాషువాకు దక్కింది.

ఇదేరీతిలో ఈ సమాజం మహిళపట్ల ఏమేరకు తన ధర్మాన్ని నెరవేర్చిందో స్పష్టంగా గమనించి, సముచితరీతిని స్త్రీపట్ల గౌరవాదరాలను ప్రకటించి, వీరోచిత మహిళలకు నీరాజనాలు పల్కుతూ, దగాపడ్డ స్త్రీలను సముచితరీతిని ప్రబోధించి కవిగా తనవంతు ధర్మాన్ని నెరవేర్చుకొన్నారు జాషువా. భారతదేశంలో పురుషుడి కున్న స్వేచ్ఛ స్త్రీకి లేకపోవడంవల్ల, పురుషాహంకారం. పురుషాధిక్యత మూలంగా స్త్రీ అణచివేయబడ్డరీతిని బహు విధాల వివరించి, స్త్రీకి పురుషుడితో సమానత్వం కావాలనీ, సాధించిననాడే సమానగౌరవంతో స్త్రీకి సరైన న్యాయం చేకూరగలదని ఎంతగానో, తనవాదాన్ని కమనీయ కవితా స్వరూపంతో నిరూపించిన మహాదార్శనిక కవి జాషువా !

ఈ సందర్భంలో జాషువా మహిళ కిచ్చిన మాన్యతను, మన్ననను ముచ్చటించుకోవడం ద్వారా, జాషువా కవితాత్మను గ్రహించగలమని భావిస్తున్నాను, అందుకే—

"అంగనా మణుల దాస్య క్రూర బంధముల్
చిక్కముల్ చేయార వ్రక్కలించి,
అంటరాని తనంపు టడసులో దిగబడ్డ
యనుజాల దుఃఖంబు నపనయించి

........ ..........................

సౌఖ్య సౌరభంబు సర్వభూములు నిండ
పాడుకొందు; దిశలనాడు కొందు" నని జాషువా ప్రతిన. మహిళాభ్యుదయ సాధనకై యత్నించిన జాషువా అత్యుత్తమ మానవతావాది..

మన ప్రాచీన సాహిత్యంలో స్త్రీ హృదయ సౌందర్యాన్ని కాక, బాహిరమైన నఖశిఖ పర్యంత వర్ణన సర్వోపమల సాయంతో చేయడం పరిపాటి. ఇది సర్వ జన విదితమే. అలాంటి వర్ణనా సైదగ్ధ్యానికై యత్నించలేదు జాషువా! అవసర మనుకొన్న సందర్భాల్లోను అంతస్సౌందర్య స్వరూప నిరూపణంలో, విజ్ఞతతో, ఔచిత్యంతో రచనను సాగించిన మహాకవి జాషువా !

ముంతాజ్ సౌందర్య వర్ణనకవకాశమున్నా గూడా అలాంటి దానికై అవ కాశం కల్పించలేదు జాషువా; శృంగార వర్ణన చేయ్యలేదు. ఔచిత్యంతో భావనా బలంతో, శబ్ద సౌందర్య వ్యంగ్య స్ఫూర్తితో సముచితంగా వర్ణించిన తీరు 'ముంతాజ్ మహల్'లో మనం గమనించగలము. ముంతాజ్ షాజహాన్ల మధుర ప్రణయాన్ని వర్ణించినతీరు అనితర సాధ్యం.

"ఆ సతీపతుల గాఢాశ్లేషములనుండి
జారిపోయిన నిమేషంబు లేదు,
ఆ దంపతులకు ఆహ్లాదంబు గూర్పక
తొలగిన వెన్నెల తునక లేదు;
ఆ ప్రేమ జీవుల యనురాగవృద్ధికై
రుతమొనర్పని పరభృతము లేదు,
ఆ శుభాకృతుల నెయ్యంపు ముద్దులచేత
తీపికెక్కని ద్రాక్ష తీగ లేదు,
అవధిలేని వారి ఆనందకేళికి
తోడుపడని పూలతోట లేదు,
వారికూర్మి పెంపు వలచి వర్ణనచేసి
సుప్రసిద్ధిగనని సుకవి లేదు! (ముంతాజ్ మహల్). చివరికి ఆ

అమర ప్రణయాన్ని వర్ణించి జాషువా సైతం సుప్రసిద్ధి పొందిన సుకవిగా మిగిలిపోయాడు.

జాషువా ఆత్మీయాంశతో కూడిన కావ్యం ఫిరదౌసి. 'ఫిరదౌసి'లో తండ్రికి తగ్గ కూతురు ఫిరదౌసి పుత్రిక. తండ్రి మరణానంతరం బంగారునాణేలు గ్రహించుమని భటులు కోరినప్పుడు తండ్రిని పొట్టపెట్టుకొన్న ఆ ధనాన్ని తిరస్కరించిందా పుత్రిక. ఈ విషయం ఆమె పాత్రచిత్రణకెంతో వన్నె తెచ్చింది.

"ఇది నా తండ్రిని కష్టపెట్టిన శరం బీస్వాపతేయంబు ము
ట్టుదునా; నా జనకుండు కంట తడిపెట్టున్ స్వర్గమందుండి, నా
మది తండ్రిన్ దయతోడ నేలిన నవాంబుదైన మీ స్వామికిన్
బదివేలంజలులిచ్చెదంచుబలుక్కాడని బాష్ప స్విన్నదుఃఖాస్యయై"

—న దట ఆ అభిమానవతి. స్వర్గంలో ఉన్న తండ్రి - ఈ ధనం పుచ్చుకొంటే- కంట తడిపెట్టు తాడనడంలో విశేషముంది. స్త్రీ స్వభావ నిరూపణలో జాషువా చూపిన మెళకువ విదితమవుతుంది.

'స్వప్నకథ, అనాథ' రెండు కథాకావ్యాల్లో ఒకటి నింగికి సంబంధించింది: మరొకటి నేలకు సంబంధించింది. అయినా నింగికి సంబంధించినట్లు చెప్పినా అది నేలపై జరిగిన కథ. కల్పన అయినా నేలపై జరిగిన వాస్తవగాథ స్వప్న కథ. అందులోని కథానాయిక పడ్డ కష్టనష్టాలను కన్నులకు కట్టినట్లు వర్ణించి ఈ భారత భూమిలో స్త్రీకి జరిగే ఘోరాలు నిరూపించారు జాషువా. అలాగే అనాథ కథలోని హీన దీన స్థితిని కరుణ రసాత్మకంగా వర్ణించిన తీరు అనితర సాధ్యమంటే అబ్బురపడవలసిన పనిలేదు. పీఠికలో ఈ రెంటింటిని గూర్చి "ఇక్కావ్యమున స్వప్నకథ, అనాథయను రెండు కథలు కలవు. ఇందు మొదటిది సమగ్రము. రెండవదసమగ్రము. ఒకటి మూటగట్టిన గాలి, యొకటి సలసలగ్రాగి చిందించిన కన్నీటి బిందువు-" అని జాషువా పేర్కొన్నా, రెండుకావ్యాల్లోను వర్ణించిన స్త్రీల దీనాతిదీనగాథలు సమస్త భారతనారీ లోకానికి ప్రతీకలు; ప్రతినిధులు. అలా భావించిన జాషువా నారీ హృదయవేదనలను ఈ కథల్లో నిరూపించారు. స్త్రీకి జరిగే అన్యాయానికి జాషువా మనసు రోదించి మహిళాభ్యుదయకాంక్షిగా ఇలా చిత్రించారు.

లోకంలో తల్లి ప్రేమకు మించిన ప్రేమలేదు. జాషువా ఎవరికీ దక్కని

అత్యంత మాతృప్రేమానురాగాలకు నోచుకొన్నవాడు. కవి గనుక ఆ తల్లి ప్రేమను పలురీతుల అభివర్ణించి తరించాడు. తన తల్లిపాల పుష్టి వల్లనే తన కింతటి కవితా వైభవ మబ్బిందని జాషువా భావన.

"పుణ్యములతల్లి! నీపాల పుష్టికతన
కవనబాలిక నాజిహ్వ నవతరించె"నని వివరించారు.

"అడ్డాల నాడు బిడ్డలుగాని గడ్డాలనాడు గా"దనే సామెత ఉన్నా, కన్నతల్లికి కొడుకెప్పుడూ చిన్నవాడే; తల్లి ప్రేమకి నోచుకొన్నవాడే. ఈ విషయాన్నే జాషువా చక్కగా హృదయమార వర్ణించారు.

"నలుబది యేండ్లు' దాటినవి, నాకిపుడున్ నను ముద్దులాడు ము
ద్దుల జననీ: భవన్మధుర దుగ్ధము రక్తము రంగరించి, యు
గ్గుల నిడినావు; నీ హృదయ గోళము లోపల నేను తమ్ముడున్
మెలగని తావు లేదు; గణనీయము నీజననీత్వ ముర్వరన్"
(కన్నతల్లి - ఖం.కా-3)

'నలుబది యేండ్లు' మాత్రమే గాదు; 'అఱువదియేండ్లు' అయినా తల్లి ప్రేమ మాధుర్య మెంతటిదో విశదీకరిస్తూ 'తల్లి కంటికి తాను చిరుత'నని వివరించిన విషయం అందరినీ ఆకర్షించే అంశం; అందరు పుత్రులు తమ తల్లుల ప్రేమాను రాగాలను స్మరించుకొని ఆనందిస్తారు.

"అఱువది యేండ్లు నాదగు శిరోగ్రము నెక్కెనఁ దల్లి కంటికిన్
జిఱుతను గాక పోనిది, విచిత్రము, నేనిలు దాటిపోయినన్
మఱలిన దాక నా వెనుక మాయమ జీవము మూడుగాళ్ళతోఁ
దిరుగుచునుండు; నీఋణము దీరదు రక్తము ధారవోసినన్"
(మాతృప్రేమ - ఖం.కా. 2)

తనకు అరవై ఏళ్లు వచ్చినా, తల్లికి తాను చిరుతవాడే. తనకై మూడు కాళ్ళ ముసలిదైన తల్లి తపించి పోతుందనడంలో ఆ తల్లి ప్రేమ విదితమవుతుంది. ఆ ప్రేమను చూరగొన్న ఘనత జాషువాది;

ఇలాంటి ప్రేమానురాగాలతో పాడగల తల్లులు కావాలని, ఉత్తమ భావిభారత పౌరుల్ని తయారుచేయగల మాతృవనరమే, మాతృ విశ్వాసాలను, పరికి మంచును ఉగ్గుపాలతో నూరిపోస్తే దుష్టమాతలు పనికిరారని జాషువా దుయ్యబట్టారు.

"............ ...          ... ........          .......మా"
ముద్దు సుతుండు, మాకనుల ముందు నటించిన వాలు; ఎందు
పిద్దెలు మాకు! నందు రవికేకిను లమ్మలు పేలుపెట్టులై"
"బూచుల జూసి బాలకుల పూతమనస్సుల నొసులెత్తు వీ
రోచిత ధీర భావముల యుబ్బు లడంపుట చేత, భీరుతా
నీచ గుణంబులేర్పడుట నేరరు కొందరు తల్లు; లిట్టి పై
శాచిక వత్సలత్వములు జాతికి తీరని వజ్ర ఘాతముల్"

(మాత - ఖం. కా. 5)

తల్లి ప్రేమను తన తల్లిలోనేగాదు; ఆనుంగుభార్యలో సైతం మాతృ ప్రేమనుచూశాడు. ఆ విషయాన్నే భార్య మరియమ్మ మరణంతో అనంత దుఃఖ సాగరంలో మునిగిపోయి జాషువా విలపించిన తీరులో విదితమవుతుంది. భార్య కత్యంత గౌరవ స్థాన మందిచ్చిన ఘనత జాషువాది !

"నా తను యష్టి ప్రత్యహంబునన్ గలపుష్టికి కారణంబు నీ
చేతి సుధారసంబకద ? చిక్కెనె నా కనరాదు గాని, నా
మాతకు మారుగా, యనుగు మానిని రూపము దాల్చినట్టి నా
జాతక పుణ్య రేఖవో, ప్రశస్త శుభైక వరప్రదాత్రివో!
(ఋణవిముక్తి - కొత్తలోకం)

జాషువా భార్యను తన 'జాతక పుణ్యరేఖ'వని అభివర్ణించడంలో ఈ అదృష్టమంతాతనదిగాదు; ఆవిడ తన భార్య గావడంతోనే తన 'జాతక పుణ్య రేఖ'గా మారిందని భావించడంలో విశేషముంది; జాషువా హృదయం విదిత మవుతుంది.

భార్య మరణానంతరం తల్లి తండ్రితానై కూతురు హేమలతకు వివాహం చేసి దీవించిన తీరులో జాషువా హృదయం తనయపైగల వాత్సల్యం స్పష్టమవుతుంది. తన తల్లి లేకపోవడంతో 'మిగిలెన్ రసహీన కవిత్వవాణియున్, తూలెను దేహదార్ఢ్యము' అని వాపోయారు. 'మహాసతులకు శిరోరత్నంగా భాసించిన ప్రేమైక మూర్తి కన్నతల్లి 'ఏదిశ నిల్చి యీక్షణ హారతులిచ్చుచున్నదో' అని భావించారు జాషువా. లవణంతో హేమలతావివాహాన్ని ఇలా వర్ణించారు మనోజ్ఞంగా—

"కలమున గన్నకూతులకు, గౌరవలీల వివాహకార్యముల్
సలిపితి, కడ్పునంగనిన నాతనుజన్మకు నీకునేడు పెం
డిలి యొనరించుచుంటి ధరణీసుర బాలునకిచ్చి, వార్ధిలో
గల లవణంబుతో యుసిరికాయకు పొత్తు ప్రసిద్ధమే కదా!

—లవణం పేరును గ్రహించి సంద్రంలోని ఉప్పుకు అడవిలోని ఉసిరికి సంబంధాన్ని చక్కగా నిరూపించారు.

".... సద్బ్రాహ్మణు చెట్టపట్టితివి గాంధేయుల్ ప్రశంసింప, స
త్కవి పుత్రీ! నుతికెక్క నీకతన గోత్ర ద్వంద్వ మత్యున్నతిన్"
(తండ్రి దీవెన-ఖం.కా. 7)

పుట్టిన ఇల్లు, మెట్టిన యిల్లు రెండింటిని అత్యంత గౌరవభాజనంచేయవలసిందని జాషువా హేమలతను దీవించారు. హేమలత ఈనాడు తండ్రి జాషువా జయంత్యుత్సవాల సమయంలో 'జాషువా ట్రస్టు' ఏర్పాటుచేసి జాషువా సాహితీ గౌరవాన్ని ప్రచారం చేయ ప్రయత్నిస్తున్నారు. తండ్రి ఆశీస్సులు ఫలించాయి.

ఇలాగా ఇంట తల్లిని, భార్యని, తనయను గౌరవించిన తీరులో జాషువా వ్యక్తిత్వం స్పష్టమయ్యి, బయటగూడా స్త్రీకి ఉత్తమ గౌరవం సమకూర్చాలన్న ధ్యేయాన్ని అభివ్యక్తీకరించారు.

కాటమరాజుతో కలిగిన కయ్యంతో పగరకు వెన్నిచ్చి పారిపోయివచ్చిన ఖడ్గతిక్కనను శూలాల్లాంటి మాటలపోటులతో పీడించి మళ్ళీ యుద్ధరంగానికి పంపిన

'వీరచానమ్మ'ననేక రీతుల సంస్తుతించిన జాషువాకు స్త్రీపట్ల ఉన్న అపారగౌరవం వ్యక్తమవుతుంది. యుద్ధరంగం నుంచి తిరిగివచ్చిన భర్తను చూసి "క్రోధోజ్జ్వల మూర్తివై, పసుపులుండల్ జూపు మా ఖడ్గతిక్కన యర్ధాంగికి, వీరచానమకు రక్త స్వాగతాభ్యర్చనల్" అని కొనియాడి, నీతో పాటు ముగ్గురాడవాళ్ళమయ్యామని, మంచంచాటున పసుపు రాసుకొని స్నానం చేయమని వీరచానమ్మ భర్త ఖడ్గ తిక్కన్నను పరిహసించిన తీరు తీవ్రంగా ఉంది.

"ముగు రాడంగులమైతి మిప్పటికి నీ పుణ్యాన నింకెందు కీ
మగరాయల్ ధరియించు కాలుసు, డవాల్, మాణిక్యరత్నాంచితం
బగు ఖడ్గంబని భర్తలో కటుకు వీరావేశ వహ్నిచ్ఛటల్
రగులన్ దగ్గరి బుగ్గలం బొడుచు వీరన్ నారి సూచించెదన్"

"ప్రాణభీతి పరచివచ్చిన మగయాడు
దాన వింక నీకు మానమేల ?
పసుపు రాచుకొమ్ము ముసుగులో"నని భర్త
నెత్తిపొడుచు మహిళ కేటికోచ్చ" (వీరచానమ్మ-ఖం.కా.6)

చానమ్మ పరిహాస తీవ్రతతో 'భర్తలో కటుకు వీరావేశవహ్నిచ్ఛటల్ రగులన్' చేసినదట; అంతటితో ఆగలేదు. 'బుగ్గలన్ బొడిచి'నదట. అందువల్లనే చానమ్మ 'వీరనారి'!

ఇలాగే రష్యన్ నారి అంతరిక్షయానంచేసి వచ్చిన వాలంటీనా తెరెష్కోవాను 'వీరకుమారి'గా వర్ణించిన తీరు గమనించగలం.

"గగనేందిర! నీ శిరమున
నగణ్య నక్షత్ర వజ్రహారములిడి ము
ద్భుగ స్వాగతంబు లిడెన
ఖగములు గానంబుచేయ వాలంటీనా!"
(వీరకుమారి-ఖం.కా. 7)

అనాదిగా స్త్రీపట్ల పురుషుడు చూపే వివక్షను ఈనాడు స్త్రీవాదులు పురుషాహంకారంగాను, పురుషాధిపత్యంగాను వర్ణించి, వాటిని అణచిపెట్టి స్త్రీకి సమాజంలో పురుషుడితో సమానగౌరవం కావాలన్నది జాషువా ధ్యేయం. ఈ విషయంలో జాషువా పురుషాహంకారాన్ని, పురుషాధిపత్యాన్ని 'అల్లుడు' (ఖం.కా. 4) ఖండికలో చక్కగా చిత్రించారు. ఆ అల్లుడు హృదయం లేకుండా భార్యనేలగలిగాడట. పెళ్ళికాగానే అల్లుడి ప్రవర్తన ఇలా వర్ణించారు జాషువా !

'కొట్టుటకు తిట్టుటకు నొక
పట్టా జన్మించినట్లు భావించి, పెతల్
బెట్టితి నిల్లాలిని: నా
పెట్టు శ్రమల నోర్చె సతియు విధి యనుకొనుచున్,"
"సతులొనరించిన పూర్వా
ర్జిత కర్మంబనుచు నింద చేసితి సకియన్;
సుతియును మోక్షంబెరుగని
సతీమణియు నమ్మె పరమ సత్యంబనుచున్"
"ఎంతగడ్డి గఱచి యెన్నిండ్లు దూరిన
సంఘశక్తి నాకు సాయమయ్యె:
పడతి గడపదాట పదివేల కనులతో
పట్టియిచ్చి బువ్వ తిట్టిపోసె" (అల్లుడు ఖం.కా.4)

పై పద్యాల్లో పెళ్ళికాగానే కొట్టి తిట్టడానికి హక్కు పట్టా దొరికినట్లు భావించి పీడించాడట; ఇదీ విధి అని భార్య ఓర్చుకొంది. నీ కర్మ అన్నాడట. నిజమేనని భార్య భావించిందట. తానెన్ని తప్పిదాలు చేసినా 'మగవాడు'కనుక సంఘనీతి తన్నే సమర్థించి సాయపడిందని భావిస్తున్నాడు. ఇందులో పురుషాహంకారాన్ని, అధిపత్యాన్ని చక్కగా వివరించాడు జాషువా !

'వంచిత' (ఖం.కా. 5) అనే ఖండికలో జాషువా స్త్రీకి జరిగిన అన్యాయాన్ని వివరించారు. పురుషులు స్త్రీని వంట ఇంటికొరముట్టుగా గణిస్తుండగా, భారతనారి నని దాస్యమాచరిస్తున్నావు. 'తలవాకిలి దాటని పుట్టు ఖైదివై' అని కరుణరసాత్మ

కంగా తెలిపారు. 'వలపుల రాణిగా, చిలుకపలుకుల చక్కెర పిండి బొమ్మగా అలికుల వేణిగా' స్త్రీని పొగడి ఆకాశంలో ఊయలగట్టి ఊపుతున్నాడీ పురుషుడిన్ని యుగాలనుంచి, కాని పురుష హృదయం నీవు గమనించలేదనీ, 'సాంఘికపు టుగ్ర పిశాచముక్కుపాదాలతో తొక్కిపెందగా, స్తోత్రపాఠాలకు మురిసిపోతున్నావా! అనీ, బాధపడుతూ—

"నిన్నాకాశము దాకగా బొగడుచున్ నీ యంద చందాలతో
వన్నెల్ దీర్చి కవిత్వమల్లుకొనుచున్ పైపై పరామర్శలన్
నిన్నున్ నీదు శరీరముల్ హృదయమున్ ఛేదించి వేదించి యుం
ఛిన్నంబుం బడవేయు సంఘమును విత్తా! యెట్లు హర్షింతువో!"

—అని అత్యంత సానుభూతిని చూపిస్తున్నారు. స్త్రీ వివిధ దశల్లోపడే వేదనను వివరించా రీ పద్యంలో.

అత్తమామల క్రూరమైన దాడికి లొంగి
పలుకాడరాని కోడలితనంబు,
మగని యాయువులతో దెగి ముండమోయించి
గేలి గొట్టించు నిల్లాలితనము,

పతిభక్తురాలన్న పద గౌరవముదక్క
సౌఖ్యంబెఱుంగని చానతనము
అన్నదమ్ములవోలి నాస్తిపాస్తుల మీద
హక్కులించుకలేని యాడుతనము

ఒక్క భరతవర్ష యువతీమణికి నీక
తగునటంచు బిట్టు బొగడుచుండు
మోసగాండ్రు నమ్మి పూజించు నినుజూచి
శిష్టజనుల కన్ను చెమ్మగిల్లు" (వంచిత-ఖం.కా.5)

ఇలాగా స్త్రీ పట్ల సమాజమూ, మనసంస్కృతీ, మనధర్మాలు,కర్మసిద్ధాంతాలు అంతకంటే పురుషులు చూపిన వివక్షను వివరించారు జాషువా కన్నులకు కట్టినటు.

'పురుషులంటే నెత్తిన కొమ్ములున్నవాళ్ళనీ, మహాత్ములనీ అనుకో పనిలేదు. స్వార్థసంఘం స్త్రీకి అజన్మబానిసత్వాన్ని అంటగట్టింది. పరదా తొలగించుకొని స్వేచ్ఛా వాయువులను పీల్చుమని బోధించారు జాషువా. ఇంకా ఇలా ప్రబోధించారు.

గడ్డాల్ మీసములున్న వారమనుచున్ గర్వించి మీ నైపుణుల్
గొడ్డుందోవగ పూరుషుల్ నెరపు యుక్తుల్ నమ్మి సేవించుచున్
గుడ్డల్ దొడ్డనగల్ ధరించుకొని షోకుల్ జేసి మోదింతువా ?
బిడ్డా ! యెంతటివెఱ్ఱిదానవు కళావిశ్వంబు నీక్షింపుమీ"

(ప్రబోధము-ఖం.కా.4)

పురుషుని మోసప్రయుక్త యుక్తులకు స్త్రీ ఎలా లోబడి, మంచిబట్టలు,నగలు, షోకులతో సంతృప్తిపడి అనాది నుంచి ఎలా నడుచుకొంటూ ఉందో వివరించి కళాత్మకమైన ఈ ప్రపంచాన్ని పరిశీలించుమని ప్రబోధించారు.

పురుషులు, స్త్రీకంటే పురుషుడధికుడని తాటాకుల్లో రాశారు; కంఠమెత్తి ప్రచారం చేశారు. స్త్రీ జాతికే ఇది తీరని అన్యాయం. స్త్రీకి పురుషునితో సమాన గౌరవం ప్రసాదించవలసిందని పరమేశ్వరుని ప్రార్థించారు జాషువా.

"స్త్రీకన్నన్ బురుషుండు శ్రేష్ఠుడనుచున్ సిద్ధాంతముల్ చేసితా
టాకుల్ కంఠమునెత్తి స్త్రీ జగతికన్యాయంబు గావించె నో
యేకాలంబున పుట్టి నెంటయిన లేవే నాటి స్వాతంత్ర్యముల్
స్త్రీ:కీ మారు సమాన గౌరవవిభూతిన్ గాంతకుంగూర్చు మా !

(కొత్తలోకం-26)

పురుషులు స్త్రీలను అబలలని అణచి వేశారు. వారికున్న సహజ శక్తులను గుర్తించలేదు. వాటి పెంపుకై ప్రయత్నించలేదు. కాబట్టి పురుషుల అణచివేతనుంచి బయటపడి స్త్రవు సబలవని నిరూపించుకొమ్మని మహిళాలోకానికి మాన్య ప్రబోధం చేశారు జాషువా :

"అబలయన్న బిరుదమంటించి, కాంతల
స్వీయశక్తు లదిమి చిదిమినారు
సబలయన్న బిరుదు సాధించి హక్కులు
గడనచేసికొమ్ము కష్టచరిత !" (వంచిత-ఖం.కా.5)

అనాదినుంచి వస్తూన్న ఈ దుస్థితిని నవ నాగరక నారీలోకం గుర్తించిందన్న మగవాళ్ల మటుమాయల నుంచి తప్పించుకొని తన వ్యక్తిత్వాన్ని, శక్తి సామర్థ్యాల్ని తెలుసుకొని జాషువా చివరికి గ్రహించి 'నేటి నెలత'ను ప్రశంసించారు.

"గ్రహియించినది నేటికామినీ తిలకంబు
  బురఖాలకెరమైన బుద్ధిబలము,
తెలిసికొన్నది నేటి కలికి ముద్దులగుమ్మ
  యుబ్బించు గాథలందున్న కిటుకు:
అర్థమైనది నేటి యంబుజాతాస్యకు
  లేశ్రత బడుత పెండ్లిండ్లసేసి,
  ఆకళించినది నే డమలోక్తి చాతుర్య
పసిడిబొమ్మల రిత్తబరువుచేటు,
కాంత మగవారితో చేయి గలపకున్న
తలపనేల యనర్థంబు తప్పదనుచు
భారతజోటి చిత్తంబు కోరగింప
కలముపట్టిన దీనాటి పెలదిమిన్న" (నేటినెలత-ఖం.కా.4)

ఇలాగా తన కాలానికే మహిళలు మాన్యలై లోకరీతిని గుర్తించి తమ హక్కును పరిరక్షించుకో నారంభించారని జాషువా సంతృప్తిని వ్యక్త పరచారు.

నేనారంభంలోనే పేర్కొన్నట్లు జాషువా 'దళిత, స్త్రీవాద' శబ్దప్రయోగం చేయకపోయినా, సమాజంలో మాయని మచ్చ అయినఅంటరానితనాన్ని, సమాజంలో మహిళకివ్వవలసిన గౌరవాన్ని ఎలుగెత్తి కమనీయ కవితామయం చేశారు జాషువా ! నేనంటాను ఈనాటి సంఘసంస్కర్తలకు, స్త్రీవాదులకు జాషువా ఆదర్శ పురుషుడని.



# ఆచార్య ఎస్. గంగప్పసాహిత్యం

కోలాచలం శ్రీ నివాసరావు నాటక సాహిత్య సమాలోచనము 1977,
క్షేత్రయ్య పదసాహిత్యం 1974, తెలుగులో పదకవిత 1983,
వేయిపడగలు విశ్లేషణాత్మక విమర్శ 1987, అన్నమాచార్య,
ప్రముఖ వాగ్గేయకారులు: తులనాత్మక అధ్యయనం 1992,
సారంగపాణి పదసాహిత్యం 1980, సాహిత్యసుధ 1981,
జాతికి ప్రతిబింబం జానపద సాహిత్యం 1984,
తెలుగు నాటకం 1985, భాషా వ్యాసాలు 1985
వేమన భావన 1987, ప్రసంగ సాహితి 1978,
తెలుగు వాగ్గేయకారులు 1983, జానపద సాహిత్యం 1983
ఎర్రన రసపోషణ 1991, సాహిత్యసమాలోచన 1991
సాహిత్యానుశీలన 1993, పదసాహిత్య పరిమళం 1994
జాతీయ ప్రసంగ సాహితి 1995, అన్నమయ్య సంకీర్తనసుధ 1995
సిద్ధేంద్రయోగి 1978, కోలాచలం శ్రీ నివాసరావు 1973, క్షేత్రయ్య 1976 1976
బాలగేయాలు 1981, నవోదయం 1981, తీరని భయం 1985
సుహాసినీ హాసం 1967, రాజరాజ ప్రశస్తి 198[illegible] ఆత్మార్పణం 1988
పదకవితా పితామహుడు 1986- మరెంకెన్నో ముద్రితం:
ముద్రణకు సిద్ధంగా ఇంకా కొన్ని విమర్శనాత్మక, సృజనాత్మక రచనలు

జాతీయ అధ్యాపకులుగా అలీగడ్, బెనారస్, మద్రాసు, తెలుగు విశ్వవిద్యాలయాల్లో ఆంధ్ర, తెలుగు, ఉస్మానియా విశ్వవిద్యాలయాల్లో పునశ్చరణ తరగతుల్లో.

అవార్డులు : 1972-73 క్షేత్రయ్య పదసాహిత్యం- ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డు.

1980-81 తెలుగులో పదకవిత- ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డు.

1983-85 కేంద్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ సీనియర్ ఫెలోషిప్పు

1984 : 'వేయిపడగలు' విమర్శకు విశ్వనాథ సాహిత్యపీఠం అవార్డు.

1989-91 యు. జి. సి. జాతీయ అధ్యాపకులు అవార్డు.

1991-92 ఉత్తమ అధ్యాపకులు ఆం. ప్ర. స్టేట్ అవార్డు.

1991-92 ఉత్తమ పరిశోధన: తిక్కవరపు రామిరెడ్డి స్మారకధర్మనిధి అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయం

1993. అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు: తులనాత్మక అధ్యయనం, తెలుగు విశ్వవిద్యాలయం సాహితీపురస్కారం.

పదవులు : సభ్యులు, పాఠ్యనిర్ణాయక సంఘం:అలీగడ్, బెనారస్, ఉస్మానియా, కాకతీయ, శ్రీ కృష్ణదేవరాయ, నాగార్జున విశ్వవిద్యాలయాలు: విజయవాడ ఆంధ్రలయోలా కళాశాల.

1993-96 అకడమిక్ సెనేట్ సభ్యులు: తెలుగు విశ్వవిద్యాలయం.

1994-96 అధ్యక్షులు: పాఠ్యనిర్ణాయక సంఘం, నాగార్జునవిశ్వవిద్యాలయం.

1994-97 అధ్యక్షులు: పాఠ్యనిర్ణాయక సంఘం; ఆం. ప్ర. బోర్డు ఆఫ్ ఇంటర్మీడియేట్ ఎడ్యుకేషన్, హైదరాబాద్.